మార్చి 16 విడుదల



లక్ష్మీ ఎంటర్‌ప్రైజెస్

# సంపూర్ణ రామాయణము

(ఈస్ట్‌మన్ కలర్)

రచన ఆరుద్ర. ముళ్ళపూడి వెంకటరమణ * సంగీతం. కె.వి. మహదేవన్ * కెమెరా. కె.ఎస్. ప్రసాద్

నిర్మాత నిడమర్తి పద్మాక్షి * దర్శకుడు బాపు





ముఖచిత్రం: శిశిరవసంతౌ పునరాయతః

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ. 18-00

దీపావళి సంచికతో రూ. 23-00

# ఫిలిం పరిశ్రమ సేవకు చిహ్నము




తెన్నేటి

## విజయ స్టూడియోస్
## వాహిని స్టూడియోస్
## మదరాసు



ఫిబ్రవరి నెల "యువ" ముఖ చిత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది. కావిలిపాటి విజయలక్ష్మిగారి సీరియల్ ఎవరూహించని విధంగా క్రొంగ్రొత్త పంథాలో నడుస్తున్నవి. "ఐశ్వర్యం తుడు" కథ వాస్తవానికి దగ్గరగా ఉంది. "అనాథ బాలుడు" కథ చదువుతుంటే కన్నీరు ఆగలేదు. "కప్పడపుగు" సీరియల్ ముగింపు ఏవిధంగా ఉంటుందో!! ఈ సంచికలో కార్టూన్లు చాలా బాగున్నవి.

—వై. పరశురామ్,
నరేంద్రపురం.

ఫిబ్రవరి నెల "యువ" సంచిక మమ్ము చాలా ఆకర్షించింది. ఇందులో ముఖ్యంగా విజయలక్ష్మిగారి "ఆశల ఆరాటంలో జీవనపోరాటం" సీరియల్ చాలా బాగుంది. ఆ తర్వాత కౌసల్యాదేవిగారి "భవిష్యత్కవిత" మరియు "ఎక్కువ తక్కువ కులాలు" కథలు మాకు బాగా నచ్చాయి. సీరియల్స్ చాలా చాలా బాగుంటున్నాయి. రచయిత (త్రు)లకు మా హృదయపూర్వక అభినందన

ఖలు తెలుపుతున్నాము. ఈ పత్రిక ర్వాహకులకు ప్రత్యేక ధన్యవాదాలు.

—యాలాల కాశీనాథ్,
యాదగిరిగుట్ట.

పరిమళా సోమేశ్వర్‌గారి "తప్పటడుగు" సీరియల్ రసవత్తరంగా నడుస్తోంది. ముఖ్యంగా ఫిబ్రవరి సంచికలో ఎఱ్ఱగా మెరిసిపోతున్న కుంకుమబొట్టు. న గుండెలోని రక్తం ఒక్కొక్క ట్టు పోయి ఆమె ముఖాన్ని కుంకుమ ఖలా అలంకరించింది." చదివిన ప్రతి ఠకుడూ మరువలేని మాటలు. "జననీ న్మభూమీ" ధనవంతులు స్వార్థంలో లైపోతే, పేదవాడు నీతి నిజాయితీతో, స్వార్థంగా దేశసేవచేసి పునీతు డవుతాని రచయిత్రి గారు చక్కగా నిరూపించారు. కావిలిపాటి వారి "ఆశల ఆరాటంలో జీవన పోరాటం" చాలా బావుంది "కల" కథ సరదాగా వుంది. రచయితకు నా ధన్యవాదాలు.

—యం. స్వర్ణ.
తెనాలి.

ఫిబ్రవరి 1972 "యువ" సర్వాంగ సు ;దరంగా యున్నది. వద్దాది పాపయ్య గారి కార్టూనులు బాగుగా యున్నవి. పరిమళా సోమేశ్వర్‌గారు, కథా వస్తువు యెంత శృంగారాత్మక మైనప్పటికి సున్నితంగా చెప్పుటలో ీద్ధహస్తులని సీరియల్ "తప్పటడుగు" లో నిరూపించుచున్నారు.

—బి. కైలాసరావు పట్నాయిక్,
విశాఖపట్టణము-1.

# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 25 మార్చి—1972 సంచిక 3


అయిదేళ్ళ తరువాత మళ్ళీ ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి ఎన్నికలు మార్చి 5, 8 తేదీల నాడు జరుగుతున్నవి. మామూలుగా పార్లమెంటు ఎన్నికలుకూడా అప్పుడే జరుగవలసింది కాని. 1971 లో దేశమంతటా పార్లమెంటుకు ఎన్నికలు జరిగినందున. 1972 మార్చిలో ఆంధ్రప్రదేశ్‌లో అసెంబ్లీకి మాత్రమే ఎన్నికలు జరుగుతున్నవి. ఇదేవిధంగా, మరొక పదిరాష్ట్రాలలోకూడా అసెంబ్లీలకు ఎన్నికలు జరుగుతున్నవి.

అయిదేళ్ళనాడు. ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నికలు జరిగినప్పుడు కాంగ్రెసుపార్టీకి మంచి మెజారిటీ లభించింది. తరువాత కాంగ్రెసుపార్టీలో చీలిక ఏర్పడినప్పటికీ, రాష్ట్రంలోని అసెంబ్లీ కాంగ్రెసుపార్టీకి దెబ్బ తగలలేదు, అంచేత, అయిదేళ్ళపాటు రాష్ట్రంలో సుస్థిరమైన ప్రభుత్వం కొనసాగింది. గత అయిదేళ్ళలోనూ, రాష్ట్రంలో ఎన్నో ఆందోళనలు వచ్చాయి. అల్లరులు జరిగాయి. కాని, సుస్థిరమైన ప్రభుత్వం వుండడంవల్ల, ఆ ఆందోళనలు, అల్లరులు సమసిపోయాయి. పటుత్వమైన పరిపాలన కొనసాగిన రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ పేరు తెచ్చుకొన్నది.

అయితే, ఒక పెద్ద లోటుమాత్రం స్పష్టంగా కనపడింది. అదేమిటంటే, దిట్టమైన ప్రతిపక్షం అనేది రాష్ట్ర శాసనసభలో లేకపోవడం. బలమైన ప్రతిపక్షం శాసనసభలో లేకపోయినట్లయితే, ప్రభుత్వం చేసే అవకతవక పనులను ప్రశ్నించేవారు గాని, ప్రభుత్వం తప్పులు చేసినప్పుడు ప్రభుత్వాన్ని మందలించి. ఆ తప్పులు సవరించు

కొనేటట్టు చేసేవారుగాని. వ్యక్తిగతంగా మంత్రులెవరైనా పక్షపాత బుద్ధితో గాని వక్రప్రవర్తనవల్లగాని క్రమపద్ధతులను తప్పి సంచరిస్తే, వారి చర్యలను బయట పరచి పరిపాలన క్రమపద్ధతులలో జరిగేటట్టు చూసేవారుగాని వుండరు. గత అయిదేళ్ళలోను, శాసనసభలో బలమైన ప్రతిపక్షం లేని లోటు కొంత కనిపించక పోలేదు. ప్రతిపక్షం లేని ప్రభుత్వ పరిపాలన నియంతృత్వ పరిపాలనగా పరిణమిస్తుంది. కొన్ని సందర్భాలలో యిది స్పష్టంగా కనిపించకపోయినా, లోపాయకారిగా సాగుతూనే వుంటుంది. ఇలాటి పర్యవసానాన్ని అరికట్టడానికే, బలమైన ప్రతిపక్షం ప్రతి శాసనసభలోనూ వుండాలి. అలాటి ప్రతిపక్షం వున్నందువల్లనే, బ్రిటను లాంటి ప్రజారాజ్యాలలో, ఏ మంత్రీ అపకతవక పనులను చెయ్యడానికి సాహసించడు. ఒకవేళ అలాటి పనులను చేసినప్పుడు, ప్రతిపక్షం ఆ మంత్రి చర్యలను, ప్రవర్తనను బైటపెట్టడమూ, దాని ఫలితంగా ఆ మంత్రి తన పదవికి రాజీనామా ఇవ్వడమూ జరుగుతుంది. దీనివల్ల, ప్రజాప్రభుత్వము, పక్షపాత రహితంగా, అవినీతి చర్యలకు దిగకుండా, సరియైన పరిపాలన సాగించడానికి ఒక కాపుదల ఏర్పడుతుంది.

ఈ మార్చిలో జరుగబోయే ఎన్నికల విషయంలో, రాష్ట్రంలోని ఓటర్లందరూ జ్ఞాపకం వుంచుకోవలసిన ముఖ్యమైన సూత్రం ఇదే.

రాష్ట్రంలోని అన్ని నియోజకవర్గాలకూ, కాంగ్రెసుపార్టీ అభ్యర్థులు వున్నారు. వీరందరూ, యీనాడు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధికి గల పరపతివల్ల, తాము తప్పక గెలుస్తామని ఆశిస్తున్నారు. అభ్యర్థులను నిలబెట్టడంలో, పార్టీ ఆశకూడా అదే. ప్రస్తుత పరిస్థితులలో ఆ ఆశ, సమంజసమైనదిగానే కనిపిస్తున్నది.

రాష్ట్రంలోని అన్ని నియోజకవర్గాలలోనూ అభ్యర్థులను నిలబెట్టింది, ఒక్క కాంగ్రెసు పార్టీయే. మరే యితర పార్టీ, అరవై, డెబ్భైమందికి మించి అభ్యర్థులను నిలబెట్టలేదు. అంటే, మెజారిటీ సీట్లను గెలుచుకొని, రాష్ట్రంలో సుస్థిరమైన ప్రభుత్వాన్ని స్థాపించగలమనే ధైర్యంగాని, ఆశగాని ఏ యితరపార్టీకి లేదన్నమాట.

ఒకవేళ కాంగ్రెసుపార్టీ మెజారిటీ సంపాదించుకో లేకపోతే, రెండు, మూడు పార్టీలు కలసి ఏదో ఒప్పందం చేసుకొని ప్రభుత్వాన్ని సాగించాలి ఇలాటి సమాఖ్యల వల్ల ఏర్పడిన మంత్రిమండలులు, ఎక్కువకాలం అధికారంలో వుండవనే విషయం, ఇతరరాష్ట్రాలలో గత అయిదేళ్ళలోనూ జరిగిన సంఘటనలవల్ల స్పష్టమౌతూనే వున్నది. పరిగణనీయమైన మెజారిటీవున్న ఒకే ఒక పార్టీ ఏర్పాటుచేసిన మంత్రిమండలి అయితేనే పూర్తిగా అయిదేళ్ళపాటు పరిపాలన సాగించగలదు. అలాటి మంత్రిమండలివల్లనే, రాష్ట్రంలో పటిష్టమైన ప్రభుత్వం ఏర్పడగలదు. కాబట్టి, ఒకే

ఒక పార్టీకి చెందిన సభ్యులు మెజారిటీలో వుండేటట్టుగా, ఎన్నికల ఫలితాలు వుండాలి.

అయితే, ఒకే పార్టీకి చెందిన సభ్యులకు మెజారిటీ గల అసెంబ్లీ ఏర్పడడంతో, ఈ పార్టీ పరిపాలన అవకతవకలు లేకుండా కొనసాగడంకోసం, బలమైన ప్రతిపక్షం కూడా అసెంబ్లీలో వుండాలి.

అలా వుండాలంటే, ఓటర్లు ఏం చెయ్యాలి?

కాంగ్రెసుపార్టీ యే రాష్ట్రంలో కూడా పరిపాలన సాగించడం, ప్రస్తుత పరిస్థితులలో వాంఛనీయం. కేంద్రంలో కాంగ్రెసు పార్టీ పరిపాలన సాగుతున్నప్పుడు, ఆ పరిపాలన పటిష్ఠంగా సాగుతున్నప్పుడు, రాష్ట్రంలో మరొక పార్టీగాని, కొన్ని పార్టీల సమాఖ్యగాని అధికారంలోకి వస్తే, కేంద్రానికీ రాష్ట్రానికీ మధ్య అంతర్యం వుండదు. రాష్ట్ర అభివృద్ధి కార్యక్రమాలకు కేంద్రంనుంచి సంపూర్ణ సహకారం లభించదు. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ ఒకే పార్టీకి చెందిన ప్రభుత్వాలు వుంటే, రాష్ట్ర అభివృద్ధి కార్యక్రమాలు, అంతరాయ రహితంగా సాగడానికి అవకాశం వుంటుంది. అందుచేత, రాష్ట్ర అసెంబ్లీకి, మెజారిటీ సంఖ్యలో కాంగ్రెసు అభ్యర్థులను ఎన్నుకోవడం అవసరమే. అయినా, బలమైన ప్రతిపక్షం వుండేటట్టుగా ఇతర అభ్యర్థులను కూడా ఎన్నుకోవాలి.

ఇలా ఎన్నుకోవడంలో, ఓటర్లు ఉపయోగించవలసిన కొలబద్ద ఒకే ఒకటి వుంది ఏ పార్టీకి చెందినవాడయినా సరే, అభ్యర్థి సమర్థుడవునా కాదా, నీతిపరుడు అవునా కాదా, ప్రజాక్షేమం ప్రధాన ఆశయంగా వున్నవాడవునా కాదా, అనే విషయాన్ని పరిశీలించాలి. రాష్ట్రపు బాగోగులను గమనించేవాడికీ, అంకితమైన ప్రవర్తన లేనివాడికీ, అవినీతికి పాల్పడవలసిన అవసరం లేనివాడికే ఓటు వేసినట్లయితే, అతడు గెలిచినట్లయితే, అసెంబ్లీకి సమర్థుడయిన సభ్యుడు ఎన్నిక అయినట్టేమాట అలాంటి సభ్యుడు, మెజారిటీ పార్టీకి చెందినవాడయితే, పరిపాలనా వ్యవహారాలు సక్రమంగా జరిగేటట్టు చూస్తాడు; ప్రతిపక్షానికి చెందినవాడయితే, పరిపాలనలో అవకతవకలు జరిగితే, వాటిని దిద్దించడానికి పాటుపడతాడు.

కాబట్టి, ఓటర్లు ముఖ్యంగా జాగ్రత్త చూపవలసింది, మంచి మనిషిని ఎన్నుకోవడం విషయంలోనే. అలా చేస్తేనే, తమ ఓటును సక్రమంగా వినియోగించినవారవుతారు.



# లోకోపకారం

—'ఆర్వీయ'

చాలామంది నాతో అన్నారు: "బ్రతికి వున్నందుకు సార్థకం లోకోపకారం చెయ్యడం. అలా చెయ్యలేనప్పుడు లోకాపకారమైనా అద్వా చెయ్యడం. రెండూకూడా చెయ్యలేనివాడు వ్యర్థుడూ, అనామకుడూ!" అని!

నాకు లోకాపకారం చెయ్యడం చేత కాదు. అందుచేత లోకోపకారానికి పూను కున్నాను. చేసిన పాపం చెప్తే పోతుం దంటారు. కాబట్టి నేను చేసిన ఘన కార్యాన్ని మనవి చేస్తాను.

అన్యాయమంటే సుతరామూ నాకు గిట్టదు. అన్యాయాన్ని ఎదిరించడానికి ఎంత దూరమేనా వెళ్లాలి ... ఎంతకేనా తెగించాలి.... అనుకునే బుద్ధిహీనులలో నే నొక్కణ్ణి! ఈ ఉపోద్ఘాతం చాలనుకుంటాను.

మా ఆఫీసులో ప్రశాంతమూర్తి అనే గుమాస్తా వుండేవాడు. పేరుకి తగ్గ నడవడి గలవాడు. అతనికి అర్జునుడికి వున్నట్టు కొన్ని బిరుదనామాలుకూడా వున్నాయి శాంతాకారం—అనంత శయనం—ఏమి …ాభం—వెంకటేశం—అని మా ఆఫీసు గుమాస్తాలు ముహూర్తమేనా చూడకుండా అతనికి ఈ పేర్లు తగిలించారు. ఎవ్వ రేమన్నా సరే—నిర్వికార నిరంజన నిర్గుణ …ర్లక్ష్యంతో—మానాభిమానాలు, దూషణ భాషణలు దేహానికిగాని ఆత్మకిగాని అంట …లవు—అన్న బ్రహ్మసూత్ర భాష్యానికి …వ్యప్రాయంగా మానావమానాల్ని చిరు నవ్వుతో స్వీకరిస్తూ తిరుగుతూండేవాడు.

అతను చాలా అమాయకుడు. ఎవరినీ తానేమో! మిగిలినవాళ్ళల్లో చాలామంది పని ఎగ్గొట్టేవారు. కాని ఆఫీసరు పల్లెత్తు మాట అనేవాడు కాదు. వాళ్లమీద కోపంతో ప్రశాంతమూర్తిమీద ఏదో ఒక సాకుతో ఒంటికాలిమీద లేచి మండిపడేవాడు! అలా అన్యాయంగా తిట్టినప్పటికీ నిష్కామ యోగి కనుక కిక్కురుమనకుండా భరించే వాడు. నాకు మహా కష్టంగా వుండేది. "అలా వూరుకుంటావేమిటయ్యా?" అని అడిగితే చిరునవ్వే సమాధానం! ఇతని మీద, ఇతన్ని అంటున్న ఆఫీసరుమీద నాకు మహాకోపంగా వుండేది. ఇతనిమీద కోపం ఎందుకయ్యా అంటే—అన్యా యాన్ని ప్రతిఘటించకపోవడం అన్యా యానికి చేయూత ఇవ్వడమేనని నాయొక్క స్వకీయా అమూల్యాభిప్రాయం.

తరువాత తోటి గుమాస్తాలకు చెప్పి చూశాను. "మనం అందరం వెళ్ళి ఆ ఆఫీసరు మహాశయుణ్ణి మందలిద్దాం. మన తోటి గుమాస్తాని మన ఎదురుగుండానే అకారణంగా, అన్యాయంగా, అనాలోచి తంగా నానా దుర్భాషలాడుతూ వుంటే— మనం చేతులు ముడుచుకుని కూర్చోవల సిందేనా? దీనికి ప్రతిక్రియ లేనేలేదా? లెండి. అతన్ని తిడితే ఒకటీ—మనల్ని తిడితే ఒకటీనా? మనం ధైర్యస్థైర్యా లతో ఈ అన్యాయాన్ని ఎదుర్కోవాలి"— అని శతపోరేను.

కాని, ఫలితం శూన్యం. "దార్లోవున్న కొర్రతీసి ఒంట్లో ఐగ్గొట్టుకునే ఈరుడివీ దీరుడివీ ఇక్కమార్కుడివీ మావే కనగాగు

హేళన చెయ్యకపోలేదు.

"నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు? నా ఇచ్ఛయేగాక నాకేటి వెఱపు?" అని ఆలోచించి "మానవ సేవయే మాధవసేవ" అని నడుం కట్టేను.

ఆరోజు సాయంకాలం అయిదు గంటలయింది. అంతమంది నాన్‌గెజిటెడ్ ఆఫీసర్లమూ ఇళ్ళకి పోవడానికి సర్దుకుంటున్నాము....

అంతలో, ఆఫీసరుగారి ప్రయివేటు గదిలోంచి పెడబొబ్బలు వినపడ్డాయి. మా ఆఫీసరుగారున్నారే — వారు అందరు మానవమాత్రులలాగా మాట్లాడరు. అంచేత ప్రతిదానికీ గావుకేకలు వేస్తుంటారు. ఆయన మృదుమధురంగా గాని, అధవా మెల్లగాగాని మాట్లాడడం మేమెవరమూ కనీ విని ఎరగని సంగతి.

"నాన్సెన్స్! ఇదా సమయం? డామిట్! అవతల టెన్నిసుకి వేళయిపోతూంది. మిసెస్ వటీరావు నాకోసం కాచుకుని కూర్చుంటుంది. బ్లడీ ఫూల్? ఇంక్రిమెంటట! ఇంక్రిమెంట్!! గెటవుట్!" అని కేకలూ, వెంటనే ఆఫీసరుగారు టెన్నిస్ రేకెట్‌తో ఇవతలకు రావడం, మోటార్ సైకిలెక్కి రివ్వున వేంచెయ్యడం .... రెప్పపాటు కాలంలో జరిగేయి.

నాకు వళ్లు ఉడుకెత్తింది. ప్రశాంతమూర్తిని చూసి "ఏమిటీ ఆఘాయిత్యం? ఏం జరిగింది?" అన్నాను.

"రెండు సంవత్సరాలయి ఇంక్రిమెంటు రాకుండా చేస్తున్నాడు. దాని గురించి విజ్ఞప్తి చేసుకుంటూ వుండగా ఆయనకి ఆగ్రహం కలిగింది. ఇదంతా నా కర్మ!" అని తల మొత్తుకున్నాడు.

ఇది చూసి నాకు తల కొట్టేసినంత పనయింది. ఎలాగైనా ఈ ఆఫీసరుకి బుద్ధి చెప్పి, ఈ ప్రశాంతమూర్తిని నిరంతర యమయాతననుంచి రక్షించాలన్న దృఢసంకల్పం కలిగింది .... ఇంతట్లో మా ఆఫీసరు పై అధికారి మా ఆఫీసు ఇన్‌స్పెక్షనుకి వచ్చేడు. ఆ సమయంలో — ఈ ఆఫీసరుగారు మా గుమాస్తాలమీద — ముఖ్యంగా ప్రశాంతమూర్తిమీద జరుపుతున్న అత్యాచార వివరాలతో ఒక చిన్న విన్నపాన్ని అందించాను. అంతే!

వారం రోజుల తర్వాత పై ఆఫీసు నుంచి కాగితం వచ్చింది. సారాంశం: నాకు ఆ వూరి నించి మరో చిన్న వూరికి బదిలీ చేసేరు. కారణం: ఆఫీసరువారి మీద ఋజువుకాని అసత్య—అన్యాయారోపణలు చెయ్యడం—ట! ఇకముందు ఇలాంటివి చేస్తే వుద్యోగం వూడిపోవచ్చుట'—నాకేమీ పాలుపోలేదు.

తత్‌క్షణమే పై ఆఫీసరు వారిని కలుసుకుని, "ఏమండీ సార్! నా ఆరోపణలు ఋజువు కాలేదన్నారు. నా తోటి గుమాస్తాలను ఎంక్వయిర్ చెయ్యకుండా ఋజువు కాలేదంటే ఎలాగు సార్?!" అని మొర పెట్టుకున్నాను.

వారు వెంటనే డ్రాయరు లోంచి ఒక కాగితం తీసి నా చేతిలో పెట్టేరు. ఆ కాగితం చూడగానే నా కళ్ళు బైర్లు కమ్మేయి.

మా ఆఫీసరుగారు బహు ఉత్తములు. ప్రశాంతులు. సమర్థులు. ఆయన నన్ను

శిట్టగం శుద్ధాబద్ధం. పనిలో లోటుపాటు లుంటే బహా సున్నితంగా మందలించే వారు. ఆయన తండ్రిలాంటివారు. తప్పు చేసిన పిల్లల్ని తండ్రి ప్రేమతో మందలించినట్టే నన్ను వారు మందలించేవారు. ఈ పిళ్ళ్యాదు చేసిన అసామీ పని ఎగ్గొట్టే బుద్ధిమంతులకు రింగు లీడరు మా ఆఫీసరు గారికి ఇతని పనులు గిట్టక. కొందలిస్తూ వచ్చినందువల్ల కలిగిన కార్పణ్యంతో ఇట్టి యోగ్యులైన ఆఫీసరు మీద ఇట్టి తలాతోకా లేని ఎవకతవక ఆరోపణలు చేసినాడు. పైగా ఇందులో నా పేరు రచ్చకీడ్వడం చాలా శోచనీయం.. "

ఇది ప్రశాంతమూర్తి స్వహస్తాల్తో రాసిచ్చిన స్టేట్‌మెంట్. ఇంకా చదివేను.

"..ఇతనికి ఆఫీసర్ల మీద తిరగబడడం మొదటినుంచీ అలవాటే! ఇదివరకొకసారి ఒక ఆఫీసరు వారి మీద పైళ్లకి రి ఉద్యోగం పూడినంత వరకూ తెచ్చుకోవడం జరిగింది. ఆ విషయం పెర్సనల్ పైల్ చూస్తే విశదం అవుతుంది...!"

నాకు మూర్ఛ వచ్చినంత పనయింది. వెనక్కి తిరిగి చూడకుండా ఇంటికి వెళ్ళిపోయాను. వెళ్తూనే ప్రశాంతమూర్తి దగ్గరికి వెళ్ళి "ఏమిటయ్యా. అవాకులూ-చెవాకులూ స్టేటుమెంటు రాసిచ్చేవు! దబ్బిచ్చి తద్దినం కొనుక్కున్నట్టు. కొరివితో తల గోక్కున్నట్టూ అయింది నా పని. పుణ్యానికి వెళ్తే మొసలి ఎత్తుకు పోయిందట! బాగానే చేశావు..!" అని ఉద్రేకంతో ఏమేమో కేకలు వేశాను.

అంతా విని, "శాంతం భూషణం! ఆఫీసర్లతో తగువులు పడి ఎన్నాళ్ళు ఉద్యోగం చేస్తాం!" అన్నాడు నెమ్మదిగా ప్రశాంతమూర్తి.

"మరి, మొకటే ఆ మాట ఏడుస్తే గ్రంథం ఇంతవరకూ రానిచ్చేవాణ్ణా! ఈ. తల గొఱుగుట; తల తరుగుట కన్న తుచ్ఛకరము మహాత్మా!" అని ఏడుపు మొహం పెట్టేను.

"నేను నీతో ఎన్నడేనా అనకుండా కష్టసుఖాలు చెప్పుగోడం గాని, నిన్ను సాయం చెయ్యమని అర్థించడం గాని చేశానా? పిలవని పేరంటంగా నీవై వచ్చి ఇందులో దూరి ఇరుక్కున్నావు. నన్ను నిందించడం అసందర్భం!" అని ప్రశాంతంగా సెలవిచ్చాడు ప్రశాంతమూర్తి.

నాకు తల తిరిగిపోయింది. పుండు మీద కారంలాగా—గోరుచుట్టుమీద రోకటి పోటులా గా ఫీలయ్యేను. బుద్ధి పనిచెయ్యడం మానేసి బైతాయించింది. కాళ్ళు మాత్రం ఇంటికి దారితీశాయి. ఎలా వెళ్ళానో నాకే తెలీదు. త్రోవలో తోటి గుమాస్తాల పడ్డికిలింపులూ. పకపకలూ. వికవికలూ లీల మాత్రంగా గోచరించాయి.

ఏం చేస్తాం? శని ప్రభావం! నా ప్రారబ్ధం!—అని మనస్సు సమాధానపరచుకొని. అవతలివాడు అర్థించి. అల్లల్లాడి పోతేనే గాని సహాయానికి పూనుకోకూడదు — అని గట్టిగా నిర్ణయించుకున్నాను.

ఆరునెలలు సిక్కురిపోర్టు చేసి ఇంట్లో కూర్చున్నాను. ఈలోగా ఆఫీసర్లు మారడం. నా బదిలీ ఆర్డర్ పీల్లు కారి. రద్దు కావడం జరిగింది!




కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

వాటా అని అనకుండా ప్రతి సంవత్సరం తోట అమ్మిన డబ్బూ, రెండెకరాల పొలంలో వచ్చిన పంటా తీసుకుపోతున్నాడు శంకరం. సంగోరు ఆదాయం తీసుకువెళ్లడం తెల్సు. కాని, తల్లీ తమ్ముడూ వారికయ్యే ఖర్చుల్లో వాటా తనకీ ఉంటుందని తెలియదు కాబోలు. అంటూ గొణిగేది రాజేశ్వరమ్మ.

"పోన్లే అమ్మా. నేను ఇంటికి పెద్దవాణ్ణి వాడు చిన్నవాడు. నా తమ్ముళ్ళు సౌఖ్యంగా సంతోషంగా బ్రతికితే నాకు చాలు. అయినా వాడు వాటా తీసుకున్నం మాత్రాన్న మనకేం లోటు వచ్చిం ఎల్లా అయినా పిల్లలమీద తల్లికి పక్షపాముంటుందని అన్పిస్తొందిప్పుడు.... నే బ్రతికుండగా నీకూ వాళ్ళకీ ఏ లోట రానివ్వను. శంకరాన్నేమీ అనకు అంటూ మృదువుగా మందలించేవా మూర్తి.

సాఫీగా రోజులు దొర్లిపోతున్నాయి.

* *

బారులుతీరిన కొండలపై తెరవాప

ని మబ్బు. అప్పైన నీలాకాశం. ఆ
•కాశంలో రెక్కలు చాచిన పక్షిలా
తిపూవు రంగులో అనేక సౌంద
న్ని సంతరించుకుంది. అరుణ కిర
ని అందుకుంటూన్న తెల్లని మబ్బు.

ఆర్. సి. ఎమ్. స్కూల్లో హడావుడిగా
గుతున్నారు. యూనిఫారమ్‌లో ఉన్న
ష్యక్కులూ, పిల్లలూ. స్కూలు ముందున
్ష చర్చి రంగురంగుల కాగితపు
లతో, ఎలక్ట్రిక్ బల్బులతో అలంక
పబడి ఉంది.

సినిమా రికార్డు గోలలో పిల్లల పెద్దల
టలు గజిబిజిగా వినిపిస్తున్నాయి.
్రేన్‌లో విరబూచిన చామంతులూ,
ాబులూ. ఆ వాతావరణమంతా
దంగా, కోలాహలంగా ఉంది.

లోపల అంతా కలయజూచిన మౌళి,
ందూమతాన్ని నిరసిస్తూ రాతిబొమ్మలూ,
ితపు చిత్రాలు పూజిస్తారు అంటూ
•ళనచేసే క్రైస్తవులు, బొమ్మనుచేసి
ం షష్టాడని, పాటలు పాడి అట్టహాసం
ారు. విగ్రహం లేకపోవచ్చు కాని,
వీ ఉన్నాయి చిత్రపటాలు పేర్లు
రు గాని భగవంతుడొక్కడే అని
ంచి హిందూమత దేవుళ్ళనీ, ఆచా
న్ని హీనంగా చూడ్డం ఎప్పుడు మానే
రో మరి. మా తెనుగు మాష్టరు చెప్పి
ు పరమత సహనంలేని ఏ మతమూ
ప్పది కాదు. పరమతాన్ని దూషించే
క్తి అహంకారి అవుతాడు కాని.

సాత్వికుడవుతాడా? సంఘానికి క్షేమకారి
అవుతాడా? అనుకుంటూ, వారి హడావుడికి
నవ్వుకుంటూ "మంజూ!" అని గట్టిగా
పిలిచాడు మౌళి.

నీలం పరికిణీ, తెల్లని జాకెట్టూ రెండు
జడల అమ్మాయి ఉలిక్కిపడ్డట్టు వెనుదిరిగి
చూసి, ప్చ్. వచ్చేశాడే అనుకుంటూ,
విసుగ్గా అతని దగ్గరకు వచ్చి, "ఏం....
ఎందుకని? ... అంత గొంతు చించు
కుంటున్నావ్?" నవ్వుతూ అడిగింది.

"పొద్దు పోలేదా! ఇంటికి రాకుండా
ఏమిటిక్కడ నీకు పని. రా పోదాం"
అంటూ ఆమె చెయ్యి పట్టుకున్నాడు
మౌళి.

"ఏసు పుట్టాక కాని నేను రాను....
నువ్వేమిటి మధ్యన. అత్తయ్యతో అలా
చెప్పొచ్చాగ" బుంగమూతి పెట్టింది
మంజుల.

"ఓహో...ఏసు పుట్టేసరికి పన్నెండు.
అప్పటిదాకా నిద్ర పాడుచేసుకోవాలి, వద్దు.
జ్వరంలో పడి లేవావ్ మంజూ. మదర్‌కి
చెప్పేసి రా" అన్నాడు బ్రతిమిలాడే
ధోరణిలో. ఆ గొంతులో తియ్యని
ఆప్యాయత.

"డ్యాన్సులున్నాయ్....నాటకం లో
వాడు పోర్షనుంది .... ఛ. ఛ, నీతో నాకే
మిటి .... వెనుక వెనుకే తిరుగుతూ ....
చదువు సంధ్యా లేదుగా...." చిరాగ్గా
అంటూన్న ఆ పిల్ల మొహంవైపు
రోషంగా చూస్తూ 'మంజూ' అన్నాడు

తీవ్రంగా మౌళి.

"మరి వస్తా. రాత్రి వంటరిగా ఇంటికి రాలేను.... వస్తావు కదూ. ఏయ్ మౌళీ ... మరిచిపోకేం....టాటా, బై బై." కిలకిలా నవ్వుతూ పరిగెత్తి అక్కడి పిల్లల్తో కలిసిపోయింది మంజుల.

తల విసురుగా ఎగరేసి గబగబా గేటుదాటి రోడ్డెక్కాడు మౌళి.

• •

"తమ్ముడూ .... బాబూ ... మౌళీ." తట్టి పిల్చాడు మూర్తి.

బద్ధకంగా వత్తిగిలి 'ఎందుకన్నయ్యా' అన్నాడు మౌళి.

"వెళ్లి మంజుని తీసుకురా...."

వింటూనే కోపం వచ్చింది మౌళికి.... కాని అన్నయ్యని ఎలా ఎదిరించాలి!.... లేచి కూర్చుంటూ... చలి....ఇంత రాత్రి వేళ. అమ్మ మరీను....అన్నాడు మౌళి.

"నే వెళ్తాలే.. పడుకో..." అన్నాడు మూర్తి.

"నేనే వెళ్తాలే .... కాని, మంజుని బాగా ముద్దు చేస్తున్నారన్నయ్యా" అంటూ లేచి షర్టు వేసుకున్నాడు.

"క్రిష్టమస్ కదూ! చిన్నపిల్ల. ఏదో సరదా....జాగ్రత...." అంటూ హెచ్చరించాడు మూర్తి.

• •

"ముఖం కడుక్కోలా!" కోపంగా మంజులవైపు చూస్తూ అడిగాడు మౌళి.

"నువ్వొచ్చి అరుస్తున్నావ్ మరి!



పద ఇంటిదగ్గర కడుక్కుంటా లే." అంది మంజుల చనువుగా అతనిచెయ్యి పట్టుకుంటూ.

ఆ పిల్ల ఎఱ్ఱని పెదాలూ, గులాబి బుగ్గలూ చూస్తూ చిన్నగా నవ్వి "ఏం వేషం వేశావ్?" అడిగాడు.

"మరియమ్మ." అతని వెనుక గబ గబా నడుస్తూ చెప్పింది మంజుల.

పకపకా నవ్వుతూ "మరిడమ్మలాటి నీకు మరియమ్మ పోర్షనా!" అన్నాడు మౌళి.

''ఛ. ఛో. నువ్వే అలా అన్నావ్ కాని, నా మొహమెంతో సౌమ్యంగా, అందంగా ఉంటుందట. స్కూలు టీచర్లందరూ నన్నే సెలక్షను చేశారు. మరి... మా మదరేమన్నారో తెల్సా....స్కూలు మొత్తం అందరికన్నా అందమైన దాన్నట!'' అమాయకంగా సంతోషంగా ఉంది మంజుల గొంతు.

''హబ్బ అంత అందమైనదానివేం'' అంటూ ఆ పిల్ల బుగ్గ గట్టిగా చేత్తో రాసి, చూడు నా చేతులెంత అందంగా ఉన్నాయో అన్నాడు మౌళి.

రెండవ బుగ్గ పరికిణీతో తుడిచేసుకుంటూ ''అత్తయ్యతో చెప్తానుండు నీ పని.''

''ఏమని!'' కొంటెగా నవ్వాడు.

''నువ్వు నన్ను కొట్టావని.''

''అయితే నిజంగా కొట్టనా?''

''తిరిగి కొట్టిస్తా....''

చిన్నగా ఆ పిల్ల నెత్తిమీద మొట్టాడు మౌళి.

అతని చెవి మెలిపెట్టింది మంజుల.

ఇద్దరూ గలగలా నవ్వుకున్నారు.

*                    *

''అదేవిటే, వేషంతోనే వచ్చేసినట్టున్నావు!'' తలుపులు తీసి బుగ్గలు నొక్కుకు నవ్వుతూ అడిగింది రాజేశ్వరమ్మ.

''మౌళి నిలవనిచ్చేడు కాదత్తయ్యా.''

''కడిగేసుకురా అంటే, నీకు తన వేషం చూపిస్తానందమ్మా'' మౌళి జవాబు.

''ఒరే మూర్తీ....ఇలా రా....కాంతా చూడు మన మంజు ఎంత బాగుందో.... వేషంలో ఎలాటి చీర కట్టారో, అప్పుడెలా ఉందో....''

'గుళ్ళో పార్వతీదేవిలా.... బొట్టు లేదనుకో ' రాజేశ్వరమ్మ మాట మధ్యలో నవ్వుతూ అన్నాడు మౌళి

కాంతా, మూర్తీ, రాజేశ్వరమ్మా.... అక్కడ క్రైస్తవులు ఏమేమిటి ఎలా చేశారో ప్రశ్నించి నవ్వుకుంటూ, కృష్ణుడు పుట్టినరోజు వేడుకలు మనం చేస్తూంటే హేళనచేసే క్రైస్తవులు 'శ్రీ పాండురంగ రంగా ' వరసన, ఏసు పుట్టుకమీద పాటకూడా పాడుతున్నారు అనుకున్నారు.

''వాళ్ళ దేవుణ్ణేదో పట్టుకు వాళ్ళేడవక'' అనబోతూన్న కాంతని .. ''ఉష్ పక్కనే ఉంది మేరీ. విన్నదంటే విఘ్నేశ్వరుడు మొదలు మన దేవుళ్ళందరినీ వారం రోజులు తిడుతుంది. వాళ్ళ దేవుడూ, నీ దేవుడూ''....మీ మొహం. 'వర్తకుని భంగి పెక్కుగు మూర్తులతో నెవ్వడాడు'' అన్నాడు పోతన. అల్లా, ఏసూ, రాముడూ ఇన్ని పేర్లతో పిలువబడేవాడూ ఒక్కడే. పిలిచేవారే పోట్లాడుకుంటున్నారు కొలిచే దేవుణ్ణే దూషిస్తున్నామని తెలుస్తుంది కాస్త లోతుగా ఆలోచిస్తే. సరే పోయి పడుకో మంజూ....'' అన్నాడు మూర్తి.

''టానిక్ తాగేవే మంజూ! సాయంత్రం భోజనం సరిగ్గా చేసిందా అమ్మా!''

అడిగాడు మౌళి.

"భార్యమీద గొప్ప అభిమానం చూపి స్తున్నావు కాని.... పడుకోవోయ్.... భోజ నమూ చేసింది. మందూ తాగింది." నవ్వుతూ అంది శాంత.

"ఛ. ఛ. అదికాదు వదినా.... జ్వరం పడిలేచిందికదూ! అందుకని" అన్నాడు తడబాటుగా.

"అదికాదేమిటి? మళ్ళీ అదేభావం నీ గొంతులో వ్యక్తమవుతూంటే."

"వాడితో ఏమిటి శాంతా! పోయి పడుకోరా మౌళీ. మీ వదినకి గొప్ప ఉబలాటంగా ఉంది....మీరు తొందరగా పెద్దవాళ్ళయిపోతే బాగుండునని." అన్నాడు మూర్తి బద్ధకంగా పక్కమీద వాలిపోతూ.

"తాను పెద్దదయినట్టు అస్తమానూ. నాకూ చదువూ సంధ్యా లేదని అంటుం టున్నయ్యా మంజా. మీరేమీ అనరు. అదలా పెద్దకబుర్లు చెప్తే." ఉదాశీనంగా అన్నా వదినల వైపు చూస్తూ అన్నాడు మౌళి.

"ఎందుకులేదూ! ఈ సంవత్సరమంతే శంకరం వంట్లో సుస్తీచెయ్యడం, వాడిని బ్రతికించుకునేసరికి తల ప్రాణం తోకకి వచ్చింది. అందుకని ఇంట్లో ఉండి పోయావు కాని. మరి నీకు చదువే లేదా! మంజూ బావనలా అనవచ్చే! పౌరుష మొస్తే ఏం చేస్తాదో తెల్సా! ఏక బిగిని చదివేసి డాక్టరై పోయి నీ మెళ్ళో తాళి కట్టేసి........."

"ఛ. ఫో. బావా" అంటూ తన పక్కమీద దబ్బున కూచుంది మంజుల.

* *

మే నెల ఆఖరు కావస్తూంది. ఎండలు తీక్షణంగా ఉన్నాయ్. సాయంత్రం ఆరు ఘంటల వేళ. ఆఫీసునుంచి ఇంటికి వచ్చిన మూర్తి వాకిట్లో జాజిపందిరి క్రింద మంచం వాల్చుకు కూచుంటూ, 'అమ్మా!' అని పిల్చాడు.

"శాంతా కాఫీ తేమ్మా! బాబు వచ్చాడు." అని కోడలికిచెప్పి కొడుకు దగ్గర కొచ్చింది రాజేశ్వరమ్మ.

"ఇలా కూచోఅమ్మా!" తన పక్కన చోటు చూపించాడు మూర్తి.

"అమ్మతో ఏమిటా అర్జంటు మాటలు? బట్టలన్నా మార్చుకుండా." అంటూ చిన్నగా నవ్వి అతని పక్కనే కూర్చుంది ఆమె.

శాంత తెచ్చిన కాఫీ సిప్ చేస్తూ "మౌళి సంగతమ్మా వాణ్ణి విశాఖపట్నం పంపిద్దామని." అంటూ తల్లి మొహం లోకి చూశాడు.

"ఏదన్నా దొరికిందా బాబూ!" కుతూ హలంగా అడిగింది ఆమె.

"ఏమిటమ్మా! ఉద్యోగాని కనుకుంటు న్నావా? ఇప్పటినుంచీ ఉద్యోగం చెయ్యా ల్సిన ఖర్మ వాడికేం పట్టింది? అయినా పదిహేడేళ్ళు నిండని వాడికి ఉద్యోగ మెవరిస్తారు? కాలేజీలో చేరుతాడమ్మా."

"బాగుంది మన మెంత మన బ్రతుకు లేపాటివి? పిచ్చిపిచ్చిగా ఆలోచించి గుట్టుగా గంజో కడుగో రోజులు వెళ్ళబుచ్చే సంసారం నట్టగుర్లో వెలితి పడనీయకు.... మొన్న శంకరం జబ్బంటే బోలెడు డబ్బు జల్లుకున్నావు. నీకున్న అభిమానం నీతమ్ముల కుంటుందా?"

"ఎందుకుండదమ్మా?"

"పిచ్చి బాబు. తలి తండ్రుల దగ్గర పసివారిగా బ్రతికేప్పుడున్న అభిమానాలూ, మమతలూ, ఎదిగి రెక్కలువచ్చి ఎవరి బ్రతుకు వారు బ్రతికేటప్పుడు, స్వార్థాలూ, అసూయలుగా మారిపోతాయి బాబూ! జీవిత సౌఖ్యాలు రుచి చూపిన ప్రతి మనిషీ స్వార్థపరుడయి పోతాడు."

"పోన్లే అమ్మా! నాకన్నా చిన్నవాళ్లు వాళ్ళు సంతోషంగా బ్రతికితే నా కంతేచాలు మోళిని చదివించాలనే అనుకుంటున్నాను. వాడు బాగా తెలివైన వాడు."

"అవవచ్చు. తెలివీ నేర్పూ ఉంటే ఎలాఅన్నా బ్రతుకులో రాణించ గలడు. పెద్ద చదువులు చదివించే స్తోమత లేనప్పుడు గుట్టు చప్పుడు కాకుండా ఊరుకోవడం మంచిది." ఖచ్చితంగా చెప్పింది రాజేశ్వరమ్మ.

"నేను గుమస్తాని. శంకరం స్కూలు మాష్టరు. మా ఉద్యోగాలూ బ్రతుకులూ ఎదుగుతాయని ఆశ ఎప్పుడూ లేదు. వాడినన్నా పైకి తేవాలనుందమ్మా!"

"ఊరికినే ఉద్రేక పడకు. కాస్త నీ భార్యతోకూడా ఆలోచించు. తల్లి తండ్రీ అన్నదమ్ములూ, భార్యా పిల్లలూ, ఎవ్వరి మీదనైనా మమతలు పెంచుకు ఆలోచనా రహితంగా ప్రవర్తించ కూడదు. నీకు తమ్ములు అనే మమతా అభిమానం తప్ప ప్రపంచ జ్ఞానం తెలియదు." అంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది రాజేశ్వరమ్మ.

తాను పై చదువు చదివించ లేనంటే నిలదీసి ఎందుకు చదివించవు? ఎవరికోసం చదివిస్తావు? అని అడగాల్సిన తల్లి ఇలా వద్దని వారిస్తూం దేమిటి? అమ్మకి పట్నంలో చదువంటే భయం. ఎంతో ఖర్చవుతుందనీ. ఆ ఖర్చులు భరించలేక మా సంసారం పేదదయి పోతూందనీను, అనుకుని నవ్వుకున్నాడు మూర్తి.

వారి సంభాషణ అంతా విన్న శాంత కాఫీగ్లాసు భర్త చేతికిస్తూ, "ఆమె మాటలకేమిటి? విశాఖపట్నంలో చదువు తాడు మోళీ. సీటుకి ప్లయ్ చెయ్యండి" అంది.

• •

అగ్నేయాస్త్రాలు ప్రకృతిపై విసరి వినోదించి, అలసిన సూర్యుడు కంది కాంతి తగ్గి పడమటి కొండల చాటున విశ్రమిస్తున్నాడు. పక్షులు రొదచేస్తూ పడకలకి చోటు వెతుక్కుంటున్నాయి. ప్రకృతి సేదతీరుస్తున్నట్లు. చల్లగా లాలిస్తున్నట్టు మెల్లగా పవనుడు వీస్తు






న్నాడు.

నేరేడు చెట్టు కింద సిమెంటు బెంచీ పైన వత్తిగిలి పడుకున్న మంజుల ముంగురులు సవరిస్తూ" ఇంకొక నాలుగు రోజుల్లో వెళిపోతాను మంజూ. బాగా చదువుకుంటావు కదూ?" అడిగాడు మౌళి.

చప్పున లేచికూర్చున్న మంజుల కళ్లు చెమ్మగిల్లాయి "మళ్లీ ఎప్పుడు వస్తావు మౌళీ?' ప్రశ్నించింది మంజుల అమాయకంగా చూస్తూ.

"సెలవు దొరికినప్పుడు. అప్పలింక చదివించరు కాబోలనుకున్నాను. కాని నేను మంచి మార్కులతో క్లాసు తెచ్చుకుంటా. అన్నయ్య ఎమ్.బి.బి.యస్. చదివిస్తారట."

"అయితే నువ్వు డాక్టరివయిపోతావా? మౌళీ" ఆశ్చర్యంగా అతనివైపు చూస్తూ అడిగింది మంజుల.

"మరేమిటనుకున్నావ్? న
పెళ్ళి చేసుకోవాలంటే కనీసం ను
బి.ఎ. అన్నా చదవాలి." తలెగరే
మౌళి.

"ఛీపో. ఎట్లాగా కోతిలా రాగిజు
నువ్వూ. నువ్వెవరికి కావాలి? విన్నె
పెళ్ళి చేసుకుంటారు?" అంటూ వ
చప్పున సిమెంటుబెంచీ దిగి పరు
తీసింది మంజుల. వెనుకే పరుగు
మంజుల జడపట్టుకున్నాడు మౌళి. "
టన్నావ్?" అంటూ.

"నేనేమీ అనలా. కోతినెవరు
చేసుకుంటారు? అన్నాను తప్పా
కిలకిలా నవ్వింది మంజుల.

"చ. పో, మొండి. నీ ఇష్టమొ
నట్టూ అను. నేను లక్ష్యపెట్టను ఇ
ఎనిమిది సంవత్సరాలదాకా దూరదూర

డిపోతాంగా అందుకని.''

''అబ్బా ఎనిమిది సంవత్సరాలే ! ప్పటికి చాలాపెద్దవాడివై పోతావ్ గా !'' అంది మంజుల అతనివెనుక స్తూ.

ఇంటికివచ్చిన మౌళినీ, మంజులనీ ంత ప్రొద్దుపోయేదాకా తోటల్లో తిరు కూ కూర్చుంచే పురుగూ పుట్రా టాయి. పెందరాళే ఇంటికిరావాలని దూ !'' మందలించింది రాజేశ్వ మ్మ.

* *

మంజుల థర్డుఫారమ్ ప్యాసైంది. క్కళ్ళు. కాలేజీలు తెరిచారు. గరల్స్ స్కూల్లో జాయినయింది మంజుల. వా, యూనీఫామ్ కుట్టించవా?' మూర్తి క్కలో కూర్చుని అడిగింది గారంగా.

''ఏం ఇదివరకున్నవి చినిగి యాయా? ఎల్లాగో నాలుగు రోజులు ంక్షేపం చెయ్యి. వచ్చేనెల కుట్టిస్తాను. ళిని విశాఖపట్నం పంపించాలిగా !'' నయంగా అన్నాడు మూర్తి.

అంగీకారంగా తల ఊపి మౌళి ర కెళ్లింది మంజుల. ''కాలేజీలో వచ్చిందా? ఎప్పుడు వెళ్తావు ళీ?'' అడిగింది బాధో సంతోషమో, భావమో. ఆ పిల్ల కళ్ళల్లో చప్పున ్ర తిరిగాయి.

''ఏడుస్తున్నావా?....మరి నేను వడం నీకిష్టంకాదా? తలదువ్వు కుంటూన్న మౌళి చివాలున వెనుదిరిగి మంజులవైపు చూస్తూ అన్నాడు.

''అహ. నాకిష్టమే. కాని నువ్వెళ్ళి పోతానంటే, ఎన్నో సంవత్సరాలదాకా ఎక్కడో ఉండాల్సి ఉంటుందని అను కుంటూంటే అదోలా ఏడుపు వస్తుం దివాళ.''

గబగబా రుమాలుతో ఆపిల్ల కళ్ళు తుడుస్తూ ''అలా నేను వెళ్తూ ఉంటే నువ్వేడిస్తే, అందరూ ఎలా హాస్యం చేస్తారో తెల్సా. అప్పుడు ఉడుక్కోవి ఇంకా ఏడవవలసి వస్తుంది.'' అన్నాడు మౌళి చిన్నగా నవ్వుకుంటూ.

* *

''మౌళిని విశాఖపట్నం పంపించ డానికి రేపు మంచిరోజే కదమ్మా!'' అడిగాడు మూర్తి మజ్జిగకి చెయ్యి పడ్తూ

మజ్జిగ వెయ్యబోతూన్న రాజేశ్వ రమ్మ స్థాణువులా నిల్చుండిపోయింది క్షణం.

చిన్నగానవ్వి. ''అదేవిటమ్మా ! అలా అయిపోయావ్? మజ్జిగపొయ్యి.... మన కుటుంబంలో అందరం గుమస్తాలం, మాష్టర్లం. ఎదిగీ ఎదగని బ్రతుకులు, చాలీ చాలని జీతాలు. వాణ్ణి బాగా చది విస్తానమ్మా.''

''పిచ్చి బాబు. ఏ పక్షి ఎంతపైకి ఎగరగలదో అంతే కాని కాకిపిల్ల భూ మండలం చుట్టి రాగలదా! ఎందుకు బాబూ

హతుకు మించిన వరుసులు? కాలేజీలో చేర్పగానే సరా! ఫీజులూ, పుస్తకాలూ, వాడి భోజనం. ఎలా తెస్తావు డబ్బు! వాడు మాత్రం మీలా ఎందుకు బ్రతక్కూడదు?''

''అబ్బా. అలా అడ్డుచెప్పకమ్మా. నా గుండెల్లో పిరికిపాలు పొయ్యకు .... ఎందుకు చదివించలేను? పెద్ద చదువులు చదివిన వారంతా అజాధికారేనా! ఇల్లూ, భూమీ, తోటా, దొడ్డీ అమ్మి అయినా సరే .. వాణ్ణి చదివిస్తాను. వాడు మాలాటి ఉద్యోగం చెయ్యకూడదు. దైవం అనుగ్రహించి వాడు బాగా చదివితే మౌళిని డాక్టర్ని చేస్తానమ్మా!'' దృఢంగా, ఆవేశంగా అన్నాడు మూర్తి భోజనం ముగించి లేస్తూ.

''ఏమో బాబూ కొంచం నిదానంగా ఆలోచించు. వాణ్ణేదో పెద్ద డాక్టర్ని చేస్తానంటే తల్లిగా కాదనలేను. కాని, ఏ ఊరు అన్నదమ్ములు? ఈ చిన్న ఉద్యోగంతో వెనుక ఉపాది లేకుండా నువ్వెలా బ్రతుకుతావు? నువ్వూ తండ్రివి కాబోతున్నావు.''

ఉలిక్కి పడ్డాడు మూర్తి. తను తండ్రి కాబోతున్నాడా? కాపరానికి వచ్చిన ఇన్ని సంవత్సరాలకి కాంత తల్లి కాబోతుందా? తన హృదయంలో గుప్తంగా దాగిన కోరిక సఫలమౌతూందా? తన జీవితంలో ఎండమావిగా ఊహించిన ఒకానొక అనుభూతి, ఒయాసిస్సయి తృప్తి నిస్తూందా? తాను దురదృష్టవంతుడు కాదు. అదృష్టవంతుడ తృప్తిగా నిట్టూర్చాడు మూర్తి కొన్ని క్షణాల తర్వాత.

రాత్రి ఏకాంతంలో అడిగాడు మూర్తి కాంతను తనవైపు త్రిప్పుకుంటు ''అమ్మ ఏమిటో అంటూంది నిజమా!' అని.

''అవు నండి.'' సిగ్గుపడింది కాంత

* *

మౌళి కాలేజీలో జాయినయాడు. విశాఖపట్నం ప్రయాణమై వెళ్ళబోతూ కాళ్ళకు నమస్కరిస్తూన్న మౌళిని లేవనెత్తి. నాకు కాదు బాబూ నమస్కరించడం. నాదేముందిక, ఎప్పుడో రాలిపోతాను. మీ వదిన కాళ్ళకు నమస్కరించు. ఆమె ఆశీర్వాదం పొందు. అంది రాజేశ్వరమ్మ.

తన కాళ్ళకు నమస్కరిస్తూన్న మౌళిని వారిస్తూ ''ఎందుకయ్యా ఇలా నమస్కరిస్తే సంతోషించదీ వదిన. ఫస్టు క్లాసులో ప్యాసై. మేం అనుకున్నట్టూ డాక్టరువై పోతే .... ఆనాడు నువ్వు మ్రొక్కినా తిట్టినా నాకు సంతోషమే.'' అంది కాంత నవ్వుతూ.

''ఊ వెళ్ళిరా. ఈసారి వచ్చినప్పుడేనా మంచిబట్టలు కుట్టిస్తాలే. జాగ్రత్త. ఆరోగ్యం పాడు చేసుకోకు. ఉత్తరం వ్రాస్తూండు.'' అంటూ అతని వెనుకే బస్ స్టాండుకి వెళ్ళి హెచ్చరికలు

చేస్తూనే ఉన్నాడు మూర్తి.

* *

నెలకోసారి వెళ్ళి తమ్ముణ్ణి చూసి వస్తున్నాడు మూర్తి. అతను వెళ్ళేప్పు డల్లా ఏదో పిండివంట చేసి మౌళికిచ్చి రండి అంటూ ఇస్తూంది శాంత.

శాంత ఆడపిల్లని ప్రసవించి జబ్బు పడి మౌళిని చూడాలని కోరింది. ఉత్తరం వ్రాశాడు మౌళికి మూర్తి. "వదిన నిన్ను చూడాలని అంటూంది ఓ పారి వచ్చి వెళ్ళు" అని.

నీర్సంగా పాలిపోయి మంచాని కంటుకు పోయిన శాంత వైపు చూసి కలవరంగా, "వదిన కేమైంది. ఎందుకు వదినా ఇలా ఐ పోయావ్." అంటూ ఏడ్చేశాడు మౌళి.

'ఛ. ఛ అదేమిట్రా ఆడపిల్లలా ఏడుస్తావ్. మీ వదిన కేమీలేదు కొంచం సుస్తీచేసి నీరస పడింది. అటుచూడు పాపని ఎంత బాగుందో" అన్నాడు మూర్తి.

శాంత పక్కలో కూర్చుంటూ "వదినా" పిల్చాడు మౌళి.

నెమ్మదిగా కళ్ళు తెరచిన శాంత "మౌళి నా బాబు వచ్చావా? ఛ ఛ ఏడుస్తున్నావా? పోయేదాననే కాని బ్రతికి పోయాను బాబూ ఫర్వాలేదు. కళ్ళు తుడిచేసుకో." అంది శాంత మౌళి చెయ్యి తన చేతిలోకి తీసుకుంటూ.

"ఓ నువ్వెప్పుడొచ్చావ్? ఉష్. మంచం దిగి బల్లమీద కూర్చో. ఇల్లుకాదిది. గారంగా వదిన పక్కలో కూర్చోడానికి. హాస్పిటలు వార్డు" అంది చిన్నగా నవ్వుతూ.

గళ్ళ పరికిణీ, నీలంవోణీ ఇదొక కొత్త అవతారం. పరికిణీ జాకెట్టూ వేసుకు పరుగులు తీసే మంజుల వల్లె వాటు వేసుకుంది.

రెండు క్షణాలు రెప్ప వాల్చకుండా మంజులవైపు చూసిన మౌళి, చప్పున బెడ్ దిగి బల్లమీద కూర్చొని తొట్టెలో ఉన్న పాప బుగ్గలు మృదువుగా నిమిరాడు.

"పాప బాగుంది కదూ మౌళీ" అంది మంజుల

"నాకేం నచ్చలా. వదిన్ని చాలా ఇబ్బంది పెట్టింది" అన్నాడు మౌళి.

"నువ్వు పుట్టినప్పుడూ మీ అమ్మకు జబ్బు చేసిందట" అంది మంజుల.

"పెద్ద కబుర్లాడకు. ఏదీ ప్లాస్కు ఇలా ఇవ్వు. వదినా కాఫీ తాగుతావా?" అంటూనే కాఫీ గ్లాసులో పోసి కొంచం కొంచం ఆమె చేత తాగించాడు మౌళి.

నెమ్మదిగా పెదవులు తుడుచుకుంటూ "మనకిలాటి కొడుకుండగా మరి దిగు లెందుకండీ" అంది శాంత, మూర్తివైపు చూస్తూ. అలా అంటున్న ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.




దిగులు పడ్డంలేదు. నీవు తొందరగా కోలుకుని ఇంటికి వచ్చేస్తే నాకంతేచాలు" అన్నాడు మూర్తి ఆమె కన్నీరొత్తుతూ.

* *

పరీక్షవ్రాసి ఇంటికొచ్చాడు మౌళి. ఎండలు తీక్షణంగా ఉన్నాయ్. శాంత వెనుక తానూ ఎన్నోపనులు చేస్తూన్న మంజులను చూసి, అప్పుడే దీనికి పెద్దరికం. పనులూ వల్లెవాటు వేసుకోగానే వచ్చేసినట్లున్నాయ్ అనుకుంటూ నవ్వుకున్నాడు మౌళి

"మంజూ, అలా తోటవైపు వెళ్ళొద్దాం వస్తావా?" అడిగాడు మౌళి

"తోటకి షికారా? ఊహు రాను. ఇంట్లో సాయంత్రం బోలెడు పనులుంటాయ్. అక్కయ్య చెయ్యలేదు. అత్తయ్యకి వంట్లో బాగుండడంలేదు."

అతను మాట్లాడలేదు గబగబా బట్టలు మార్చుకు వెళ్ళిపోయాడు.

తాను చెయ్యవలసిన పనులు గబగబా చేసేస్తున్న మంజులను చూస్తూ "ఇప్పటి నుంచీ వంటెందుకు మొదలెట్టావ్?" అడిగింది శాంత.

"ఓసారి తోటవైపు వెళ్ళొద్దామని" నసిగింది.

"ఎందుకని?"

"మరి నిన్న చెప్పారుగా, కాయలెవరో చాటుగా దింపి పోయారని."

"అయితే నువ్వేం చేస్తావ్?" అంటూ నవ్వింది శాంత.

"ఓసారి చూసివస్తానక్కయ్యా. ఎన్ని కాయలెత్తుకుపోయారో పెద్ద బావ పోన్లే ఏంచేస్తాం అనేశాడు. తాను చూడడు. మాలినెలా అన్నాగట్టిగా మంద

ళించాలి."

"నువ్వా!" మళ్ళీ నవ్వింది శాంత.

అత్తయ్య ఏమోఅనబోతే కసురు కున్నాడు పెద్దబావ "నేనంటే ఊరు కొంటాడా?

"ఒక్కదానివి ఆడపిల్లవి తోట కెళ్తావా? పొద్దుపోయే వేళ వంటరిగా."

"మౌళి వెళ్ళాడక్కయ్యా" అమె మాటకడ్డువస్తూ అంది మంజుల.

పకాల్న నవ్వింది శాంత. "అలా చెప్పు ఇద్దరూ కలిసివెళ్ళకపోయారా? ఒక్కనాటికి ఈ పనులు నే చేసుకోలేనా? ఎంత దొంగలెరుగుడుగా చెప్పావ్" అంటూ.

"నేవెళ్ళనక్కయ్యా." రోషంగా అంది మంజుల.

"ఇప్పే వెళ్ళిరామ్మా! కాస్త చల్ల గాలికి తిరిగొస్తావు. మౌళికి చెప్పు మాలిని కాస్త గట్టిగా మందలించమని. వచ్చే ఒప్పుడు నాలుగు కాయలు తెంపుకు రండి. ముక్కలు వేస్తాను" అంది శాంత.

* *

నేరేడుచెట్టు క్రింద పిమ్మెంటుబెంచీ మీద వత్తిగిలి పడుకుని డిటెక్టివ్ నవల చదువుకుంటున్నాడు మౌళి

"టౌన్ చదువు కెళ్ళాక చాలా మంచి మంచి పుస్తకాలు చదవడం నేర్చు కున్నావే" చప్పున అతని చేతిలో పుస్తకం లాగేసింది మంజుల.

"ఓ! రానన్నావు. ఇంటిపనంతా నే చెయ్యకపోతే వీల్లేదన్నావు. ఎలా వచ్చావ్? పోనీ నువ్వే చదువుకి ఉద్వాసం చెప్పావా?" లేచి కూర్చుంటూ నవ్వాడు మౌళి.

"నేనేం ఉద్వాసం చెప్పలా! మాకో మంచి టీచరొచ్చింది. ఆమెకు నేనంటే చాలా ఇష్టం. ఆమె నాకు ప్రయివేటు కూడా చెప్తున్నారు."

"ఓ అయితే ప్యాసవుతావన్నమాట"

"అంటే!"

"నువ్వెలా వ్రాసినా మార్కులు పడిపోతాయ్."

నవ్వి. "నేనేం అంత మొద్దునికాను. నాకు ఉచితంగా మార్కులెవ్వరూ వెయ్య క్కర్లేదు. కాని కాయలెవరో ఎత్తుకు పోతున్నారట. తానే ఇ జేస్తున్నాడేమో మాలి. పెద్దబావ పట్టించుకోడు. ఓసారి మందలించు" అంది మంజుల.

మా పనిపిల్ల అతనితో మౌళిమాట్లాడే తీరుచూసి ఆశ్చర్యపోయిన మంజుల "నువ్వు చాలా తెలివైనవాడివి మౌళి. ఊరకనే జారిపడతారు తప్ప పెద్దబావ కేంతెలియదు నువెంత సున్నితంగా మందలించావ్?" అంది.

చిన్నగా నవ్వి. "మనిషి కాస్త మెత్తగా కనిపిస్తే మనచేసేపనులు వీళ్ళు. పద కాయలు కోస్తాను" అంటూనే మామిడిచెట్టెక్కాడు మౌళి.

"కాయలెవరన్నా కోస్తే. ఎవరన్నా

సరే గుండేసి కాశ్చేయ్ అన్నావ్. మాలితో గుర్తుందా! జాగ్రత గుండు దెబ్బ తగిలేను." అంది మంజుల.

పకపకా నవ్వాడు మౌళి.

పి. యు. సి ఫస్టుక్లాసులో ప్యాన య్యాడు మౌళి. ఎం. బి. బి. యస్. చది వించాలనే పట్టుదల హెచ్చింది మూర్తికి.

ఏకాంతంలో రహస్యంగా భార్యతో సంప్రతించాడు మూర్తి. కొన్ని వేల రూపాయలు ఖర్చు కావచ్చు. అవ్వో. అమ్మకమో అయితేకాని చదువు పూర్తి కాదు అని శంకరాన్ని అడిగి చూశారా? కాస్త జంకుతూ అడిగింది శాంత.

పైకేమీ మాట్లాడకు. అమ్మతోకూడా చెప్పకు. జాయిను చేసేస్తాను మెడికలు కాలేజీలో. సీటు కష్టయిచేశాం. మా ఆఫీ సరు తమ్ముడొకాయన అక్కడున్నారు. హెల్పు చేస్తానన్నారు.

అలాగే చెయ్యండి. అంతగా శంకరం పేచీపెడితే అతని వాటా పంచి ఇచ్చేసి మనకున్నదానితోనే చదివిద్దాం అంది శాంత.

కొత్తబట్టలు వేసుకున్నాను. ఏదమ్మా పాదాలకి నమస్కరించనీ అన్న మౌళి వైపు. ఏో వొంగ బడవా అవేం కొత్త బట్టలు? నవ్వుతూ రాజేశ్వరమ్మ అనే లోపున ఆమె పాదాలు స్పృశించాడు మౌళి.

మంజుల తల చేత్తోపట్టుకు నెమ్మదిగా చెవిలో, నేను ఎం. బి. బి యస్. చదవ డానికి వెళ్తున్నాను. అన్నయ్య చెప్పే వరకూ ఎవ్వరికీ చెప్పకు అన్నాడు మౌళి.

నవ్వుకుంటూ తలఊపింది మంజుల.

మూర్తికూతురు పాపనెత్తుకు ముద్దు లాడి ఏమో అనబోతూన్న మౌళిని. మౌళీ బస్ తప్పిపోతుంది వెళ్లు అంటూ తొందర చేసింది శాంత.

అతను పక్కరోడ్డుకు మళ్లిపోయే వరకూ చూస్తూ వీధిగేటుదగ్గర నిల్చు న్నారు శాంతా, మంజులా.

రాత్రి తొమ్మిదయినా వంటయింటి గుమ్మంలో కూర్చుని యెవ్వరూ భోజ నానికి రాలేదంటూ విసుక్కుంటూన్న రాజేశ్వరమ్మతో ఊరికి వెళ్లివుంటా రత్తయ్యా. మీరు నిద్ర పొండి. మిగతా పనులు నేను చూసి వంటయింటికి తాళం వేస్తాను అంది శాంత.

ఏఊరు వెళ్లారే నాతో చెప్పకుండానూ! బుగ్గలు నొక్కుకు దీర్ఘం తీసింది రాజేశ్వ రమ్మ.

మీరు వప్పరనీ, మందలిస్తారనీ మీ అబ్బాయి మీకు చెప్పలేదు. మౌళిని మెడికల్ కాలేజీలో జాయిను చేస్తా రత్తయ్యా!

అంటే? అర్థంకాని రాజేశ్వరమ్మ కంగారుగా అడిగింది. ఎమ్ బి.బి. యస్. చదువుకి మౌళిని తీసుకువెళ్ళారత్తయ్యా అంది చిన్నగా నవ్వుతూ శాంత.

అమ్మ. ఎంత ఘటికులే మీరంతాను. మనకేం మొకాసాలున్నాయి పట్నంలో

చదువంటే మాటలా! నేనూ నా మొగుడూ వెట్టివాళ్ళమయే ఊరుకున్నామా! వాడి కెంత బుద్ధిపుడితే అంతేకాని పెద్ద ముండ వని నా మాటేమన్నా లక్ష్యముందా!

"డక్టరుగారి తల్లంటే మీకు గర్వం కాదా అత్తయ్యా!' ఆమె సాగిపోయే ధోరణి కడ్డువస్తూ అంది శాంత.

"డక్టరో, మాష్టరో యెవరైతేనేమి ఉత్తములనిపించుకుంటే చాలు మరీ పెద్ద వాడికి మతిపోయినట్టుంది. ఎవరో డక్టరీ చదివిస్తున్నారని తాను చదివించగలడా! పులిని చూసి నక్క వాత పెట్టుకుం దన్నట్లు...."ఇంకా ఆమె ధోరణి సాగి పోతూనే ఉంది. శాంత జవాబేమీ ఇవ్వ లేదు.

• •

"ఏమిటి ఉత్తరం వచ్చినట్టుంది?" అడిగింది కాత్యాయని.

"ఆ...."అన్నాడు శంకరం.

"మీ అన్నయ్య వ్రాశారా?"

"ఆ. అన్నయ్యే"

"ఏమిటలా చెప్తున్నారు? ఏమిటి వ్రాశారో చెప్పగూడదా!" అతనివైపు చురగ్గా చూస్తూ అడిగింది కాత్యాయని.

ఏముంది? వాడు వ్రాయడానికీ, నేను చెప్పకపోవడానికీను. ఎప్పుడూ ఉన్న సొదేగా! అమ్మకి వంట్లో బాగుండలేదనీ, నన్ను రమ్మనీను .. ఏదో కొంత అప్పు చేయాల్సి వచ్చిందనీనూ.

ఓ. సర్లెండి. అప్పులో మీకూ వాటా ఉంటుందనీను.

ఉంటే ఉంటుంది. నా జబ్బుకి వెయ్యి రూపాలయితే తోటమ్మిన డబ్బంతా ఇచ్చి అప్పు తీర్చాడు అన్నయ్య అన్నాడు చిరాగ్గా.

మీ అన్నయ్యేం తెలివి తక్కువవాడు కాదు లెండి. ఈతకాయ చూపించి తాటి కాయ లాక్కునే రకం.

కాత్యాయనీ! మందలింపుగా అన్నాడు శంకరం.

ఎందుకండీ చిరాకు. ఆ అబ్బాయిని పట్నంలో చదువుకి పెట్టారుగా డాక్టరీ చదివించడానికి వేలకి వేలూ అప్పు మనకి నెత్తికి చేతులూ ...

ఈసారి ఆలోచించాడు శంకరం. కాత్యాయని అంటూన్నమాట నిజమే నేమో. తమకున్నది రెండెకరాల పొలం. మామిడితోటా, నాలుగ్గదుల పెంకుటిల్లూ. డాక్టరీ చదువంటే అధమం పదివేలన్నా ఖర్చవుతుంది అతని జీతం తిండీ, బట్టకీ చాలదు. వాడు డాక్టరై మమ్మల్ని ఆదు కుంటాడని నమ్మకమేముంది? ఈ ఆస్తి లేకపోతే కనీసం అప్పున్నా మా కెవ డిస్తాడు? ఆడవారి మాటలని అన్నీ కొట్టి పారేస్తే. తనపాట్లు కుక్కలు పడవు అనుకున్న శంకరం. "రేపో ఎల్లుండో వెళ్లి భోగట్టా చేస్తామండు. అమ్మను చూపినట్టూ ఉంటుంది" అన్నాడు

కొంచం ధైర్యంవచ్చిన కాత్యాయని ఇంక తాను చెప్పబోయే ఉచితవచనాలు




దాచలేదు. ''తమ్ముణ్ణి చదివిస్తున్నా రను కోండి బాగానే ఉంది. ఇవ్వాళ అప్పయిం దని వ్రాసినవారు ఆ వాడు ఈ తమ్ముడుతో సంప్రతించారా! కావాలంటే తల్లి బ్రతి కున్నారు కాబట్టి ఐదో పదో పారేద్దాం. మనదేదో మనకి పారెయ్యమనండి' అంది అతనిమాట కద్దుపస్తూ.

''నీలా ఇంత ఖచ్చితంగా నే నెలా మాట్లాడగలను కాత్యాయనీ!'' అన్నా డతను నవ్వబోతూ.

''అయితే ఆతను మీ తలమీద టోపీ పెట్టక మానడు.''

''మా అన్నయ్య అలాటివాడు కాదు. తానన్నా ఇబ్బందిపడ్డాడు కాని, తమ్ముళ్ళ నెప్పుడూ గారాబంగానే చూస్తున్నాడు. వెళ్తాగాని, నువ్వేం అనవసరంగా గాభరా పడకు'' అన్నాడు శంకరం చిరాగ్గా.

• •

తల్లిని చూడాలని వచ్చిన శంకరం నాలుగు రోజులుండి పోయాడు.

''ఏమండీ మీ తమ్ముడినాళ్ళు ఉండి పోయాడు. అహా. మరేంకాదు....'' అంటూ నసిగింది శాంత.

''అవును చెప్పాలను కుంటున్నాను. ఇవ్వాళో రేపో మూర్తి వస్తాడు ఆస్తి పంచేసు కుంటాం. అమ్మకు తెలియ నివ్వకు. అసలే గుండె నీరసం. హైరాన పడిపోతూంది'' అతను మామూలు మాటల్లా చెప్తూంటే ఆమె అతని వైపు తెల్లబోయి చూస్తూంది.

పంపకాలై రిజిస్ట్రేషనవుతూంటే రాజేశ్వరమ్మకూ చెప్పక తప్పలేదు. ''అమ్మా నీకేమన్నా వ్రాయించమన్నావా'' అని మూర్తి అడిగేసరికి చీర చెరగు కప్పుకు బోరున ఏడ్చిందామె.

''అది కాదమ్మా! మామీదనీకు నమ్మక మేమిటి! డబ్బులేని తల్లిని హీనంగా చూసే పిల్లలు కొల్లలున్నారు. మాలో

ఎవ్వరి బుద్ధు లెప్పుడెలా మారుతాయో!''

''కాటికి కాళ్ళు చాచుకున్న ముండని నాకెందుకు బాబూ వాటా! వాణ్ణి చదువుకి పెట్టావ్. నాలుగేళ్ళు తిరక్కుండా అమ్మ తల్లో కాత్యాయనీ ఎంత జాణవే.''

''ఉష్ ఊరుకోమ్మా'' కసురుకున్నాడు మూర్తి.

ఆ రోజు రిజిష్ట్రేషనై శంకరం వెళ్ళిపోయిన రోజు. ఆ ఇంట్లో ఎవ్వరూ భోజనం చెయ్యలేదు.

''ఎలాపంచుకున్నారు 'రుద్ధ కంఠంతో ప్రశ్నించింది రాజేశ్వరమ్మ మూర్తిని

ఎకరా పొలం మామిడి తోటా వాడు తీసుకున్నాడు.

''అదేవిట్రా! .... '' గతుక్కుమన్నట్టయి ప్రశ్నించింది రాజేశ్వరమ్మ.

''అవునమ్మా! చిల్లర అప్పులు రెండు వేల రూపాయ లయ్యాయ్. అవి వాడికి సంబంధం లేదట. వాడి భార్య కట్నం తెచ్చిందట ఛ....ఛ....పోన్లెద్దూ. నాకు తల కొట్టేసి నట్టయింది పెద్ద మనుష్యుల దగ్గర. వీణ్ణి చదువులో పెట్టానని కావిలేకుంటే నాకేమీ వద్దనే వాణ్ణి ...''బాధగా అన్నాడు మూర్తి.

''ఇంకా వాణ్ణి చదివిస్తావా?''

''చదివిస్తానమ్మా అడుగడుగునా అడ్డు తగలకు.''

''చదవనన్నయ్యా .... అమ్మ చెప్పిన మాటా నిజమేనేమో!'' తల్లికీ అన్నకీ జరిగే సంభాషణ వెనుకనుంచి వింటూన్న మౌళి చప్పున వారి ఎదురుగా వస్తూ అన్నాడు.

''ఏమిట్రా అమ్మ చెప్పింది? వాడు వాటా తీసుకున్నంత మాత్రాన్న దరిద్రులమయ్యామా! డబ్బుసంగతి నీ కనవసరం. నేను చదివిస్తాను.'' అరచినట్టన్నాడు మూర్తి.

''ఎదిగిన కొద్దీ ఎడం ఎక్కువవుతుంది. అన్నదమ్ముల మధ్య. ఈ సత్యం ఎలా చెప్తే తెలుస్తుంది వీడికి'' తల కొట్టుకుంది రాజేశ్వరమ్మ.

''నేనుఅన్నయ్యకుదూరమైపోనమ్మా!'' రోషంగా అన్నాడు మౌళి.

వేదాంతిలా నవ్వింది రాజేశ్వరమ్మ. రెక్కలు మొలవలేదింకా....భార్య రాలేదింకా.... వేరే సంసారం. పిల్లలూ.... ఇవన్నీ వస్తే అన్నయ్య నీ మనస్సులో ఏ మూలా ఇమడలేదు అంటూ.

''మం జు కూ డా అల్లాం టి దే నా అత్తయ్యా!'' నవ్వింది శాంత.

మీ మొగుడూ పెళ్ళావికి, నా వాళ్ళంటూవిస్వార్థంగాప్రేమించడం తప్ప లోకజ్ఞానం తక్కువర్రా ఎలాగో అఘోరించండి అంటూ ఆయాసం రావడంవల్ల వరండాలో మంచంమీద నడుంవాల్చింది రాజేశ్వరమ్మ.

(ఇంకా వుంది)



# సీత అత్తయ్య

శివం

వెన్నెలలో హుస్సేన్ సాగర్ అందాన్ని వర్ణించలేము. వెంకట్రావును ప్రేమించి పెళ్ళిచేసుకోబోతున్న సుచిత్రకు ఆ క్షణంలో వెంకట్రావు ఎక్కువ అందంగా వున్నాడో, హుస్సేన్ సాగర్ అందంగా వుందో తేలలేదు.

వెంకట్రావు ఆ వెన్నెలలో, చిరు చలిగాలిలో, నెమ్మదిగా సుచిత్రను ఆనుకొని, "ఏదీ నీ లిస్టు తియ్యి." అన్నాడు. సుచిత్ర ఆలోచనలోంచి తేరుకుని, ప్రక్కనేవున్న వానిటీబాగ్ లోంచి ఓ పెద్ద కాగితాన్నితీసి వెంకట్రా

ప్రకి అందించి. "ఇది ప్రిలిమినరీలిష్టు' ంది చిర్నవ్వుతో.

వెంకట్రావు ఆ కాగితాన్ని చూసాడు. దాపు ఎనభై మంది పేర్లవరకూ వున్నాయి ందులో. వెంకట్రావు ఆ పేర్లన్నీ ూసాడు. అంతా బంధువులు, స్నేహి లు, యిద్దరికీ తెలిసిన పరిచయస్తులు!

వెంకట్రావు సుచిత్ర తలమీద చిన్న ుట్టికాయవేసి. "ఎనభయిమంది పేర్లు సేవుకదా! ఇంకా ప్రిలిమినరీ లిస్టేనా యది! మీనాన్న మళ్ళీ లేచి తిరగాలా ్ళంతా వస్తే!" అన్నాడు.

సుచిత్ర కిలకిలా నవ్వి. "అంతా వలసినవాళ్ళే. ఎవర్ని వదుల్తాం?" న్నది.

వెంకట్రావు మళ్ళీ లిస్టువైపు చూడ ాగేడు.

సుచిత్ర మళ్ళీ వెంకట్రావు వైపు ాసింది. 'వెంకట్రావే ఎక్కువ ందం' అనుకుంది లోలోపల! అసలు ఇవ్వేళ అంతా అందంగానే కన్పిస్తోంది ుచిత్రకి. ప్రొద్దుట లేవగానే 'ఎంత ందమైన రోజు' అనుకుందాతర్వాత ఎంత అందమైన నెల' అనుకుంది. ప్పుడు ఎంత 'అందమైన వెంకట్రావు! నుకుంటోంది.

వెంకట్రావులో అసలు ఏదో గొప్ప కర్షణ వుంది. ఏదో ప్రత్యేకత వుంది దో చెప్పలేని విశేషం వుంది. అందుకే ంతమంది స్నేహితుల్లోనూ అత నంటేనే పెళ్ళికి యిష్టపడింది.

టాంక్ బండ్ మీద టాక్సీలు, డబుల్ డెక్కర్లు, మోటార్ సైకిళ్లు పెద్ద రొద చేసుకుంటూ పోతున్నాయి, వస్తున్నాయి. ఇవ్వాళ అవ్వేమీ సుచిత్ర చెవుల పడటం లేదు. ఆమె వెంకట్రావునే, చూస్తూ కూర్చుంది—ఆ టాంక్ బండ్ బెంచీ మీద.

చేతిలోని లిస్టులో వకచోట తర్జనితో చూపిస్తూ "ఈవిడెవరు!" అన్నాడు వెంకట్రావు. సుచిత్ర గాలికి ఎగిరే ముంగురుల్ని సవరించుకుంటూ, ముందుకి వంగి లిస్టుచూసి, "ఓ! ఆవిడా! ఆవిడ మా అత్తయ్య! సీత అత్తయ్య." అంది. "మీ అత్తయ్యా! అయితే ఆవిడ పేరుకి ఎదురుగా ప్రశ్నార్థకం దేనికి? తర్వాత కొట్టివెయ్యడం దేనికి? అన్నాడు వెంకట్రావు. "మా అమ్మేమో ప్రశ్నార్థకం పెట్టింది. నాన్నేమో కొట్టే పేరు." అంది సుచిత్ర, వెంకట్రావు కళ్ళల్లోకి చూస్తూ.

"ఏం! ఆవిడ ఏం తప్పు చేసిందని ఆవిడ పేరు కొట్టేసేరు? ఆవిడ రాకూ డని మనిషా!

"అదేంకాదు గాని..........ఇప్పుడో దురుసుగా ప్రవర్తించిందట!"

"ఓ అట్లానా? దురుసుగా అంటే, ఎదురు తిరిగిందా?"

"ఏమో బాబూ! నాకా వివరాలు అట్టే తెలియవు. మా అత్తయ్య

ఉమ వే

ఇంట్లోంచి పారిపోయేనరికి నాకు పద కొండో పదో ఏళ్ళు!''

''మీ అత్తయ్య యింట్లోంచి పారి పోయిందా?' అని అడిగేడు వెంకట్రావు కొంచెం ఆశ్చర్యంగానే

''అవునట. మా తాతయ్య ఏదో సంబంధం కుదిరిస్తే వద్దందిట! పీల్లేదు చేసుకోవాలి అని కోప్పడితే, యింట్లోంచి పారిపోయిందిట.'' హుస్సేన్‌సాగర్‌లో వెలిగే లైట్లకాంతివైపు చూస్తూ, సుచిత్ర యింకా అంది, ఈ సంఘటన జరిగే వరకు మానాన్నకి అత్తయ్య అంటే పంచప్రాణాలుట! నాకింకా గుర్తు. అత్తయ్య ఎప్పుడూ నవ్వుతూ, ఎంతో వుత్సాహంగా వుండేది. ఎక్కడుందో, ఎట్లావుందో పాపం!''

''అంటే యిప్పుడావిడ ఎక్కడుందో కూడా నీకు తెలియదన్నమాట''

''ఊహు తెలియదు. నిన్న పాత ఆల్బం చూస్తూంటే అత్తయ్య చిన్ననాటి ఫోటో కన్పించింది. మరచిపోతానేమోనని లిస్టులో ఆవిడపేరుకూడా వేసేను. కాని నాన్న కొట్టిపారేసేరు.''

''కాని పెళ్ళి చేసుకునేది నువ్వు అనే సంగతి మరచిపోకు'' అన్నాడు వెంకట్రావు, సుచిత్ర కళ్ళవైపు ఓసారి చూసి.

''అవచ్చును. కాని నాన్న సంగతి నీకూ తెలుసుగా. ఒకోసారి మహా మొండి పట్టుదల పడతారు'' అంది గోముగా. వెంకట్రావు చేతిని తనచేతిలోకి తీసుకుని నిమురుతూ. ఏదో గుర్తుకొచ్చినట్లు మ అంది. ''పైగా నాన్న యీ మధ్య అత్తయ్య పేరు ఎత్తడం నే నెన్న వినలేదు. వాళ్ళిద్దరూ హో రా హో పోట్లాడుకొని వుంటారనిపిస్తోంది నాకు.

''ఎంత హోరాహోరీ పోట్లాడుకున్నా వాళ్ళు రాజీపడటానికి ఇంతకంటె మ సమయం దొరకబోదు'' అన్నాడు వెం ట్రావు. లిస్టుని సుచిత్ర చేతికి అందిస

''ఏమోనబ్బా! కొత్త పోట్లాట కూడా యిది సమయం కాదని నా శం!'' అంది సుచిత్ర లేచి. లిస్ట 'వేనిటీ బ్యాగ్' లో పెట్టుకుని

''ఇంక పోదామా?'' అన్నాడు వె ట్రావుకూడా లేస్తూ.

''ఆ! పోదాం! ఎనిమిదయిపోయింది మా నాన్న....''

''అబ్బబ్బ....అన్నిటికీ మీ నాన్న. నాన్న! నీకు వ్యక్తిత్వం....స్వంత అ చన్లు .... లేనేలేవా చిత్రా!'' అన్నా వెంకట్రావు, నడుస్తున్న సుచిత్రని ఆ

''ఏం? తల్లిదండ్రుల మాటలు వాళ్ళన్నా, వాళ్ళకి భయపడేవాళ్ళన్నా నీకు నచ్చరా?'' అంది సుచిత్ర కొంచె

''నువ్వు తప్ప నాకెవ్వరూ న రనుకో....'' అంటూ ఆమె భుజం చెయ్యివేసి, ఆమెని దగ్గరగా లా న్నాడు వెంకట్రావు.

* *

వెంకట్రావుది సంపన్న కుట

ు కాదు. వెంకట్రావు తండ్రి సెక్రె
యట్‌లో మామూలు అప్పర్ డివిజన్
క్లె. ఆయన ఎట్లాగో కష్టపడి కుమార
ఘ్ని బి యస్‌సి. చదివించేడు.
ఏన కింకా యిద్దరు కొడుకులు. వక
గా_ర్తె వున్నారు. అంతా చదువుకుంటు
రు. ప్రస్తుతం వెంకట్రావు వక
శీ కంపెనీలో మేనేజర్‌గా నెంకి
రూ|| లు జీతం తెచ్చుకుంటున్నాడు.
వెంకట్రావు ఇంటర్మీడియేట్ చదువు
ంతగా, సుచిత్ర క్లాసుమేట్. ఆ
ృత ఆమె బి ఏ. కి వెళ్ళి ప్యాసయ్యి.
కట్రావు ప్రేమలో పడి, పెళ్ళికి
ుచూస్తోంది ప్రస్తుతం.

ఈ సంబంధం సుతరామూ గోపాలం
కి యిష్టం లేకపోయినా, సుచిత్ర
ందలవల్లే గోపాలంగారు వప్పుకోవలసి
ంది. సుచిత్ర గోపాలంగారికి వక్కగా
క్కకూతురు అవడంవల్ల ఆమె ఎంత
తే అంత!

గోపాలంగారు స్టీలు వ్యాపారంలో
లకి లక్షలు ఆర్జించేడని ప్రతీతి.
యినా ఆయన ఎంతో నిరాడంబరంగా
ంటాడు. ఆయన ఎంత నిరాడంబరో
త మొండి కొన్ని విషయాలలో,

మర్నాడు సాయంత్రం ఆయాను
టలకెళ్లా సుచిత్ర, వెంకట్రావులు
క్ గార్డెన్‌లో, 'లేక్' దగ్గర కల్సు
న్నారు. ఇద్దరూ గడ్డిలో చతికిలబడి,
్న క్షణాలు నీళ్ళల్లో యీదులాడు
తున్న బాతుల్ని చూసేరు. ఉన్నట్లుండి
వెంకట్రావు అన్నాడు సుచిత్రతో, "మీ
సీత అత్తయ్యని గురించి వివరంగా
చెప్పు. ఎదురుతిరిగిన మనుషులంటే నాకు
మహాయిష్టం."

"ప్రపంచంలో యింక మాట్లాడు
కునేందుకు విషయాలే లేవా? మొన్న
నువ్వు చూపిన 'హంగేరియన్ బాలే' ని
గురించి చెప్పు—వింటా" అంది సుచిత్ర.
వెంకట్రావుని అనుకుని కూర్చుంటూ.

"నిజం చిత్రా! నేను చాలా సీరి
యస్‌గా అడుగుతున్నా. మీ అత్తయ్యని
గురించి తెల్సుకోవాలనే నిజంగా అడుగు
తున్నా" అన్నాడు నిశ్చిత స్వరంతో.

"అయితే నేను సీరియస్‌గానే చెబు
తాను. నువ్వు సీరియస్‌గానే విను.
అత్తయ్యకి మా తాతయ్య, తెల్సిన
సంబంధం తెచ్చి చెయ్యబోయేడట. కాని
మా అత్తయ్యకి ఆ సంబంధం యిష్టం
లేదుట. అంచేత వద్దందిట. తాతయ్య
మొండిగా ఆ సంబంధమే చేసుకోవాలని
పట్టు పట్టేసుట. మా అత్తయ్య అప్పటికే
రంగనాధం అనే సంగీతం మేష్టార్ని
ప్రేమించిందిట. మా అత్తయ్య
నాన్నారితో చెప్పుకుని ఏడ్చిందిట. ఆయనే
కూడా తాతయ్య మాటే వినాలన్నారట.
అప్పుడు చేసేదిలేక అత్తయ్య యింట్లోంచి
పారిపోయింది .... ఆ సంగీతం
మేష్టారుతో."

"ఊః బాగుంది. ఆయన పేరు




ఏమన్నావ్‌? రంగనాధమా? ఎక్కడైనా పనిచేసేవాడా?"

"ఊహుం. ఊళ్ళో ట్యూషన్లు చెప్పుకునే వాడు. మా వూరు వదలి వరంగల్లు వెళ్ళి అక్కడ ఏదో స్కూల్లో మేష్టారుగా చేరేట్ట. తర్వాత ఆ వుద్యోగం కూడా పోయిందని విన్నాను. తర్వాత వాళ్ళు హైదరాబాద్ చేరేరని విన్నాను. వాళ్ళు ఏమయిపోయేరో ఎక్కడున్నారో తెలియదు మరి." అంది.

ఆ వుద్యోగానికి కూడా మీ తాతే తిలోదకాలు యిప్పించి వుంటాడు. ఆ తర్వాత మీ అత్తయ్యని నువ్వు ఎన్నడూ చూడలేదన్నమాట" అన్నాడు వెంకట్రావు ఏదో ఆలోచిస్తూ.

"ఊహుం. మాకెంత అహం వుందో, అత్తయ్యకీ అంతే వుంది." అన్నది సుచిత్ర.

"మీ తాతయ్య వట్టి మూర్ఖుడు చి
త్రీని కట్టి పడవేసే రోజులు వెళ్ళి పో
యని గ్రహించలేక పోయేడు.
ఆమెని తరిమి తరిమి కొడితే, ల
పోతుందా? మీ తాతయ్య వట్టి మూర్ఖ
చచ్చి ఏలోకాన వున్నాడో గాని?
సరేగాని, యిప్పుడు మనం మీఅత్తయ
మన పెళ్ళికి పిల్చి తీరాలి? ఆమె
నాడు సంఘపు నియమాల్ని ఎది
వుండొచ్చును. పెద్దల మాటని క
వుండొచ్చును. కాని, అందుకు మి
క్షని అనుభవించింది. ఆమెని ఎట్లా
మనం వెతికి, మన పెళ్ళికి పిల
చ్చిత్రా?" అన్నాడు ఎంతో ఆవేశ
సుచిత్ర కొంచెం వెంకట్రావు
జరిగి, "నాకూ అత్తని చూడాలనే వు
అందుకేగా ఆమె పేరుని కూడా
లిస్టులో వేసుకున్నా. కాని నాన్న....

"నాన్న....నాన్న! నీ సంగతేమిటి? ...దంటే నీకు యిష్టం వుందా లేదా?" ...న్నాడు కొంచెం చికాగ్గా.

"ఎంతో యిష్టంవుంది వెంకట్రావు! ...ని ప్రస్తుత సమయంలో కంపంతా ...లడం మంచిదికాదు! మనమంతా ...తో హాయిగా వున్నాం. విషయాలన్నీ ...్యంగా నడుస్తున్నాయి...."

"మన మొక్కళ్ళం హాయిగావుంటే ...ంటావు. ఎప్పుడో తెలిసీ తెలియక ...న తప్పుకి, ఆవిడ అనుభవించిన శిక్ష ...క. జీవితమంతా, నా అన్నవాళ్ళు ...్లు, ఎక్కడో దుఃఖంతో కుమిలి ...ంగి, కృశించి పోవాలంటావు. నీకు ...ంగా నీ అత్తయ్య అంటే యిష్టం ...దా చిత్రా! ఉంటే యిట్లా మాట్లాడ ...ా చిత్రా!" అన్నాడు వుద్వేగంతో ...కట్రావు; సుచిత్ర భుజం పట్టుకుని ...పుతూ.

...బ్లిక్ గార్డెన్‌లోని "లేక్" లో ...ర్యుడు అస్తమిస్తూ, ఆకాశాన్నంతా ...ంగారపు రంగుతో నింపేసేడు. ...ఎక్కడో తుపాకీ పేలిన చప్పుడుకి, చెట్ల ...పిట్టలన్నీ రొదచేస్తూ వక్కసారి ...ోయేయి.

వెంకట్రావు చేతివేళ్ళ కింద, సుచిత్ర ...ం కొద్దిగా వణికింది. సుచిత్ర క్షణం అన్నది, "అయితే, నీ యిష్టం వచ్చి ...చేద్దాం, రా, యింటికి వెళ్ళి మా ...్న గారితో మాట్లాడదాం."

"నడు వెళదాం." అన్నాడు ఉత్సాహంగా వెంకట్రావు; లేచి నిలబడుతూ.

* *

సుచిత్ర, వెంకట్రావు, గోపాలంగారింటికి చేరేసరికి, ఆయన వరండాలో సిగార్ కాలుస్తూ, పేపర్ చూస్తున్నాడు.

వీళ్ళని చూడగానే పేపర్‌ని బల్లపైన పడేసి, "రండి, రండి! ఇంకా ఏదో సినిమాకి వెళ్ళిపోయి వుంటారని అనుకున్నా." అన్నాడు లేచినిలబడి.

గోపాలంగారు ఆరడుగుల ఆజానుబాహువు ఎత్తుకు తగ్గ లావు. గంభీరమైన స్వరం.

"నాన్నారూ! మేమొక విషయం గురించి తగాదా పడుతున్నాం. వెంకట్రావు అంటున్నాడు — మనం, సీత అత్తయ్యని పెళ్ళికి పిలవాలని" అన్నది సుచిత్ర నెమ్మదిగా.

"ఓ! అట్లాగా! ఏమోయ్ అల్లుడూ! నిజమేనా!" అన్నారుగోపాలంగారు, వెంకట్రావువైపు దృష్టి నిగిడ్చి.

"అవునండి! పిలవాలని నాకుంది." అన్నాడు వెంకట్రావు.

"ఇది కుటుంబ వ్యవహారం బాబూ! ఇట్లాంటి వాటిల్లో నువ్వు జోక్యంచేసుకోకూడదు" అన్నారు గోపాలంగారు.

'ఆ విషయం నేనూ వప్పుకుంటాను అనుకోండి, కాని యిది మాయిద్దరి పెళ్ళి సందర్భంలో జరిగేపని ముఖ్యంగా చిత్ర యిష్టపడే వ్యక్తుల్ని, చిత్ర పిలవ

తంలో తప్పేమీ వుండదనుకుంటాను.''

''వెంకట్రావ్ ! ఇంక యీవిషయం గురించి చర్చ అనవసరం.'' అన్నారు గోపాలంగారు. మేఘ గర్జనవి మరిపించే స్వరంతో, కళ్ళు ఎర్రబడగా :

''వెంకట్రావు....వోసీ వెంకట్రావు ....నేను ముందే చెప్పాగా ! వాన్నారూ....'' అంటూ వణకిపోతూ ఏదో చెప్పబోయింది సచిత్ర.

గోపాలంగారు ఆమె మాటల్ని పట్టించుకోకుండానలు ఆయన పిడికిలి బిగించి, ఏదో చెప్పబోయి, వెంటనే తనని తాను సంబాళించుకుని, మృదువుగా, వెంకట్రావుతో అన్నాడు, ''వెంకట్రావ్, మా కుటుంబంయొక్క అంతస్తు, ఆదర్శాలు, నువ్వు ఎరగవు, ముందుముందు తెల్సుకోగలవు. అప్పుడు నీకు అర్థం అవుతుంది అంతా. ఇప్పుడు మనం చర్చించి ప్రయోజనం వుండదు కూడా ను.''

ఇంతలో గోపాలంగారి భార్య కాంతమ్మగారు రావడంతో ఆ ప్రసంగం అంతటితో ఆగిపోయింది.

* *

సుచిత్రకి తాత్కాలికంగా వెంకట్రావు మీద కోపంవచ్చినా, మర్నాడు, అంతా మరచిపోయింది. గోపాలంగారుకూడా ఏమీ జరగనట్లే, అతనితో ఆప్యాయంగా మాట్లాడేరు. రెండురోజులు మామూలుగా గడచిపోయేయి.

పెళ్ళిముహూర్తం యింకా రెండ రోజులుంది. ఆనాటి సాయంత్రం కొ చీర జాకెట్లతో ముస్తాబయి, వెంకట్రా కోసం ఎదురుచూస్తూవుంది సుచిత్ర ఇంతలో తల్లివచ్చి కుమార్తెని లాలన దగ్గరికి లాక్కుని మొహంలోకి చూస్తు ''అప్పుడే పెళ్ళికళ వచ్చేసింది నాతల్లికి.' అంది.

'పోవే! నువ్వెప్పుడూ....''అంటు గునిసింది సుచిత్ర.

''సినిమాకిగానివెళ్ళేట్లయితే, కారులో వెళ్ళండి, నడచి వెళ్ళొద్దు దిష్టికూడ తగుల్తుంది.'' అంది కాంతమ్మగారు.

''సరే .... అట్లానేకాని, యింత అతను రాందే !'' అంది.

''బాగానేవుంది సంబడం! నువ వంటింట్లో వుండగానే అతను వచ్చే తల్లీ ! మీనాన్నగారితో ఏదో మాట్లా తున్నాడు ఆ గదిలో!'' అంది గోపాల గారి గది చూపిస్తూ.

''అంత రహస్యం ఏమిటమ్మా.. తలుపులుకూడా దగ్గరగా వేసుకు మాట్లాడుతున్నారు.'' అంది సుచి దీర్ఘంతీస్తూ.

''బహుశా అతనికివ్వబోయే కట్న గురించి అనుకుంటా.''

''మీనాన్నగారు ఎంతచెప్పినా, 'తీ కోనుగాక తీసుకోను'' అంటున్నాడత ఈ మగాళ్ళు యింత మొండివాళ్ళేమి నాతల్లీ! ''అంది నవ్వుతూ కాంతమ్మ-

బుగ్గని వేలు వేసుకుని.

సుచిత్రకూడా నవ్వేసి. "అయితే వాళ్ళని బయటికిలాగుదాము రా!" అంటూ కాంతమ్మ అనుసరించగా ఆ గదివైపు నడిచింది.

కాంతమ్మగారు గుమ్మంముందు ఆగి "ఏమండీ మీ చర్చలు యింక పూర్తి గావా? అమ్మాయి అతనికోసం ఎదురు చూస్తోంది. యిందాకటినుంచి." అంది.

"ఇదిగో అయిపోయింది" అంటూ గోపాలంగారు, ఆవెనక వెంకట్రావు గదిలోంచి యివతలకి వచ్చేరు.

వెంకట్రావు సుచిత్రవైపు తిరిగి, "రెడీయేనా?" అని సుచిత్ర తలవూపగా, "మేం అట్లా సినిమాకి వెళ్ళి వస్తాం" అంటూ సుచిత్రతో బయటికి దారితీసేడు.

రోడ్డుమీదకి వచ్చేక వెంకట్రావు అన్నాడు సుచిత్రతో. "మీ నాన్నగారు చాలా గొప్ప వ్యక్తి సుమా! సాధారణంగా యీ ధనికులు తమ తప్పు వప్పుకోరు."

"ఏం జరిగింది? నీ మాటే నెగ్గిందా" అన్నది. లోలోపల 'కట్నం తీసుకొన్నా, తీసుకోకపోయినా వకటే' అనుకుంటూ.

"నామాట కాదు నెగ్గింది! ఆయన గొప్పతనం .... మంచితనం" అన్నాడు వెంకట్రావు. రోడ్డున పోయే టాక్సీని ఆపుచేస్తూ.

* *

కారుని 'తాజ్‌మహల్ హోటలు' వద్ద ఆపి యిద్దరూ లోపలికి వెళ్ళి కాఫీ ఆర్డరు చేసేక. సుచిత్ర అన్నది. "ఇవ్వేళ ఏదైనా సినిమాకి వెళదామా?"

"గొప్పచిత్రాలు ఏమీలేవుగాని. అట్లా 'లాల్‌బజార్' వరకు వెళ్ళొద్దాం."

"లాల్‌బజారా?" ఆశ్చర్యంగా అడిగింది సుచిత్ర.

"అవును. కొంచెం పనివుంది."

ఇద్దరూ కాఫీలు ముగించుకుని వచ్చి కారులో కూర్చున్నాక డ్రైవర్ లాల్‌బజార్ వైపు పోనిచ్చేడు కారుని.

సుజాత ఎన్నో మధురమైన ఆలోచనలతో మత్తుగా కళ్ళుమూసుకుని. వెంకట్రావు భుజంమీద వరిగింది. వెంకట్రావు కాస్సేపు ఆగి, వకచోట డ్రైవర్ని కారు ఆపమన్నాడు. సుచిత్ర కళ్ళు తెరచి. "ఎక్కడికి వచ్చేం?" అన్నది.

"ఇక్కడ నీ మిత్రురాలు వకావిడ వుంది" అన్నాడు చిన్నవ్వుతో; కారులోంచి బయటికి దిగి.

"మా సీత అత్తయ్య కాదు కదా!" అన్నది సుచిత్ర ఆశ్చర్యంతో.

"అవును. ఆవిడే!"

"నువ్వు ఎట్లా కనుక్కున్నావ్ వెంకట్రావు" అన్నది సుచిత్ర కారులోంచి యివతలికి వచ్చి.

"కనుక్కోవాలంటే కష్టం ఏముంది? నువ్వు ఆయన పేరు, చేసిన వుద్యోగం చెప్పేవు కదా ఉద్యోగంపోయిన తర్వాత




ఆయన బహుశా నాటక కంపెనీవాళ్ళ దగ్గర చేరివుంటాడని అనుమానం వేసి, వాళ్ళని విచారించేను. ఆయనని గురించిన సమాచారం వాళ్ళదగ్గరే దొరికింది.''

"అయితే ఆయన్ని కూడా కలుసుకున్నావా నువ్వు?'' అంది సుచిత్ర సంతోషంతో.

"ఊహూ.... అంత అదృష్టం పట్టలేదు. ఆయన వితంతువుని — అంటే మీ అత్తయ్యని కల్పుకున్నా' అన్నాడు విచారంగా.

"నిజమేనా....'' అంది విషాదంగా సుచిత్ర. జీరపడిన గొంతుతో.

"అవును. రా .... లోపలికి అదే ఇల్లు. మీ అత్తయ్య నీకోసం యెదురు చూస్తూ వుంటుంది'' అన్నాడు వో యాభయిగజాల దూరంలో వున్న చిన్న పెంకుటింటిని చూపుతూ.

"మా అత్తయ్య వంట్లో యెట్లా వుంది?'' అంది భయంభయంగా.

"పర్వాలేదు. రా. చూద్దువుగాని'' అని చెయ్యిపుచ్చుకుని, ఎదురుగా కన్పించే యింటికి నడిపించేడు సుచిత్రని వెంకట్రావు.

"రా! అమ్మా....సుచీ! రా!'' అంటూ తెల్లచీర కట్టుకొని వున్న మధ్య వయస్కురాలు వకావిడ ఎదురువచ్చి లోపలికి ఆహ్వానించింది ఆప్యాయంగా.

"అదే స్వరం! అదే ఆప్యాయత! కాని ఎంత మారిపోయింది రూపం'' అనుకొంది సుచిత్ర లోపలకు అడుగు పెడుతూ.

ఆ చిన్నయిల్లు ఉన్నంతలో శుభ్రంగా అమర్చబడి వుంది. గది మధ్యలో చిన్న చాప వెయ్యబడి వుంది. సీత అత్తయ్య ఆ చాపని చూపుతూ "అట్లా కూర్చో









---

"ఇంత వైరాగ్య మెందుకూ?"

రమేశుడు యీ మాట వెటకారంగా అన్నదో, పరిహాసంగా అన్నదో గ్రహించలేక, క్లుప్తంగా—"వైరాగ్యంగాదు, సోమరితనం" అన్నాడు.

"కాని, ఇతర్ల పనులకు మీకు పాలుమాలిక ఉండదే?"

"దానికి కారణం ఉంది. ఇతర్ల పనికి పాలుమాలితే భగవంతుడికి సమాధానం చెప్పవలసి ఉంటుంది. సొంత పనులకు కూడా చెప్పవలెనేమో కాని, అంత దండన ఉండదనుకుంటాను."

"మీకు డబ్బున్నది కాబట్టి పరులకు సహాయం చేయటానికి పూనుకుంటున్నారు. మరి డబ్బులేనివారో?"

"ఆ సంగతి నాకు తెలియదు రమా! ఎందుకంటే, డబ్బు ఇంత ఉండాలనిగానీ ఈ విధంగా ప్రజలకి తోడ్పడాలనిగానీ నియమమేమీ లేదు. ఆ లెఖ్ఖలన్నీ ఇహపర భారాలు వహించిన భగవంతునికే తెలియాలి"

"కాని పరలోకాన్ని గురించి చింతించవలసిన ప్రాయమింకా మీకు రాలేదుగా! నాకంటే మీరు మూడేళ్ళే పెద్దవారు"

రమేశుడు నవ్వుతూ—'అంటే, నీకింకా పరలోక చింత లేదనేగా భగవంతుడు నీకలాటి బుద్ధే ఇవ్వాలని కోరుతున్నాను. నూరేళ్ళు బ్రతుకు, కాని నేను మాత్రం ఈ రోజు నాకు చివరి రోజు కాదని అనుకోకుండా ఉండలేను.'

ఊరకుని అడిగింది:—"మీరు దేవుడిగుడి చూడలేదు సరే, భోజనానికి కూర్చునే టప్పుడు సంధ్యావందనం కూడా చేసుకోలేదేం? మరిచి పోయరా?"

"మఱచిపోలేదు. కాని మరిచిపోయినా పెద్ద లోపం అని అనుకోను!—ఎందుకూ ఈ సంగతి అడిగా వు?"

"మీకు పరలోకాన్ని గురించిన చింత ఎక్కువకదూ? అందుకని."

రమేశుడేమీ సమాధానం చెప్పలేదు. ఇద్దరూ కాసేపు మెదలకుండా ఊరుకున్నారు. తర్వాత రమ అన్నది:—"చూడండి నన్ను నూరేళ్లు బ్రతకమనటం దీవించటం కాదు, శాపమివ్వటం. మన హిందూ విధవను ఎక్కువ కాలం బ్రతకమని శ్రేయోభిలాషు లెవరూ కోరరు" అని కాసేపు మెదలకుండా ఊరుకుని మళ్ళీ—"నేను కాటికి కాళ్లుచాచి కూర్చున్నానని చెప్పలేను. కాని ఎక్కువకాలం బ్రతకట మనేవరకు మాకు భయమేస్తుంది. మీ సంగతి వేరు మేము మీకేదైనా చెప్పినా ప్రగల్భాలుగానే జమకడతారు. ఎప్పుడైనా మీకు ఈ ప్రపంచంలో పరులకోసం బుర్ర బద్దలు కొట్టుకోవటం వెర్రితనమని తెలిసి వచ్చినప్పుడు నామాట జ్ఞాపకం తెచ్చుకోండి" అని వింపాసిగా చెప్పింది.

రమేశుడు జవాబుగా నిట్టూర్చి, కాసేపున్నాక అదేవిధంగా అన్నాడు—"జ్ఞాపకం తెచ్చుకునే చెప్పుతున్నాను, రమా! నేను నీకు యేమీ కాను, పైగా నీ మార్గంలో కంటకాన్ని. ఇవ్వాళ నేను పొరుగువాడిలాగా నీ దగ్గర యెంత ఆదరం పొందానో అదేగనక ఇంటివారిదగ్గర ఇంకొకరికి లభిస్తే, ఆ వ్యక్తికి పరుల కష్టాలు చూస్తే ఎంత వెర్రి యెత్తుతుందో చెప్పగలమా? ఇంతకుముందే నేను కూర్చుని అనుకుంటు న్నాను—నా జీవితమంతా యీ ఘడియలో మారిపోయిందని. ఇలా ఆదరంతో నా కెవరూ భోజనం పెట్టలేదు. భోంచేయటంలో ఇంత ఆనందముందని నాకు తెలియటం ఇదే మొదలు!"

ఈ మాటలు వినేవరకు రమ శరీరమంతా గగుర్పొడిచింది:—"ఇది మర్చి పోవటం మీకు ఎక్కువరోజులు పట్టదు. అథవా ఎప్పుడన్నా జ్ఞాపకంవచ్చినా చాలా స్వల్పవిషయంలాగా తోస్తుంది" అన్నది మామూలుస్థితికి వచ్చి. రమేశుడేమీ మాట్లాడలేదు

"ఊళ్ళోకి పోయి నిందించ పోతే చాలు, పొగిడినంత భాగ్యం" అంది రమ.

"లేదు రమా! నేను నిందించను, పొగడనుకూడా. ఈరోజు నాకు నిందకూ పొగడ్తకూకూడా అతీతమైంది!" అన్నాడు రమేశుడు నిట్టూర్చి.




రమ కాసేపు మెదలకుండా కూర్చుని. తర్వాత తన గదిలోకి వెళ్ళిపోయింది. అక్కడ యేకాంతంలో ఆమె కళ్ళనుంచి అశ్రువులు టపటప క్రిందపడ నారంభించినవి.

# 11

రెండురోజులనించి జోరున వర్షం కురిసి ఇవ్వాళ మధ్యాహ్నమే తెరిపి యిచ్చింది.

రమేశుడు కచ్చేరీ చావిట్లో కూర్చుని గోపాల సర్కారుతోపాటు జమీందారీ లెఖ్ఖలు చూస్తున్నాడు. ఇంతలో అకస్మాత్తుగా ఇరవైమంది రైతులువచ్చి—'చిన్నబాబుగారూ! ఈమాటు మమ్మల్ని రక్షించండి. మీరు సహాయపడకపోతే మేము పిల్లల చేతులు పట్టుకుని బిచ్చమెత్తుకుంటూ తిరగాలండీ!" అంటూ ఏడ్చారు.

"సంగతేమిటి?" అన్నాడు రమేశుడు ఆశ్చర్యంతో.

"వంద ఎకరాల పొలం మునిగిపోయిందండి. నీళ్ళు బైటికి పోకపోతే పైరంతా మురిగిపోతుందండి. ఊళ్ళో ఒక్కళ్ళకికూడా తిండి ఉండదండి, బాబూ!" అన్నారు రైతులు.

రమేశునికి ఏమీ అర్థంకాలేదు గోపాల సర్కారు వాళ్ళను రెండుమూడు ప్రశ్నలు వేసి రమేశునికి తెలియజెప్పాడు:—ఆ గ్రామస్తులకు ఈ వంద యెకరాల పొలమే మాగాని. అందరి భూమీ ఉన్నది అక్కడ. తలా కాస్త—పొలానికి ఉత్తరమూ పడమటా గ్రామం. మెరక కాబట్టి అటు నీళ్లు పోవు. తూర్పు రైలుకట్ట. దక్షిణాన

వీరి ఉమ్మడి బాదవ ఉంది. అక్కడ సంవత్సరానికి రెండునందల రూపాయల చేపలు దొరుకుతవి. అందుకనే వేణీబాబు దానిచుట్టూ కట్టవేయించి కాపలా పెట్టాడు. రైతులు ఇవ్వాళ ఉదయంనించి ఆయనదగ్గరపడి ఏడ్చి ఏడ్చి ఇప్పుడే ఇక్కడికి వచ్చారు.

రమేశుడిక ఏమీ వినకుండానె తొందరగా బయటికి వెళ్లిపోయాడు. పొద్దు కూకబోతూ వుంది. వేణీ దింపుమీద చేరబడి హుక్కా పీలుస్తున్నాడు. ఆయనదగ్గరే హావల్దారుగారు కూర్చుని, బహుశా ఈ సంగతులే మాట్లాడుకుంటూ ఉన్నారనుకుంటాను.

రమేశుడిక ఏమీ భూమికలేకుండా, వస్తూనే—''అక్కడ కట్టవేసి కూర్చుంటే ఇక కుదరదు, ఇప్పుడే తెగగొట్టి చాలి'' అని అన్నాడు.

''ఏ కట్ట?'' అన్నాడు వేణీ హుక్కా హావల్దారు చేతికిచ్చి.

రమేశుడు అసలే ఆవేశంతో వచ్చాడు:—''ఎన్ని కట్టలున్నాయ్. అన్నాయ్? ఆ పొలమంతా మునిగిపోతున్నది. కట్ట తెగగొట్టుకోడానికి అనుమతివ్వండి'' అన్నాడు కోపంతో.

''అది తెగగొడితే రెండు మూడు వందల రూపాయల చేపలు నీళ్ళవెంట పోతాయని నీకు తెలుసా? ఆ నష్ట మెవరిస్తారు? నువ్వా, రైతులా?''

రమేశుడు కోపం చంపుకుని—''రైతు లేమిస్తారు బీదవాళ్లు! ఇక నేనెందుకివ్వాలో నాకు అర్థంకావటం లేదు'' అన్నాడు.

''ఐతే మేముకూడా ఇంత నష్టమెందుకు పడాలో నా కర్థంకావటం లేదు.'' వేణీ హావల్దారువంక చూసి—''కక్కాయ్! చూచావుగా మావాడు ఇలాచేసి నిలపాలంటాడు జమీందారీ! కాదోయ్, రమేశ్! ఆ ముండాకొడుకులు పొద్దుటినించీ ఇక్కడ శవం దగ్గర కూర్చుని ఏడ్చినట్టు ఏడ్చిపోయారు. నాకు వీళ్ళ టక్కులన్నీ తెలుసు. మీ వాకిట్లో దర్వాజా లేదా—చెప్పులు కరువైనాయా? పో. ఇంటికిపోయి ఆపని చేయి. వీళ్ల చప్పున తీస్తవి'' అని వేణీ హావల్దారుతోపాటు తను చమత్కారంగా మాట్లాడినందుకు తానే నవ్వనారంభించాడు. ఇటు రమేశుని సహనశక్తి పోతూవుంది. అయినా వినయంగానే అన్నాడు:

''కొంచెం ఆలోచించిచూడు, అన్నయ్యా! మనకి రెండు మూడు వందలు నష్టమైనా ఫరవాలేదు—వాళ్ళకి సంవత్సరం గ్రాసం పోతున్నది. కనీసం అయిదారు వేలన్నా వాళ్ళకి నష్టముంటుంది.''

''వాళ్ళది ఐదువేలుపోతే మనకేం, యాభై వేలుపోతే మనకేం—వాళ్ళకోసం మనమెందుకు నష్టపడాలి, రెండువందలు?



రమేశుడు చివరిప్రయత్నం చేశాడు:—"సంవత్సరం పొడుగునా వాళ్ళేమి తింటారు?"

- - - -

ఇది చాలా నవ్వుపుట్టించే ప్రశ్నయినట్టుగా వేణీ ఆటూ యిటూ పొర్లబడి నవ్వి, ధూ, థూ అని ఉమ్మివేసి—"ఏమి తింటారా? ముండాకొడుకులు పొలం తాకట్టు పెట్టుకుని డబ్బివ్వమని మనదగ్గిరికి పరిగెత్తుకు వస్తారు. తమ్ముడూ! నువ్వు కొత్త లోకంచూసి వదువు. మన పెద్దలు ఏదో సంపాదించి, పెంచి మనకు పారవేసి పోయారు. ఈ ఎంగిలి! మళ్ళీ మనం దీన్ని తరగకుండా ఖర్చుపెట్టుకుని పిల్లలికి యిచ్చిపోవాలి. లేకపోతే వాళ్ళేమి తింటారు?—ఇక ఆ ముండాకొడుకులు యెలా తింటారంటావా? అప్పుచేసి తింటారు!" అన్నాడు.

అసహ్యంతోనూ, కోపంతోనూ, క్షోభతోనూ రమేశుని ముఖం కందిపోయింది.

కాని గొంతులో కాఠిన్యం రానివ్వకుండా—"మీరంత గట్టిగా స్థిరపరుచుకున్నాక ఇక మీతో తర్కిస్తేమాత్రం లాభ మేముంటుంది? నేను రమదగ్గరకి పోతున్నాను—ఆమె ఇష్టపడిందంటే మీ ఒక్కరిమాటా సాగదు" అన్నాడు.

"మరీ మంచిది. అలాగే పోయి చూడు. మాకు అభిప్రాయభేదం వున్నదేమో. అది తెలివితక్కువది అనుకుంటున్నావేమో తమ్ముడూ! దాన్ని మెదుపుచ్చలేవు. మీ నాయన అంతటివాణ్ణి ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువుల నీళ్లు త్రాగించింది!— ఏమంటావు కక్కాయ్?"

రమేశునికి కక్కాయి అభిప్రాయం తెలుసుకోవాలనే కుతూహలం కలగలేదు. వేణీతో ఇక మాట్లాడడానికికూడా అతని మనస్సు పోలేదు. అతను మెదలకుండా బయటికి వచ్చాడు.

ఇంటి ముంగిలిలో తులసికోటదగ్గర సంధెదీపం వెలిగించి నమస్కరించి నిలబడగానే రమకు రమేశుడు కనబడ్డాడు. ఆమెకు ఆశ్చర్యం వేసింది. ఆమె తలమీద ముసుగులేదు—కొంగు మెడకు చుట్టుకుని వున్నది; సరిగ్గా రమేశునికే నమస్కారం చేసి నుంచున్నదా అన్నట్టు వుంది! ఇక్కడినించి వచ్చిన కోపంలో వెనక రమ పినతల్లి అన్నమాటలు అతనికి జ్ఞాపకంలేవు. అందుకనే యకాయకీని అతను లోపలికి వచ్చి రమను ఆ స్థితిలో చూసి ఏమీ మాట్లాడలేకపోయాడు. ఇద్దరూ కలుసుకుని నెల అయింది.

తర్వాత కాసేపటికి రమేశుడన్నాడు:—"నువ్వు తప్పక అంతా విన్నావనుకుంటాను. నీళ్లు పోనివ్వటానికి అనుమతి తీసుకుందామని వచ్చాను."

రమకు విస్మయం తగ్గిపోయింది కొంగు తలమీదికి లాక్కుని—"నేనెలా వొప్పుకునేది? పెద్దబావ ఇష్టపడటం లేదు."

"ఆ సంగతి నాకూ తెలుసు. అతని ఒక్కడి ఇష్టంతో ఆగిపోదుగా!"

రమ కొంచెం ఆలోచించి "నీళ్లు పోనివ్వటం మంచిదే. కాని చేపలు పోనివ్వకుండా ఏమి చేయగలం?" అని అడిగింది.

"అంత నీరు వున్నప్పుడు మనమేమీ చేయలేము. ఈ సంవత్సరం మనం నష్టానికి వొప్పుకోవలసిందే. లేకపోతే ఆ గ్రామస్థులంతా నాశనమైపోతారు." రమ మాట్లాడలేదు. రమేశుడు మళ్ళీ అన్నాడు: "ఐతే ఒప్పుకున్నట్లేనా?"

"ఉహూఁ. అంత నష్టానికి నేను వొప్పుకోను" అన్నది రమ మెల్లగా.

రమేశుడు విస్మయంతో మాటాడలేకపోయాడు. ఇలాంటి జవాబు వస్తుందని అతను ఊహించనేలేదు. తనమాట రమ తోసివేయలేదని అతను గట్టిగా విశ్వసించాడు. రమ తల ఎత్తకుండానే రమేశుని స్థితి అంతా గ్రహించిందనుకుంటాను. "అదీకాక ఈ ఆస్తి నా తమ్ముడిని. నేను చేసేది పెత్తనమే" అన్నది.

"ఇందులో నీకూ సగంభాగం వున్నదిగా?"

"పేరుకే. ఈ ఆస్తి అంతా యతీనుకే చెందుతుందని నాన్నకు తెలుసు. అందుకనే సగం నాపేర రాసిపోయాడు."

(ఇంకా వుంది)



# ఖరీదు

తెళ్లపల్లి వెంకట లక్ష్మీనారాయణ శర్మ

ఒక వ్యక్తి స్వభావాన్ని చిటికెలో తెలుసుకోవాలంటే డబ్బుపట్ల ఆ వ్యక్తి యొక్క దృక్పథాన్ని బట్టి తెల్సుకోవచ్చునన్నది నాకున్న గట్టి విశ్వాసాల్లో వకటి. నా జీవితంలో తీసుకున్న నిర్ణయాలు చాలామటుకు యీ సిద్ధాంతం ద్వారా తీసుకున్నవే.

ఇప్పుడు మా మూడో అబ్బాయికి వివాహం చెయ్యాలని తలపెట్టాను. వాడు బొంబాయిలో వుంటున్నాడు. నెలకో వెయ్యి రూపాయలకు పైనే సంపాదిస్తున్నాడు. ఇది గొప్పల్చెప్పుకోవటానికి చెప్పిందికాదు. ఎందుకంటే యీ రోజుల్లో వెయ్యి రూపాయల జీతం పెద్ద జీతం అని నేననుకోను. వాడి వివాహ ప్రసక్తి వచ్చింది కాబట్టి యీ సంగతి చెప్పాను. మొదట్లో సంబంధాలు చూసేటప్పుడు యీ విషయం చెప్పేవాణ్ణి కాదు. "చెవులో

గేదెనుపెట్టి....'' అన్నట్టుగా వుండే వ్యవహారం అది యెగతాళి చేసేవాళ్ళు. ఆడపిల్లల తండ్రులు (ముఖ్యంగా తల్లులు) మొట్టమొదటగా నన్నడిగిన ప్రశ్న యిదేకావటంవల్ల తర్వాత్తర్వాత యెవ్వరూ అడక్కుండానే చెప్పటం అలవాటు చేసుకున్నాను. మా వాడు వుద్యోగంలో చేరి దాదాపు నాలుగేళ్ళవుతోంది. ఆ మధ్యనకూ 'నీకు సంబంధాలు చూస్తున్నాం'' అని వ్రాస్తే ''అలాంటి ప్రయత్నాలేం చెయ్యొద్ద'ని ఎక్స్‌ప్రెస్ డెలివరీ లెటరు వ్రాస్తూ వుండేవాడు. కానీ రెండు నెలల క్రితం అలాంటి వుత్తరం నేనొకటి వ్రాస్తే తాపీగా ఓ పదిరోజులకి 'మీ వుత్తరం అందింది'' అంటూ మాత్రమే వ్రాశాడు; వివరాల జోలికేం పోలేదు. వీడికో సంబంధం త్వరలోనే ఖాయం చేయాలన్న నిర్ణయానికొచ్చాను నేను జాప్యం చేస్తే బొంబాయిలో వాడేం తొందర పడ్డాడేమోనన్న అనుమానం వచ్చి వెంటనే సంబంధాలు చూడటం మొదలు పెట్టాను. వాడు తొందర పడటంలాంటి దేమన్నా జరిగితే యింకేమన్నా వుందీ!? నేనింకో ఆడపిల్ల పెళ్ళి చెయ్యాలి. ఎంతకాలం ''మావాడు చెల్లెలి పెళ్ళి అయ్యేంత వరకూ పెళ్ళి మానేస్తాడ''ని చెప్పుకుంటాం! వాడే అమెరికాలోనో వుంటే అది వేరే మాట; అప్పుడు చిక్కేలేదు!!

ఇప్పటికే నేను జాప్యం చేశానా అన్న అనుమానం వచ్చి ''నువ్వేం తొందర పడవద్ద''ని వ్రాయటం యెలానో తెలియక 'రెండు మూడు సంబంధాలు చూస్తున్నాను .... నువ్వొచ్చి పిల్లలను చూసేటందుకు గాని .... శెలవు సంపాదించే ప్రయత్నంలో వుండమ''ని వ్రాశాను. తన శెలవంతా యింకొక రెండు నెలల్లోపునే ఖర్చు చేసేసుకోవాలని జవాబొచ్చింది. సంబంధాలు చూడటం వెంటనే మొదలు పెట్టాను.

వివాహవిషయంలో—మగపిల్లవాడిది గానీండి ఆడపిల్లది గానీ, డీ—అవతలి వైపువాళ్ళ డబ్బు, హోదా చూడటం సామాన్యంగా జరుగుతున్న పని. నేను మాత్రం యిందుకు భిన్నంగా వెళుతున్నానని మా మిత్రులు నామీదో అపవాదు లేవదీశారు. ''వాడి ఖర్మ'' అనికూడా అన్నారు. మనుష్యులను అంచనా వెయ్యటానికి నేనుపయోగించే కొలమానం ప్రకారం నేనెన్నుకునే మనిషి బీదవాడూ, బికారి ఉద్యోగి అనే 'రూలు'' లేదు అలా అంటే యెవ్వరూ నవ్వుకోలేదు. ఈ విషయాన్నే మరోవిధంగా చెప్పాలనే ఉద్దేశ్యంతో ''నేను మనిషికి విలువకట్టే ప్రయత్నంలో ఉపయోగించే పద్ధతికి డబ్బు ప్రమేయం లేనేలేదు; మరి ఆ విధంగా యెన్నుకునే వ్యక్తుల ఆర్థిక పరిస్థితి గురించి మీ రెండు కొక నిర్ణయానికొస్తారో అర్థం కావటంలేదు' అని మొత్తుకునేవాణ్ణి.

లేదుట" అని వాళ్లల్లో వాళ్లనుకుని 'యిదేం మనిషి!!' అన్న భావం వ్యక్తం చేసే ఆశ్చర్యాన్ని ప్రకటించేవాళ్లు.

"అర్థంలేకుండా మాట్లాడేది నువ్వే" అన్న అర్థంలో నవ్వేవాళ్లు. మొత్తానికి నేను వుపయోగించే విధానంలో నమ్మకం వుండేది కాదెవ్వరికీ.

మా ఆవిడే అనేది — "ఇదిగో ... మీరు యెన్నిక చేసుకునే మనుష్యులు.... అదిగో...ఆ లక్షింపతిలాగానే వుంటారు" అని. మా ఆవిడకు చెయ్యి త్రిప్పుతూ మాట్లాట్టం అలవాటు. ఆ చెయ్యి కదలికకూ, మాటవరసకూ యేదో అవినాభావ సంబంధం వుంది.

"ఈ మనిషి చేతులు వెనక్కి కట్టేస్తే మాట్లాడగలుగుతుందా" అనిపిస్తుంది మా ఆవిడ మాట్లాడేటప్పుడల్లా! మాట్లాడేటప్పుడు చేసే చేతి కదలికలో ఒక క్రమం కనిపిస్తుంది. చేతివ్రేళ్లు అరచేయి పైకి కనుపించే విధంగా నేలకు అంటుకునో, లేదా నేలవైపు చూపిస్తూనో వుంటే "ఇదిగో" అంటుంది; చేయి నేలకు పైగా కుడివేపుకో, ఎడంవేపుకో వెడితే "అదిగో" అంటుంది. మా ఆవిడ యెదురుగా కూర్చుని కబుర్లు చెపుతుంటే "సోది అమ్మ" మనముందు కూర్చున్నట్టే వుంటుంది; పైగా తను చెప్పేదికూడా అదే!!

ఇంతకూ "లక్షింపతి" గా మారిన పతి ఆంధ్రదేశంలో ప్రొహిబిషన్ తీసివెయ్యకముందునుంచీ కూడా త్రాగుతూనే వున్నాడు. అతగాణ్ణందుకే పరువుతక్కువవాడన్నారు. మనిషిని అంచనా వెయ్యటానికి యీ కాలమానం వుపయోగించే వారి దృష్టిలో లక్ష్మీపతి చెడ్డవాడు కావచ్చు .... నేనూ ఒప్పుకుంటాను. నేను వుపయోగించే విధానాన్నే అందరూ వుపయోగించాలని నేను పట్టుబట్టను. కానీ మనిషి నిజస్వరూపం తెల్సుకోవటంలో మిగతా విధానాలకంటే నేను వుపయోగించేది వుత్తమమైనదనుకుంటాను; అది నా విశ్వాసం. ఇక లక్ష్మీపతి విషయంలో అతనికున్న త్రాగుడు అలవాటుని అతని బలహీనతగానే నేను తీసుకుంటాను. అతని ఆ అలవాటువల్ల యితరులకు హాని జరుగుతుందని నేననుకోను. ఈ అలవాటు వున్నందువల్లనే లక్ష్మీపతి వుత్తముడు కాడనీ, అది లేనందువల్ల మా ప్రక్కయింటిలో వుంటున్న శంకరశాస్త్రి వుత్తముడనీ నేననలేను. ఎవరన్నా అంటే వొప్పుకోనుకూడాను.

శంకరశాస్త్రి మడి, జపం వగైరాలతో నిష్టనియమాలు కల్గినవాడు. ఆఫీసులో "పైపాటు" పడుతూవుంటాడని అం రకూ తెల్సు. అందుకనే వున్నవూళ్లో వుండనీయకుండా అతగాణ్ణి వూళ్ళవెం ట్రాన్స్ఫర్లంటూ త్రిప్పుతున్నారన్న

సంగతి జగద్విదితం. ఇలాంటి శంకర శాస్త్రిని లక్ష్మీపతికంటె ఉన్నతస్థానంలో యేవిధంగా వుంచాలో నాకర్థంకాదు. అందుకే లక్ష్మీపతి యింటికే నేనెక్కువ రాకపోకలు చేస్తూవుంటాను: అతగాడినే మాయింటికి పిలుస్తూవుంటాను.

ఒకసారి మా వీధిలో వక సంఘటన జరిగింది. దానిని గురించి నేను తర్వాత విన్నాను. మా వీధిలోని అయిదా ళ్ళలో "రత్తాలు" పనిచేస్తూ వుంటుంది. 'రత్తాలు' పూర్తి పేరేమిటో నాకు తెలియదు. అసలు పేరు అదికాదని మాత్రం నేను చెప్పగలను. తన అసలు పేరేమిటో "రత్తాలు" కూడా బహుశః తెలియకపోవచ్చు. పేరు నిలదెట్టుకోవటాని కూడా అర్థికస్తోమత కావాలేమో! బాగా డబ్బుండే 'రత్నాదేవి' అని పిలుస్తారు. ఇక మధ్యతరగతికొస్తే వయస్సును బట్టి పేరులో కొన్ని చిన్నమార్పులొచ్చినా 'రత్తమ్మ' అన్నపేరు శాశ్వతంగా నిలిచి తీరుతుంది. పై తరగతిలో మాత్రం పేరు మీద వయస్సు ప్రభావం వుండదు. అలాగే క్రింది తరగతిలో కూడాను. 'రత్తాలు' అన్నపేరు పుట్టినదగ్గర్నుంచి చచ్చేంతవరకూ వుంటుంది. అర్థికస్తోమత వున్నవాళ్ళవి. పేరున్నవాళ్ళని అందుకే అంటారేమో ననిపిస్తుంది నాకు వాళ్ళ పేర్లు అలాగే వుండిపోతాయి మరి; వాటి నెవ్వరూ మార్చలేరు.

ఆరోజున రత్తాలు తన కూతుర్ని వీధి పంపుదగ్గిర దింపి యే యింట్లోనో పనిజేస్తోంది. ఇంతలో ఆవొకటి పరుగెత్తు కుంటూ వచ్చి పిల్ల పొట్టమీద త్రొక్కు కుంటూ పోయింది. అంతవరకూ 'చయ్. చయ్' అంటూ వీధి వాకిల్లగ్గిరవున్న శంకర శాస్త్రి యిది చూసి జపం చేసుకోవటానికి యింట్లో కెళ్ళిపోయాడు. దూరంగా సిగ రెట్టు కాల్చుకుంటూ కూర్చున్న లక్ష్మీపతి పరిగెత్తుకుంటూ వచ్చి, ఆ పిల్లని హాస్పి టల్కు వేసుకెళ్ళి పన్నెండింటిదాకా అక్కడే వుండి, ఖర్చులన్నీ తనే పెట్టు కుని యింటికి తిరిగొస్తూ దగ్గిరుంచుకో మని కొంత డబ్బు రత్తాలు భర్తకిచ్చి వచ్చాడు. రత్తాలు భర్త లక్ష్మీపతికి చెమ్మెత్తి దండం పెట్టివుండాలి. అత గాడు దేవుడే తిరుపతిలోనో వున్నా డంటే నమ్మనే నమ్మడు. ఆ సంగతే నేను వక సాయంకాలం శంకరశాస్త్రి యెక్కడో కలిస్తే అన్నాను—

"లక్ష్మీపతి నిజంగా దేవుడులాంటి వాడ"ని.

శంకరశాస్త్రి నవ్వాడు నాకు వంటి మీద పురుగులు ప్రాకినట్లనిపించింది. శంకరశాస్త్రి నవ్వుతూనే—

"మీ రమాయకులు మూర్తి గారూ! లక్ష్మీపతి సామాన్యుడా యేం?! ఊరికే యిచ్చాడనుకున్నారా?! 'లక్ష్మీపతి— రత్తాలు వ్యవహారం....'' అంటూ అర్థో క్తిలో ఆపి అర్ధనృత్తాకారంలో తల త్రిప్పుతూ కనుబొమలు పైకెగరవేశాడు.




"ఈ విషయం రత్తాయి భర్తకి తెలిస్తే ప్రాణాల్తీస్తాడు" అన్నాను.

"తియ్యడూ మరి! లక్ష్మీపతి ఆ జాగ్రత్త తీసుకుంటూనే వున్నాడు" అన్నాడు.

నాకు వళ్ళు మండిపోయింది.

"నేను చెప్పేది లక్ష్మీపతి గురించి కాదు; మీ గురించి. మీరిట్లా మాట్లాడుతున్నారని వీరయ్యకు తెలిస్తే మీ ప్రాణానికే మోసం" అన్నాను.

శంకరశాస్త్రి గతుక్కుమంటూ——

"ఆఁ .... మీరూ, నేనూ వాడగ్గిర అనొచ్చామా యేం' అన్నాడు. ఆ మాటలో "మీరీ సంగతి వాడితో చెపుతారా యేం కొంపదీసి" అన్న భయం వుంది. చెవిలోని పువ్వు సరిజేసుకుంటూ చకచక నడుచుకుంటూ వెళ్ళిపోయాడు శంకరశాస్త్రి.

ఆ పసిపిల్లనా పరిస్థితిలో చూసిన శంకరశాస్త్రి మనసెట్లా పనిచేసిందో నే నూహించగలను. "అయ్యో పాపం!" అని అనుకుని వుండదని నే ననను. నా దృష్టిలో శంకరశాస్త్రి రాక్షసుడు కాదు. ఆ పరిస్థితుల్లో అక్కడ వుండే హాస్పిటల్‌కు తీసుకుని వెళ్లాల్సి వస్తుందని తెల్సు. అందుకయ్యే ఖర్చు వీరయ్య తిరిగి యిచ్చుకునే స్థితిలో లేడు. మహా అయితే ఓ పదిదండాలు పెడతాడు. దండం ముడితే డబ్బు ముట్టినట్టు కాదు కదా? ఎందుకీ బాదరబందీ అని నూతి వేపు స్నానం చెయ్యటానికి వెళ్లి వుంటాడు. ఇక్కడే నేను లక్ష్మీపతిని.

శంకరశాస్త్రిని విభజించే గీత గీచాను. ఇది మనిషి మనుగడకీ, మానవత్వానికీ గీటురాయి. మానవత్వాన్ని మించిన విష్ఠలూ, నియమాలూ వున్నయ్యన్నది నా నమ్మకం కాదు.

ఇలాంటి విషయా లనేకం చూసిన తర్వాతే నా విధానాలపట్ల నాకు నమ్మకం యేర్పడింది. అవి నాలో బాగా పాతుకు పోయినయ్.

గుంటూర్లో ఓ రెండు సంబంధా లున్నయ్యని తెలిసి, విచారించి వద్దామని నేనే వెళ్లాను మరేదో పనిమీద గుంటూరు వెళ్ళి.

"ఇదిగో....మీ గీటురాళ్లూ, శంకర రాళ్లూ అంటూ యేదో బికారి సంబంధం తీసుకురాకండి. వాడి వుద్యోగం.... అదిగో....వాడి హోదాకి తగిన సంబంధం అయ్యేట్టుగా చూడండి" అంది మా ఆవిడ.

"నేను అనుసరించే విధానంలో డబ్బు ప్రసక్తే లేదు. మరి ఆ విధానం ప్రకారం యెన్నుకున్నవాళ్లు బికారులో, ధని కులో నువ్వెట్లా తేల్చగలవ్" అన్నాను.

"తేల్చేందుకేముంది!! ....డబ్బంటే (ఇదిగో) నిర్లక్ష్యంగా వుండేవాళ్ళందరూ మీకు మంచివాళ్లేగా!....(అదిగో)...." అంది.

"నా విధానంలో డబ్బుపట్ల నిర్లక్ష్యం అన్న ప్రసక్తే లేదు. జీవితంలో వాళ్ళ లక్ష్యమేమిటో అనేే నేను తెల్పుకునేది" అన్నాను.

"మీర్చెప్పేదేమిటో మీకే అర్థంగాదు; యింకా మిగతావాళ్ళకేం అర్థమవుతుంది!! ....(ఇదిగో) పిల్లమాత్రం చదువుకుని, (అదిగో) అందంగా వుండాలి" అన్నది.

తనకు తెలియని విషయం మరెవ్వరకూ తెలియదన్న భరోసా మా ఆవిడ కుంది. ఒకవేళ అలా తనకు తెలియని మరొకరికి తెలిసిన విషయం అంటూ వున్నా, అది తెలివైన విషయం కాదన్న నమ్మకం కూడా ఆవిడకుంది. తెలివి తక్కువ విషయాన్ని గురించి పట్టించు కోవాల్సిన అవసరం లేదన్నట్టుగా సంభాషణ మార్చివేస్తుంది. అది తెలివితక్కువ తనం అని సంపెట్టుకుంటూ వుంటాను. గత్యంతరం లేదు మరి; నూటికి తొంభై మంది ఆడవాళ్ళంతే.

గుంటూరు చేరుకున్నాను. నా బాల్య మిత్రుడు సుబ్రహ్మణ్యాన్ని తీసుకుని బ్రాడీపేట బయల్దేరాను. సుబ్రహ్మణ్యం దారిలో వివరాలన్నీ చెప్పాడు. పిల్లకు తండ్రి లేదు. ఇక్కడ తల్లి అజమాయిషీ లోనే వుంటోంది. ఇద్దరో ముగ్గురో అన్నగార్లున్నారట; అందులో వకా యన పెంపకాని కెళ్ళాట్ట. ఆ తర్వా తేమేమిటో చెబుతూనేవున్నాడు గానీ నేను వినలేదు. ఒక గమ్యాన్ని చేరుకోటానికి అనేక త్రోవలగుండా వెళ్ళగలిగినట్లే, ఒక విష యాన్ని తెల్పుకునేందుకు అనేక పద్ధతు లుపయోగించవచ్చు. స్థూలంగా నేను

తెల్సుకోదలచింది యిది — నేను వెళ్ళి చూడబోయే వ్యక్తులు మనిషిగా బ్రతకటం పట్ల యెంత విలువనిస్తారు? డబ్బు విషయం వచ్చేసరికి యీ విలువల విలువ యెంత వుంటుంది? ఒకరికి మనిషిగా నేనిచ్చే విలువ వారిలోని మానవత్వం, మానవ సహజమైన ప్రేమానురాగాలమీద ఆధారపడి వుంటుంది. ఈ సంగతి యెలా తెల్సుకోవటమా అని ఆలోచిస్తున్న నాకు ఆ కుటుంబంలో దత్తుకెళ్ళిన కుర్రాడున్నాడనేసరికి నా విధానాలు వీళ్ళ విషయంలో సక్రమమైన ఫలితాలిస్తాయనే అనిపించింది. సుబ్రహ్మణ్యాన్ని ప్రక్కనేవున్న హోటల్లోకి తీసుకువెళ్ళి వివరాలన్నీ సేకరించాను. దత్తతకు వెళ్ళిన యీ కుర్రాడి తండ్రి బ్రతికివున్న రోజుల్లో యితగాణ్ణి పెంపకానికి పంపేందుకు చాలా ప్రయాసపడ్డాడుట. ఇతగాడి జాతకంలో యేవేవో మార్పులుచేసి. కుదురు మారితే గానీ యితగాడి ఆయుష్షు పెరగదని నలుగురికీ చెప్పి కుర్రవాడిని పెంపకానికి పంపించాట్ట. పెంపకం పుణ్యమా అని అతగాడూ బాగుపడ్డాడు; ఇటు వీళ్ళూ కొంచెం బాగుపడ్డారు.

ఈ వివరాలు విన్నతర్వాత నేనుద్దేశించిన పంధాలో వెళ్ళటంవల్ల సరయిన ఫలితాలొస్తాయనే నమ్మకం కుదిరింది.

వారింటికి చేరుకున్నాం. అవీ యివీ మాట్లాడాక పిల్ల తల్లి అన్నది—'ఎంతలో వున్నారు మీరు?' అని.

బహుశః కట్నంగురించి అయుంటుందనుకున్నాను. ఇక్కడొక విషయం తమతో చెప్పుకోవాలి. నేను కట్నం గురించి యీ మధ్యవర్తితో చెప్పలేదు. అలాగని అక్కర్లేదని చెప్పానని బడాయి చెప్పుకోను మీతో. దాన్నిగురించి చెప్పాల్సిన అవసరమేమీ కనిపించక నేనే మీ యీ మధ్యవర్తితో చెప్పలేదు కానీ ఆవిడ తనంత తానే యీ ప్రసంగం తెచ్చేసరికి యీ విషయంలో నా వుద్దేశ్యాలేమిటో చెప్పకుండా యీ విషయాన్నికూడా నేననుసరించే విధానంలో ఒక భాగంగా వుపయోగించుకోవాలని—

'ఎంతలో వున్నారు మీరు?' అన్నాను.

'పిల్లవాడిని బట్టివుంటుంది. వెనకాల ఆస్తి సంపాదన....' అంటూ మొదలెట్టిందావిడ.

ఏదో సంతలోకి అడుగుపెట్టానా అనిపించింది. ఆవిడ మాటల్లో వ్యాపార సరళి బాగా కనిపించింది. అందుకామెను తప్పుపట్టటం లేదు. ఇప్పటి పరిస్థితులలా వున్నాయ్ మరి కానీ యీ 'రేటు' నిర్ణయించుకోవటానికి ఆవిడ తన లెక్కల్లోకి తీసుకునే వివరాలు నాకు నచ్చలేదు. ఇవన్నీ చెప్పాక ఆవిడ—

'అన్నట్టు —పిల్లవాడు వెయ్యిపైనే సంపాదిస్తున్నాడని విన్నాం. అయిదారేళ్ళనుంచీ వుద్యోగంలో వున్నట్టున్నాడు ....బ్యాంకులో యెంత నిల్వవుంది' మనిషికి మూలధనం ముఖ్యం. చిన్న

యెకౌంటులో యెంతుంది? పెద్ద యెకౌంటులో యెంతుంది? ఆ యెకౌంట్ల పేర్లేవో నాకు తెలివ్వావ్వ....మా అమ్మాయికి తెలుసు....దానికన్నీ తెల్సు' అంది.

నిరక్షరకుక్షులైన తల్లులు పిల్లల్ని తమతో పోల్చుకుని 'వాళ్ళకన్నీ తెల్సు' అంటూవుంటారు. దాంతో పిల్లలు కూప స్థమండూకం మాదిరి తయారవుతారు.

తల్లి ఆ మాటలన్నప్పుడు ఆ అమ్మాయి తలుపు వెనకాల్నుంచి "సేవింగ్స్ డిపాజిట్, ఫిక్సెడ్ డిపాజిట్" అని అందించింది. ఈ పిల్ల తలుపు వెనకాలనుంచి యింతవరకూ రెండు మూడు తడవలు యిలాంటి సహాయాలే తల్లికి చేసింది. తల్లికిచేసిన సహాయం మాటెలావున్నా నాకుమాత్రం ఆ పిల్ల బాగా సహాయపడింది. ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున మేసేందు కవ కాశం వుందన్న భ్రమ నా కప్పు డప్పుడు కలుగుతూవుంటుంది. ఈ భ్రమ కలిగించిన 'దూడలు' కొన్ని నాకు కటస్థపడ్డయ్ కూడాను. కానీ వాళ్ళం దరూ యీ సిద్ధాంతానికి అతీతంగా వుంటే చెదురు మదురు వ్యక్తులని అని పించింది.

ఆవిడ వేసిన ఈ ప్రశ్నలలో నేనింక లేచి వెళ్ళిపోవచ్చు. అంటే పిల్లలా బ్యాంకు యెకౌంటుగురించి అడిగారని గాదు. మనుష్యులను కొలవటానికి నాకు కొన్నిపద్ధతులున్నట్టే వాళ్ళకీ వున్నయ్. అందుకు నేను ఫిర్యాదు చెయ్యను. నా పద్ధతే అందరూ అనుసరించాలని సిద్ధాంతీకరించటం కూడా నా పద్ధతికాదు. కానీ మారెండు పద్ధతులూ పరస్పరవిరుద్ధమైనవి. వాటికి పొత్తు కుదరదు. అందుకనే నేనెప్పుడో నీ కాళ్ళకొక నమస్కారంపెట్టి లేచి వెళ్ళిపోవచ్చును. నమస్కారం వంటగ కూడాలేకుండా యీ యింటికి రాకుండానే వెళ్ళిపోవచ్చును. కానీ నేను యిలా రావటానికి కారణం సంబంధం చూడా లని మాత్రమేకాదు. నేను అమలు పరిచే విధానం యెలాంటి ఫలితాల్ని స్తుందో తెల్సుకోవాలని. దాన్ని ఆచర ణలో పెట్టటంలో అనుభవం సంపా దిద్దామన్న కోరికతోకూడా వచ్చాను. పరోక్షంగా వాళ్ళ వివరాలు విన్న నాకు నాపద్ధతి ప్రకారం వాళ్ళంటే వక అభి ప్రాయం కలిగింది. ఆ అభిప్రాయం సరియైనదోకాదో ప్రత్యక్షంగా తెలుసు కుందామనే యింతసేపు కూర్చున్నాను. ఈమాత్రం దానికి వాళ్ళని యిబ్బంది పెట్టటంయెందుకని మీలో కొందరడ గొచ్చు. మీ అభిప్రాయాన్ని త్రోసి పారెయ్యను. కానీ ఒక విషయం మనని చేసుకోవాలి. కొందరు కాబోయే పెండ్లికొడుకులు "ఆ....ఏంబోయింది? పిల్లని చూసిపోదాం....వాళ్లుపెట్టేది మేసి పోదాం" అన్న దృష్టిలో సంబంధాలు




చూస్తుంటే నేను పరిశోధకుడికి వుండే తృష్ణతో చూడటంలో తప్పులేదనే భావన నాకుంది. పరిశోధకులు తక్కువ సాక్ష్యంకంటే యెక్కువ సాక్ష్యం విలువైనదన్న వుద్దేశ్యంతో పరిశోధనలు అత్యధికంగా చేస్తూవుంటారు. ఆ వుద్దేశ్యంతోనే యీ యింటికొచ్చాను. వచ్చి లేచిపోకుండా యిప్పుడీ క్రింద చెప్పే ప్రశ్న వెయ్యటంలో కొంచెం స్వార్థం కూడా వుంది. ఆ సంగతి నా ప్రశ్న గురించి చెప్పాక చెప్పుతాను.

తలుపు చాటునవున్న పిల్లి బ్యాంకులో వేయ గల్గిన డిపాజిట్లను గురించి చెప్పాక నా మెదడు చురుకుగా పని చెయ్యటం మొదలు పెట్టింది. సుబ్రహ్మణ్యం "వెళదామా" అన్నట్లు నా ముఖంలోకి చూశాడు. నేను లేద్దామన్న ఆసక్తి కనపర్చక పోవటంతో ఆశ్చర్యంగా నా వంక చూశాడు. సుబ్రహ్మణ్యం ముఖంలోని విసుగు కనిపెట్టిన ఆవిడ—

"మరోలా అనుకోకండి.... తెల్సుకోవాలి గదా" అంది.

"అవునండి అక్కగారూ! తప్పకుండా తెల్సుకోవాల్సిందే. కానీ మా అబ్బాయిని "నీకు బాంకులో యెంతున్న" దని యింతవరకూ నే నెప్పుడూ అడగలేదు. రేపు ఒకవేళ నే నడిగినా ఆ డబ్బులో నాకేమన్నా యివ్వాల్సొస్తుందని సరయిన సమాధానం చెప్పుతాడో లేదో! ఈరోజుల్లో కుర్రకారింతేగదండీ; వాళ్ళ సరదాలు వాళ్ళవేగానీ పెద్దవాళ్ళ బాధలు. వాళ్ళపట్ల తమ బాధ్యతలు తెలియవ్

వాళ్ళకి .... అయినా ఉత్తరం వ్రాసి ప్రయత్నిస్తాను" అన్నాను నవ్వుతూ.

ఇందులో నా స్వార్థం లేకపోలేదు. ఆవిడ పెంపకానికి పంపిన కుర్రవాడి డబ్బే అందుకుని యేదో యిల్లు కట్టుకుని కాలక్షేపం చేస్తోందికదా .... అలాంటిది యింతవరకూ నేను చదువు చెప్పిన మా అబ్బాయి నాకు సహాయంగా వుండటం పట్ల ఆవిడ ఉద్దేశ్యం యేమిటో తెల్సు కుందామనే యీ విధంగా అన్నాను. సమాధానం నేనాశించినట్లే వచ్చింది.

"అబ్బే...మీరాశ్రమ తీసుకోకండి.... ఉత్తరం వ్రాయకండి .... ఏదో యథా లాపంగా అన్నాను" అంది.

ఇందులో నాకు శ్రమ తప్పిద్దామన్న కోరికకంటె నాకు మావాడి బ్యాంకెకౌం టెంతో తెల్సిపోతుందన్న ఆదుర్దా, భయం నాకు కనిపించినవి. పైగా నాకింతవరకూ దాన్సంగతి తెలియదని వొప్పుకొంటివి ఇంతవరకూ దాన్సంగతి తెలియని నాకు యిప్పుడు నాకు తెలిసేట్లు చెయ్యటం యెందుకా అని ఆవిడ మధన పడింది; తెలిసేట్టు చేసినట్టున్నానే అని బాధపడింది.

ఆవిడ బాధ చూస్తుంటే నాకో అను మానం వచ్చింది. వాళ్ళింట్లోంచొచ్చు పెంపకాని కెళ్లాడని గుర్తుకొచ్చి నా అను మానం అధికం కాసాగింది. నా అను మానానికి ఆధారాలున్నయ్యో లేవో నాకు తెలియదు. ఆ వాతావరణం చూశాక మాత్రం నా అనుమానం కొట్టి పార వెయ్యటానికి వీలులేనిది అనిపించింది. ఆ యింట్లో ప్రతిచర్యనూ "డబ్బు మూరక పట్టి" అన్న అదృశ్యశక్తి నడిపిస్తున్నట్టు నాకు రూఢి అయ్యింది. ప్రతి పనికీ యెంత డబ్బు వస్తుందో తెల్సుకుగానీ చెయ్యరనిపించింది. ఎక్కౌంటుల పుస్తకంలో చివర్న వేసేను "టేబుల్సు" వున్నట్టు యిలాంటి పట్టీ యేదో వాళ్ళింట్లో వున్నట్టు తోచింది. ఇంతకీ నా అనుమానం యిది: తల్లి తండ్రుల కుండాల్సిన సహజ ప్రేమాను రాగాల్ని వదిలేసుకుని, కొడుకుని యెక్కడో పెంపకానికిచ్చి తమ అంతస్తు పెంచుకున్నవాళ్ళు. రేపొద్దున కూతు ర్నేత మావాడితో పెళ్ళిలాడించి, విడాకు లిప్పించుకుని దాంతోబాటు వచ్చే "మనో వర్తి"తో తల్లీకూతుళ్ళు తింటారా అన్నది నా అనుమానం. నేను మరీ అన్యాయంగా మాట్లాడుతున్నానని మీ కనుమానం రావచ్చు. మీరు కేకలు వెయ్యవచ్చును కూడాను. దానికి కారణం నేను కళ్లారా చూసిన పరిస్థితులు మీరు చూళ్ళేదు; అంతే. పైగా తల్లీ—బిడ్డల అనుబంధం అన్ని బంధాలకన్నా అతీతమైనదని నా విశ్వాసం. దానినే తాకట్టు పెట్టగల్గిన వారికి భార్యాభర్తల సంబంధం వక లెక్కలోనిది కాదు.

"శుభం పలకరా పెళ్ళికొడకా ..." అంటే యేదో అన్నట్లుందని కూడా మీరు

నా మీద అభాండం వెయ్యవచ్చు. కానీ ఆమాటలన్నవాళ్లే "పెళ్ళి నూరేళ్ళపంట" అనికూడా అన్నారు అది మీరు మరచి పోయినా పిల్లవాడి తండ్రిగా నేను మాత్రం మరచిపోలేను. అందుకే లేచి బయటకు నడిచాను.

బయట కొచ్చాక సుబ్రహ్మణ్యంతో నా వుద్దేశ్యాలన్నీ చెప్పాను. అంతా విని సుబ్రహ్మణ్యం అన్నాడు.

"ఈ సంబంధానికి యిష్టపడక పోవటంలో అర్థంవుంది. ఈసంబంధాన్ని మీవాడికి తగినదని అనుకోవటం నా బుద్ధి తక్కువ....కానీ యీ సంబంధాన్ని వ్యతిరేకించటానికి నువ్వు యిచ్చే కారణాలు సబబు గాలేవేమో....నీ దృష్టిలో పెంపకాని కెళ్ళేవాళ్ళందరూ డబ్బుమీద వ్యామోహంతోనే వెడుతున్నారనేనా ?! ఒక వంశాన్ని నిలిపేందుకు వెడుతున్నా రని యెందుకనుకోవు?" అన్నాడు.

"ఎందు కనుకోను?! లక్షణంగా అనుకుంటాను. కానీ నీమాదిరి "అలా చేస వుంటారని యెందుకనుకోగూడదు" అని అనుకుని వాళ్ళని మెచ్చుకోను నాకు విదర్శనం కావాలి. అదిగో.... దూరంగా చెట్టుక్రింద గుడ్డపరుచుకుని పడుకుంటే ఒక ముసలమ్మ....ఆమె కెవ్వరూలేరు. వంశం నిలవటం మాట దేవుడెరుగు! రేపద్దాకా ప్రాణం నిలుస్తుందో లేదో నమ్మకంలేదు. ఈ పెంపకాలకు వెళ్ళేవాళ్ళలో యేవక్క రయినా ఆమెకు పెంపకానికి వెళ్ళేందుకు యిష్టపడితే యీవిషయంలో నా వుద్దేశ్యాలన్నీ మార్చుకుంటాను" అన్నాను.

ఈ సంబంధం సుబ్రహ్మణ్యానికెందుకు యిష్టంలేదో తెల్సుకుందామని అడిగాను.

"అది పిల్లవాళ్ల మగపిల్లవాడి డబ్బు గురించలా తెగబడి అడక్కూడదు" అన్నాడు సుబ్రహ్మణ్యం వాళ్లేదో ఘోరమైన అపచారం చేసినట్లు.

"మగపిల్లవాడి తరఫువాళ్ళదగ్గాలేంది వాళ్లెందుకడక్కూడదు? నీ నిర్ణయం వొప్పుకున్నాను కానీ ఆ నిర్ణయం తీసుకునేందుకు నువ్వుచెప్పే కారణం నాకు నచ్చలేదు" అన్నాను.

సుబ్రహ్మణ్యం యీ విషయం మాట చాలాసేపు మాట్లాడి యిన్నింకా పూదర కొట్టనులే అన్నట్టు—

"మనం యిప్పుడు కలుసుకో బోయేవాళ్లు పరవాలేదు" అన్నాడు.

పరవాలేదని చెప్పబడినాయన పేరు సీతారామయ్యగారు. మనిషిని చూసి మంచివాడని చెప్పలేం. కారణం ఆయనకు అనేకవిషయాల్లో కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నట్లున్నాయ్. అలాంటి వాళ్లు సామాన్యంగా కర్కోటకులుగా కనిపిస్తారు. వాళ్ళు నమ్మిన విషయాల్లో ఎదటివారి విభిన్నదృక్పధంతో వారు సామాన్యంగా వొప్పుకోరు. చూడటానికి యింతకుముందు పెళ్ళినయింట్లోని

మనుష్యులూ. యిక్కడి మనుష్యులూ ఒకమాదిరే వున్నారు. అందుకే నేననుకుంటాను సినిమాలలో మాదిరి మనుష్యుల ప్రవృత్తిని తెలియజేస్తూ ఆకారాలు, గదిలో అలంకారాలూ వుంటే బాగుండునని: విలన్ యింట్లో పులితల, పాలెగూళ్ళు వగైరాలూ, హీరో యింట్లో బుద్ధనిబొమ్మ వున్నట్లు నిత్యం మనం చూసే మనుష్యులుకూడా అలాంటివి అమర్చుకుంటే బాగుండును. కానీ సినిమా విలన్ హీరో అంత మంచి కాదట్టే హీరో బుద్ధునిబొమ్మ టేబిల్‌మీద పెట్టుకుంటే, తను పులిబొమ్మ వుంచు కుంటాడు. కానీ నిత్యం మనకు కని పించే 'విలన్లు' సినిమా విలన్ కంటే క్రూరులు కాబట్టి వీళ్లకూడా బుద్ధుని బొమ్మే పెట్టుకుంటారు. ఏమైనా సీతా రామయ్యగారింట్లో వాళ్ళనిగురించి మనకు చూడగానే తెలిసేటట్లు యేమీ అమర్చుకో లేదు. పైగా యింట్లో కొన్ని చోట్ల పాలెగూళ్ళు కనిపించినయ్.

సీతారామయ్యగారు చూపించిన కుర్చీలో కూర్చుంటుండగా 'సీను....' అంటూ పరిచయం చెయ్యబోయాడు సుబ్రహ్మణ్యం. వాణ్ణి మాట్లాడనీయ కుండా—

"మాది వరంగల్లు....నాపేరు రాఘవ రావు. అయినా నేనొచ్చిన పనికి నా పేర్తో పనిలేదు. మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడటానికొచ్చాం. మీరు మామీద దయవుంచి 'ఊ' అంటే ఒక వంశాన్ని నిలబెట్టారు" అన్నాను.

సుబ్రహ్మణ్యం ముఖంలో ప్రశ్నార్థ కాలు సీరియల్‌గా యింగ్లీషు సినిమాలో టైటిల్సు వచ్చినంత వేగంగానూ వచ్చే స్తున్నయ్ (అదేం ఖర్మో! నేనింగ్లీషు సినిమాల్లో వచ్చే టైటిల్సు ఒక్కసారీ పూర్తిగా చదవలేదు. ఒకటి చదవటం అవ్వకముందే మరోటొచ్చేసేది.)

సీతారామయ్యగారు ఆశ్చర్యంగా నా వంక చూసి—

"మీరేం అంటున్నారో నాకు బోధ పడటం లేదు ... నేను బడిపంతుల్ని; ఒక వ్యక్తిని నిలబెట్టే శక్తికూడా నా కుందని అనుకోను. మీరు వంశాన్నే నిలబెట్టమంటున్నారు. కొంచెం వివరంగా చెప్పండి" అన్నారు.

"అయ్యా! మా దగ్గిర చుట్టం ఒకాయ మన్నాడు. బోల్డు ఆస్తి; పిల్లల్లేరు. వాడికి మీ రెండో అబ్బాయిని పెంచుకోవాలన్న కోరిక కలిగింది. తమరు 'ఊఁ' అంటే..." అని చెపుతూవుండగా ఆయన 'ఆపండి' అన్నట్టు మెల్లగా చెయ్యి ఊపాడు.

మాకు దగ్గిరలోనే నేలమీద కూర్చుని పదేళ్ళ కుర్రవాడొకడు వ్రాసుకుంటు న్నాడు. సీతారామయ్యగారేం మాట్లాడ లేదు... కొంచెంసేపాగి ఆయన—

"నాన్నా" అంటూ క్రింద కూర్చున్న అబ్బాయిని పిల్చాడు. కుర్రాడు తండ్రి




దగ్గరగా వచ్చాడు. వాడి భుజంమీద చేయి వేస్తూ—

"నాన్నా!....నువ్వు లోపలికి వెళ్ళు" అన్నాడు. వాడు వెళ్ళబోతూ వుండగా మళ్ళీ చెయ్యిపట్టుకుని ఆపాడు. పిల్లవాడి చెయ్యి పట్టుకుంటూండగా సీతారామయ్య గారి చెయ్యివంక చూశాను చెయ్యి కొంచెం వణుకుతున్నట్లుంది. పిల్లవాడి చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. ఆ పట్టులో పిల్లవాడు అధికారి కాబోతున్నాడన్న ఆనందం నాకు కనిపించింది.

"అక్కని కాఫీ తీసుకుని రమ్మన్నానని చెప్పు" అన్నాడు సీతారామయ్య గారు.

పిల్లవాడు లోపలికి వెళ్ళాడు. సీతారామయ్యగారు దారిలోకొస్తున్నట్టు నాకు తెలుస్తూనే వుంది. ఈయనను త్వరగా వదలించుకోవా లనుకున్నాను.

సీతారామయ్యగారేం మాట్లాడలేదు. ఇరవయ్యేళ్ళమ్మాయి కాఫీ కప్పులు పట్టుకుని గదిలోకొచ్చింది.

"పిల్ల బాగుంది....ఈ యింట్లో గాక మరొకచోట తారసిల్లితే బాగుండేది" అనుకున్నాను.

"మీ అమ్మాయేనా?" అన్నాను.

నా వంక విశితంగా చూస్తూ "కాఫీ పుచ్చుకోండి" అన్నాడు సీతారామయ్య గారు.

కాఫీ త్రాగాక సంభాషణ కొనసాగించాలనే ఉద్దేశ్యంతో—

"తమరి అభిప్రాయం...." అంటూ సాగదీశాను.

"తమరిని మా యింటి కెవ్వరు పంపారో నాకు తెలియదు. నా గురించి

సుబ్రహ్మణ్యంగారికి బాగా తెలుసు.... వారి పని చేసివుంటారని నేననుకోను ఇక పోతే మీరు నాకు అపరిచితులు. మీతో అధిక ప్రసంగం చేయటం నా కిష్టంలేదు. నేను శలవు తీసుకుంటాను .. బజార్లో కొంచెం పనుంది' అన్నాడు సీతా రామయ్యగారు కుర్చీలోంచి లేస్తూ.

నేను సీతారామయ్యగారివంక నవ్వుతూ చూశాను

"బుద్ధి లేకపోతే సరి...." అంటూ సుబ్రహ్మణ్యం సణుక్కుంటున్నాడు.

"బావగారూ! మీరు నన్ను క్షమిం చాలి. వెఱ్ఱి అబద్ధాలాడి ఒక పెళ్ళి చెయ్యాలనుకున్నారు. ఎవరిన్నారో యెవ్వరికీ తెలియదు గానీ యిప్పుడందరూ చేసేపని అదే. పిల్లవాడు బి.కాం. చదువుతుంటే ఎం.కాం. అని అబద్ధాలాడేవాళ్ళున్నారు. పిల్ల వయస్సు పాతికయితే "అబ్బే ... మీ రొచ్చేముందే ఇరవై వెళ్ళింది" అనేవాళ్ళున్నారు; అవతల పిల్లవాడికి యిరవైనాలుగని తెలిసినా యీమాట అనటానికి వెనకాడనివాళ్ళున్నారు. నేనా పనేం చెయ్యలేను. నే నొచ్చిన పని విష యంలో అబద్ధం చెప్పాను. నే నొచ్చిన అబద్ధపు పనికి మీ రంగీకరించలేదు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. ఇక నేను నిజంగా యిక్కడ కొచ్చినపని యేమిటంటే మీ అమ్మాయిని మా యింటి కోడలుగా చేసుకునేందుకు. నాపేరు రామ మూర్తి. నా గురించి మా సుబ్రహ్మణ్యం మీకు చెప్పేవుంటాడు. నే నొచ్చిన యీ విషయంలో మీ రంగీకరించకపోతే నేను బాధపడతాను."

"ఖర్చు చేసేందుకు డబ్బు కావాలి. అయినా మనిషికున్న మరి కొంత 'ఆస్తి'ని ఖర్చు చేసుకుంటే గానీ డబ్బు రాదు. శారీరక మానసిక శక్తులను ఖర్చు పెట్టుకుంటూ వ్యక్తిత్వాన్ని, మానవత్వాన్ని నిలపజేసుకుంటూ డబ్బు సంపాదించేవా రున్నారు. వాళ్ళు ఉత్తములు శారీరక మానసిక శక్తులతోబాటు వ్యక్తిత్వాన్ని, పరువునూ ఖర్చుచేసి డబ్బు సంపాదించే వాళ్ళున్నారు. వాళ్ళు ప్రస్తుతపు పరి స్థితుల్లో మధ్యములుగా చలామణీ అవు తున్నారు. సహజమైన ప్రేమానురాగాల్ని, మానవత్వాన్ని ఖర్చుచేసి డబ్బు గడించే వాళ్ళున్నారు. వీరు నీచులు.

"డబ్బుకూడా ఖరీదుంది. చేర్చిన డబ్బునిబట్టి గాక దానికి చెల్లించిన ఖరీదుని బట్టి మనిషికి విలువగట్టటం నా కలవాటు. మీకో అమ్మాయి వుందని మా సుబ్ర హ్మణ్యం చెప్పాడు. మా సంగతులూ మీకు చెప్పేవుంటాడు. అందుకే వచ్చాను. మీరు "ఊఁ" అంటే ఆనందంగా వెడ తాను" అన్నాను.

సీతారామయ్యగారు నిండుగా నవ్వారు. నేనూ మనసారా నవ్వాను. మా సుబ్రహ్మణ్యం కూడా నవ్వుతూ "మా వాడికి వేపకాయంత వెర్రి వుందిలెండి" అన్నాడు.

---

"ఐ యామ్ డెడ్,"

నేను చనిపోయాను. అనుమానం లేదు. నిజంగా చచ్చిపోయాను. చచ్చిపోయినందుకు నాకేం విచారం లేదు. ఎందుకంటే రెండేళ్ళుగా నేను చచ్చిపోవాలని కోరుకుంటున్నాను. ఆ కోర్కె నాలో వేయి తలలు వేసింది. మృత్యువు నాకోసం రాలేదు. నేనే, నేనుగా మృత్యువును ఆహ్వానించాను.

తనను ఆహ్వానించినవారంటే మృత్యువుకు ఎంతో యిష్టం. మనంగా ఆహ్వానించనపుడు అది మనల్ని భయపెట్టదు. బాధ పెట్టదు. నేను రోగంతో చచ్చిపోలేదు. ఆత్మహత్య చేసుకోలేదు. యోగులవలె ఆత్మను సాధన చేశాను. జలసమ్మరణం నా కిష్టంలేదు. యోగులు, సిద్ధులు తాను మానవజన్మ ఎత్తినందుకు లక్ష్యం నెరవేరగానే తనువు చాలిస్తారట. తాముగానే మృత్యువును ఆహ్వానిస్తారు. నేను అదే ప్రయత్నించాను.

నా పిలుపు విని మృత్యువు వచ్చింది. అదే నాకు తృప్తి. మృత్యువు నాకు భయంకరంగా అగుపించలేదు అదొక భయంకర రూపం కాదు. అసలు దానికి రూపమే లేదు. కనుక భయపడవలసిన అవసరం కలగలేదు.

ఒక్కసారిగా శరీరం నా స్వాధీనం తప్పింది. అంటే పంచేంద్రియాలు పని చేయడం ఆగిపోయాయి. ఒకవిధమైన మత్తు, మగత నన్ను క్రమ్మింది నా




శరీరం ఘనీభవించిందా? ఏమో! చలనం లేదు. అలాంటిదేదో జరిగింది. ఏదో జరుగుతున్నదని నాకు తెలుస్తూనే ఉంది. ఆ జరిగేదానిపై నా శక్తి లేదు. నా ప్రమేయం లేదు.

విశ్చేతన స్థితిలో ఆత్మకు చైతన్యం కలిగింది. నా శరీరంనుండి మరొక శరీరం విడుతోంది. ఈ భౌతిక శరీరంలో మరొక శరీరం ఇమిడివున్నట్లు నాకు తెలియదు. ఇందులో లీనమైపోయివున్న మరొక దివ్యశరీరం అది. ఈ శరీరం నుండి విడిపోవడానికి అది పడ్డ శ్రమ ఇంతా, అంతా కాదు. అట్లా వేరై, నెమ్మదిగా పైకి లేచింది. రెండు పిలువుల ఎత్తుకు పోయి విటారుగా నిలబడ్డది. క్రింద చైతన్యరహితంగా, మరణస్థితిలో ఉన్న శరీరాన్ని చూచింది. నీకూ నాకూ ఋణం తీరింది అన్నట్లు. అంటే మరణం తర్వాతకూడా నన్ను నేను గుర్తించి. తెలుసుకోగల నన్నమాట.

అది నా సూక్ష్మ శరీరం. ఎంత తేలికగా వుంది! సూక్ష్మమే గావి, అది పరిమాణంలో స్థూల శరీరంకన్న పెద్దది. అది వెలుగుముద్ద రంగులో ఉంది. ఆ రంగును ఎన్నడూ చూడలేదు. క్రమంగా నాలో పరిసరాల జ్ఞానం పలచబడుతోంది. ఇల్లు, బంధువులు, మిత్రులు....అన్నీ, అందరూ మరుగవుతున్నారు. ఎవరూ కపిసించడంలేదు. ఎవర్ని గురించిన జ్ఞాపకాలు నాలో మిగలలేదు.

ఒక్కసారిగా దివ్యమైన నా సూక్ష్మ శరీరం విశ్వరూపం దాల్చినట్లు, భూమి నుండి ఆకాశం అంత ఎత్తుకు పెరిగింది. నేనే విశ్వం అంతా ఆక్రమించాను. మరు క్షణంలో అది చిన్నదై, అతిచిన్నదై అణువురూపం దాల్చింది. అది ఒక చిన్న వెలుగు శకలం....తిరిగి నా రూపంలో నా ప్రయాణం మొదలైంది.

గాఢాంధకారం....నా చుట్టూ తిమిరా వళి. విశ్వమే చీకటిమయం అపిపించింది. రాకెట్‌ను మించిన వేగంలో నా ప్రయాణం. చీకటిలో నేనొక వెలుగుదీపాన్ని. నాచుట్టూ ఉన్న చీకట్లు విచ్చుకున్నాయి. క్రమంగా ఒక మందమైన వెలుతురు. అది ఉషోదయ వెలుతురులాంటిది. నా చుట్టూ తారకలు .... వియన్మండలంలో ప్రయాణం. నేను ఎక్కడనుండి బయలు దేరానో, ఎక్కడకు వెడుతున్నానో తెలీదు. వేల, లక్షల నక్షత్రాల మధ్యగా నా ప్రయాణం సాగుతోంది. కళ్ల నులుపు కుని చూద్దామంటే చేయి కదలదు. నాకు చేతులున్నాయా....శరీరంలో అవయవాలు ఉన్న జ్ఞానంవుంది గావి. అవి స్వాధీనంలో లేవు. ప్రపంచం ఏమైంది నాతో పాటే మాయమైందా! మాయ!!

ఒక అద్భుతమైన కాంతిలోకం చేరు కున్నాను. అది కాంతి కాదేమో! వెలుగు. అతి మందంగా, మెత్తగావున్న వెలుగు. అక్కడ సూర్యుడు లేడు, చంద్రుడు లేడు. కానీ, వెలుగును, వెన్నెలను మించిన స్వచ్ఛమైన వెలుతురు అది. వియోన్‌లైట్ల మత్తువెలుగు. లేత ఆకు పచ్చ, పీలం, పసుపు పచ్చ, పాలల్లో రంగరించినప్పటి కాంతిప్రవాహం అది.

శరీరాన్ని మత్తెక్కించే పరిమళం

వీస్తోంది. సలలిత సంగీతంవంటి మలయ పవనాలు వీస్తున్నాయి. అదేదో లోకపు పొలిమేరలు కావచ్చు. క్రింద నేలవంటి గట్టి ఆధారం లేకపోయినా నిలబడ్డాను.

మల్లెపువ్వులు పిరబూసిన నవ్వులు. జలతరంగిణి తరంగ ధ్వనులు. ఎవరిదో నవ్వు... చిరునవ్వు! కిలకిలలు. నాకు వినిపిస్తూనే వుంది. పంచేంద్రియ జ్ఞానం లేదుగానీ, అదో జ్ఞానం ఏదో ప్రజ్ఞ ఉన్నది.

"ఎవరు నువ్వు" అడిగాను.

ఎట్లా అడగగలిగాను? ఏమో! అడిగా నవిపించింది.

ఒక అజ్ఞాతహస్తం నా చేతిని పట్టుకుంది. ఆ స్పర్శ, పట్టుకంటె మెత్తగా, మృదువుగా ఉన్నది. మనిషా! అసంభవం! దేవతా! ఏమో!! అప్సరసా! కనిపించదేం? గుండె గుబగుబలాడింది.... భయం కాని భయం!

"ఎవరు నువ్వు" మళ్ళీ ప్రశ్నించాను.

"నేనే. నీకు ప్రియమైనదాన్నే" రూపంలేని వ్యక్తి సమాధానం.

నా కిష్టమైన వ్యక్తి? అంటే ఆడా? మగా? నాకు అనేకమంది ఇష్టం. అందులో ఎవరిని? గొంతు గుర్తించలేకపోయాను. "ఎవరు నువ్వు? వరూధినివా? శకుంతలవా?" మళ్ళీ అడిగాను. ఆ ప్రబంధ కన్యలంటే నా కిష్టం.

"ఆంతకు మించిన అందగత్తెనే" ఆమె నవ్వు .. కవ్వింపు.

"పోనీ క్లియోపాత్రావా? అనార్కలీవా?"

"అంతకన్న సొగసుకత్తెను .... వలపు మితాని" నవ్వు.

"ఎవరు నువ్వు"

"నీవు ఊహించే అందరి అందాన్ని నేను. అందరి సొగసు నేను. మంచిని నేను. సౌందర్యాన్ని నేను. ఒకరి తీయని పెదవులు, మరొకరి నునులేత చెక్కిళ్లు, మరొకరి శరీరలావణ్యం, స్నిగ్ధత అన్నీ నాలో ఉన్నాయి."

"అయితే ఇక్కడెందుకున్నావ్. నేను చచ్చిపోయాను. నావల్ల నీకేం ప్రయోజనం? నీవూ చనిపోయావా! భూమ్మీద బ్రతికుండగా కనిపిస్తే బావుండేది."

"నాకు చావులేదు. ఆ లోకంలో నీవు నన్ను పొందలేవుగా."

"అయితే కనిపించవేం!"

"నీలోని తీరని కోరికల రూపాన్ని నేను. తియ్యనిరూపాన్ని."

పరవాలేదు. భూలోకం వదిలినా, నా సౌందర్యారాధన ముగియలేదు. ఇక్కడా ఒక వలపులరాణి దొరికింది. కాస్త వేదాంతంకూడా నేర్చినట్లుంది.

నేను అనుకునేవన్నీ ఆమె గ్రహిస్తోంది. గొప్ప చిక్కే. ఒక్కసారిగా ఆమె చేయి విడలించుకున్నాను. హాయిగా చచ్చిపోతే మళ్ళీ ఇదేం బంధం!

అంతలో నా ఎదురుగావున్న గాలి అది గాలి అవునో కాదో తెలీదు, శూన్యం ప్రోగై గడ్డకట్టడం ప్రారంభించింది

అందులోనుండి ఒక ఆకారం రూపు దాల్చింది.

ఆమె స్త్రీ. అవును స్త్రీయే! ఆ నిర్మాణం స్త్రీదే. అద్భుతమైన సౌందర్యం. బంగారం కరుగుతున్నపుడు కనిపించే స్వచ్ఛమైన రంగు ఆమె శరీరం. ఆమె శరీరంపైన బట్టలు ఉన్నాయా! లేవు. కానీ ఉన్నట్లే ఉంది! ఉన్నవా లేవా, తేడా తెలియటంలేదు. ఆమె సౌందర్యం అద్భుతం. నేను బ్రతికుండగా ఆమె కనిపిస్తే ఇలా చచ్చిపోయేవాణ్ణి కాదు.

ఆమె నా మనస్సులోని ఆలోచన గ్రహించింది.

"చనిపోతే గానీ, నేను దక్కను. మీ ఋషులు మునులు ఘోరంగా తపస్సు చేసింది, ఈ కౌగిలిలో సుఖించడానికేగా" అన్నది నవ్వుతూ ...ఆ నవ్వు వెన్నెల క్రుమ్మరించినట్లుంది.

"అయితే నువ్వు?" అనుమానంగా అగాను.

"ఇప్పుడు నీదాన్ని, రంభను" సుకారంగా చూచింది నా చేతిని. తన చేతిలోకి తీసుకుని లాలించుకుంది. ఆమె శరీరం వెచ్చగాలేదు. ఆ స్పర్శ నాలో కోర్కెల్ని మండించలేదు ఒహూళా అర్జునుడు ఇలాగే ...

"నేను నీకోసం తపస్సు చేయలేదే! నీ కౌగిలికోసం, నీ పొందుకోసం నేనెన్నడూ తహతహలాడలేదే" అన్నాను.

"కావచ్చు. నిన్ను చూడగానే నాకు మనసైంది. నాలో అణగిపోయిన కోర్కెలు మేల్కొన్నాయి. మానవులతో సుఖించడం నాకిష్టం. చాలా కాలమైంది మనుష్యులతో సుఖించి. ఈ మధ్య ఎవరూ ఘోరతపస్సు చేయడంలేదు కనుక ఎవరూ ఈ దాపులకు రావడమే లేదు. దేవేంద్రుడు మమ్మల్ని మీ లోకం పంపడంలేదు. చాలా కాలమైంది. ఒక్కసారి మానవులతో సుఖించిన ఏ దేవతా, అప్సరస, ఆ అనుభవాన్ని మరచిపోలేదు."

ఆవిడ నిజంగా రంభా, లేక వర్యా వ్యభిచారా అనిపించింది.

"నీవు ఊహించింది నిజమే. నీ దృష్టిలో నేను వ్యభిచారినే కావచ్చు కానీ మా లోకంలో ఎవరికీ వ్యభిచార దోషం అంటదు. ఎందరితో సుఖించినా, మా కన్యత్వం చెడదు. చావుపుట్టుకలు లేనట్లు, జరామరణాలు లేనట్లు, మా యౌవనానికి, కన్యత్వానికి భంగం లేదు. ఈ దేవలోకంలో ఎవరికి ఎవరూ ఎల్లకాలం కట్టుబడి వుండరు. ఎవరికి ఇష్టమైనవారితో వారు సుఖించవచ్చు. తప్పుకాదు. మీ భూలోకంలోని సమాజనీతులు ఇక్కడ చెల్లవు. మాది స్వేచ్ఛాప్రణయం. వివాహ బంధనలు, కట్టడులు లేవు"

రంభ మాటలు నాకు పరమ అసహ్యం వేశాయి. అతిలోకసుందరి కావచ్చు.... కాని బరితెగిస్తే....

"ఇదిగో అమ్మాయ్. నువ్వు రంభనంటున్నావు సరే. నీ గురించి నేను




చాలా విన్నాను. నీవు వేశ్యవు.... నాకు వేశ్యలంటే యిష్టంలేదు" అన్నాను.

"ఇప్పుడు నీవాన్నవన్నీ...నాకోర్కె తీర్చు .... నీకు స్వర్గం చూపిస్తాను .... లేదంటావా శపిస్తాను."

ఆమె కిళ్లె చేసింది.

ఆవిడ నా శరీరానికి తగలగానే నాకు చిరాకు పుట్టింది. "నీ బెదిరింపులు కట్టిపెట్టమ్మాయ్. నీ అందం చూసి నేను మూర్ఛపోవటంలేదు. నీకంటే పెద్ద తారలనే చూశాను. మా లోకంలో సినిమా తారలున్నారు తెలుసా. వాళ్ళు మేకప్ చేసుకున్నపుడు. నీకంటే బావుంటారు. మిగతా హొయలు, తళుకులు, బెళుకులు. నీవు అక్కడ ఓనమాలు నేర్చుకోవలసిందే. పోతే శాపం అంటావు. నీ శాపం నన్నేం చేయదు. దేవుడంటే దడుసుకునే పిరికివాళ్ళకు శాపాలుగానీ. నాలాంటి మొండివాడికి కాదు."

ఆమె తగ్గింది. అవమానం కలిగింది. కాస్త దూరానికి జరిగింది.

"అయితే, ఈ నా యౌవనం, అందం నీకు అవసరంలేదా! నా నాట్యం, సంగీతం నీకు రుచించవా" అన్నది బేలగా.

"తల్లీ .... ఇవన్నీ యిప్పుడు మా లోకంలోనూ ఉన్నాయి. వెనకటిరోజుల్లో అయితే, అప్సరసల నృత్యాలు, గానాలు కొత్త .... ఇప్పుడు మీ అప్సరలోకమే సిగ్గుతో తలవంచుకోవాలి .... భూలోకాన్ని చూసి" అన్నాను.

"పోనీ నేను నీ దృష్టిలో కాస్త ముసలిదాన్ని కావచ్చు, మా తిలోత్తమ చిన్నది. సుకుమారి. ఇంకా, కొత్త మాయలేదు. దాన్ని పిలవమంటారా" అన్నది.

అబ్బ! ఎంతటి సోషలిజం!! సుఖాల్ని సమంగా పంచుకోవడం సోషలిజమేనా?

అంతలో మరొక వ్యక్తి ప్రత్యక్షమైంది. నిజంగా ఆమె రంభకన్న చాలా చిన్నది. బింకంగా, పొంకంగా ఉన్నది.

రంభకన్న చాలా అందంగా ఉంది. అవయవాల పొంపుసొంపులు ఆకర్షణీయంగా ఉన్నాయి. ఆ కళ్ళలో పిలుపు. కోరిక ఉన్నది. ఆమె వస్తూనే మత్తు వాసనల్ని వెంటతెచ్చింది.

"నువ్వు నిజంగా అదృష్టవంతురాలివే అక్కా. ఈయన వస్తున్నాడని ఎలా పసిగట్టావ్" అసూయగా అడిగింది ఆ అమ్మాయి నావేపు చూస్తో .... రంభనుద్దేశించి.

రంభ గాఢంగా నిట్టూర్చి. "ఏం లాభం. ఇతగాడికి నేను నచ్చలేదుట. అందుకే నిన్ను పిలిచాను" అన్నది.

"ఈవిడ తిలోత్తమా?" అడిగాను.

"గుర్తుపట్టారే పరవాలేదు. రసికులే" అన్నది తిలోత్తమ. నా భుజంమీద చేయి వేసి, గుండెపై వాలింది. "నేను అక్కకన్న అందగత్తెనా బావుందా?" అన్నది.

"ఇద్దరూ ఇద్దరే" అని విదలించి వేశాను.

"మరి నేనో" అంటూ మరొకామె ప్రత్యక్షమైంది.

"రావె మేనకా" రంభ స్వాగతం పలికింది.

"ఎవరీ విశ్వామిత్రుడు?" ఆమె అడిగింది.

"విశ్వాసం లేదు. మిత్రుడు కాదు" అన్నది తిలో.

అరూపంగా వచ్చి నన్ను కౌగిలించుకున్నది .... నాకు ఉక్కిరిబిక్కిరైంది. ఆమె రూపం దాల్చగానే ఊర్వశి అని పోల్చుకున్నాను.

రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ. ఒకరిని మించి ఒకరు అందంలో పోటీ పడుతున్నారు. హొయలు ఒలకబోస్తున్నారు. సొగసులు కురిపిస్తున్నారు. అందరిలోను చిరయౌవనం, నవయౌవనంవలె పరిమళాలు వెదజల్లుతోంది. గాలిలో తేలిపోతున్నట్లు నడుస్తున్నారు. ఎవరికివారే నన్ను దక్కించుకోవాలని ప్రయత్నం.

రంభ విసిగిపోయి అన్నది, "ఏమిటో ఈ దేవతలతో విసిగిపోయి, ఏదో మానవుడు వచ్చాడు గదా, కొత్త రుచి చూద్దామంటే ఇతగాడు భీష్మించుకుంటున్నాడు. మన అందచందాలు ఎందుకూ కొరకాకుండా పోయాయి."

"మీకేం తక్కువ" అడిగాను.

"ఆఁ, మా సంగతే అడగండి ఆ దేవేంద్రుడి కొలువులో నాట్యం చేసిచేసి విసిగిపోయాం. ఏరోజు ఎవరు పిలిస్తే వారితో గడపాలి. ఒకరోజు చంద్రుడు, ఒకరోజు అగ్ని, మరొకరోజు యముడు. అబ్బ, వీరంతా వంతులు వేసుకున్నట్లు పిలుస్తారు. ప్రాణాలు విసిగిపోయాయి.

పోనీ ఏ గడ్డిపోదన్నా శపిస్తే బావుండు. భూలోకంలో మానవకాంతలుగా జన్మిస్తాం. నీలాంటివాణ్ణి పెళ్ళాడి గుట్టుగా బ్రతుకుతాం" అన్నది మేనక జ్ఞానిలాగా.

"అక్కడా బోలెడు కష్టాలుంటాయట అక్కా" అన్నది చిన్నది తిలోత్తమ.

"ఉన్నా, స్వర్గంలోకన్న సుఖమే లేవే. జీవితంలో కష్టాలు, సుఖాలు పెనవేసుకువివుంటాయక్కడ నిత్య పరిణామం వుంటుంది మనలాగా ఎదుగుబొదుగు, మార్పులేని జీవితం కాదు స్వర్గం అనడమే కానీ, ఇక్కడ ఏం సుఖపడి చస్తున్నాం చెప్పు? ఆ చావు లేదు, నిద్ర లేదు, ఆకలి లేదు ముసలితనం లేదు. ఎప్పుడూ ఏదో ఒక మగాడిని కరుచుకుని ఉండడమేనా స్వర్గసుఖం అంటే."

వాళ్ళ మాటలు వింటుంటే స్వర్గం కన్న భూలోకమే మేలనిపిస్తోంది. మనుష్యులు ఈ స్వర్గసుఖాలు ఎందుకు కాంక్షిస్తారో అర్థం కాదు. రంభతోనో, ఊర్వశితోనో సుఖించడానికే స్వర్గానికి రావడం?

ఆ నలుగురి ముఖాలు కాంతిహీనం అయ్యాయి. దైన్యం నింపుకున్నాయి. అందంగా మెరిసిన ఆ ముఖాలలో చీకటి నీడలు దోబూచులాడుతున్నాయి. వీరికీ తీరనికోరికలున్నాయా? నిరాశ, నిస్పృహలున్నాయా? అలసట, అతృప్తి కనిపిస్తోంది వారిని అక్కున చేర్చుకుని ఓదార్చాలనిపించింది. తీరా ఆ పని చేస్తే నన్ను కరుచుకుపోతే ఒదిలించుకోవడం అసాధ్యం.

అందరిలోనూ నా కంటికి తిలోత్తమ నచ్చింది. ఆమెవైపు ఇష్టంగా చూచాను. ఆమె ఒక్కసారిగా ఎగిరివచ్చి నన్ను చుట్టుకుపోయింది. మిగత ముగ్గురు నిట్టూర్చారు.

"ఎందుకమ్మా అంత అసూయ.... ఇంతలోకే నేనేదో సుఖపడిపోయినట్లు. అయినా ముసలిబుషులతో పోయినదానివి. నిన్ను కోరడులే మేనకా!"

మేనకను చూస్తే విశ్వామిత్రుడు జ్ఞాపకం వచ్చాడు. అవిడ నెరజాణ.... రంభను చూస్తే నాకు అసహ్యం వేసింది.

రంభ తిలోత్తమతో అన్నది.

"తిలో! నాకీ జీవితం విసుగు పుడుతున్నదే చెల్లీ. క్రింద భూప్రపంచం, అక్కడి మనుష్యులను చూచాక, దేవతలన్నా, స్వర్గం అన్నా రోత పుడుతోంది. దేవతల మనడమేగానీ. మనుషులకున్న నీతి నిజాయితీ లేదిక్కడ. భూలోకంలో అలా కాదు. ఎవరైనా ప్రేమిస్తే, అజన్మ దాసుడవుతాడు స్త్రీని గౌరవిస్తారు. వాళ్ళకు అందాన్ని ఆరాధించడం, అనుభవించడం తెలుసు. స్త్రీని గౌరవించడం తెలుసు, అక్కడ స్త్రీలు పూజనీయులు, ఆరాధనీయులు వారికి ప్రేమవిలువలు తెలుసు. ఇక్కడవలె, ఈరోజు మనతో సుఖించి, రేపు మరొకర్ని కోరరు. ఒక మగాడికి ఒక ఆడది. మనం స్వర్గలోకవాసులం,

దేవతలం, అప్సరసలం. మనం పారిజాత పుష్పాలు ధరిస్తాం. కానీ మనుషులవలె తృప్తిగా సుఖించలేం.

"ఇంద్రుడు మనలో ఒకర్ని పిలిచి, నువ్వు వెళ్ళి, ఫలానావాడిని చెడగొట్టిరా, వాడి తపస్సు భంగం చేయి అంటే ఇష్టం లేకపోయినా, పోక తప్పదు. దేవతా వస్త్రాలు విప్పి, అవయవ ప్రదర్శన జరిపి అతగాడ్ని కవ్వించాలి. మనం చేసేది వ్యభిచారం.

"మేనకా! నీకు తెలియదుగానీ, మనం అందం చూచి మనం గర్విస్తాం. భూలోక స్త్రీలు ఇక్కడకు వస్తే, ఈ స్వేచ్ఛా ప్రణయంతో పదిరోజుల్లో విసిగించుకొని పారిపోతారు. మళ్ళీ మనుషులుగా పుట్టి అక్కడ కష్టపడడానికే యిష్టపడతారు."

నాకో చిన్న అనుమానం వచ్చింది.

"అంటే పుణ్యస్త్రీలు స్వర్గానికి వస్తే"

తిలోత్తమ వెంటనే అందుకున్నది,

"వస్తే, రోజుకో దేవుడిని తృప్తిపరచాలి. మగవాళ్ళు వస్తే, మేం అప్సరసలం ఏం చేస్తున్నాం అదే. మాలాంటివారు ఎంతో మంది ఉన్నారు. ఎవరితోనైనా సుఖంగా గడపవచ్చు. ఎవరు ఎవరిని వాంఛించినా కాదనరు. అయిష్టం చూపరు. సుఖమే ప్రధానం. కొంతకాలానికి ఈ సుఖాలంటే అసహ్యం కలిగి నరకానికి పారిపోతారు. లేదా భూలోకంలో మళ్ళీ జన్మిస్తారు.

"దేవలోకమనీ, స్వర్గసుఖాలనీ అంటారే! ఇదా ఇక్కడి వ్యవహారం" అన్నాను.

"కాకపోతే మరేమనుకున్నావ్. స్వర్గ సుఖాలంటే ఏమిటి.... లేకపోతే నిత్యం భజనలు చేస్తూవుంటారనుకున్నావా! చెట్టుకొకరు, పుట్టకొకరు కూర్చుని, ముక్కులు మూసుకుని జపాలు చేస్తుంటారనుకున్నావా! ప్రొద్దున కైలాసానికి, సాయంత్రం వైకుంఠానికి, రాత్రి బ్రహ్మలోకానికి షికారు వెళ్ళి వస్తుంటారనుకున్నావా! ఇది స్వర్గం... ఇది మీరు కోరుకున్న సుఖనిలయం. మీరు వేదాలలో, పురాణాలలో వ్రాసిపెట్టినవన్నీ నమ్ముతారు. ఏవేవో ఊహిస్తారు. ఉపవాసాలుండి, పూజలుచేసి, వ్రతాలు జరిపి ఇక్కడకు వస్తారు. అంటే స్వేచ్ఛగా ప్రణయం సాగించడానికి హక్కు పొందుతున్నారన్నమాట. దీనిని మీరు దైవ లీలలు, స్వర్గసుఖాలు అంటారు.

ఇక్కడ మాకు పోటీ విష్ణుమూర్తి అని ఒకరున్నారు. మేం కాదు అనడాని, బెట్టుచేస్తే, ఆయనగారే ఆడవేషం వేసుకుని మోహినినంటూ బయలుదేరతాడు. ఏ నారదుడో, శంకరుడో, ఆయనను అనుభవిస్తారు. పిల్లల్ని కంటారు. వాళ్ళు అంతా దేవుళ్ళు మీకు. మీ భూలోకవాసులెవరూ పై లోకాలకు వెళ్ళకూడదు. వెడితే వాళ్ళ పదవులకు ముప్పు. అందుకే ఈ స్వర్గం ఒకటి సృష్టించి పెట్టారు. మీరు ఎంత పుణ్యంచేసి ఎంత తపస్సు చేసినా, ఇది దాటి పైకి పోరు. వారు




రాసివ్వరు. మిమ్మల్ని గెడగొట్టడానికి మేమున్నాం. ఈ స్వర్గంలో పడి మీరు పైలోకాల సంగతి మరచిపోతారు.

మేనక అన్నది, "అమ్మాయ్ తిలోత్తమా! ఎలాగైనా ఈ స్వర్గం అనే నరకంనుండి పారిపోదాం. ఉపాయం ఆలోచించవే."

"మా లోకంలో అందరూ స్వర్గం కోసం కలవరిస్తారు" అన్నాను.

"అవునయ్యా ఆ పుస్తకాలలో రాతలు వదిలి. అవి రాసింది మీ ఋషులే గదా! చెప్పారుగా. వాళ్లు ఈ స్వర్గం దాటి పైకి పోలేదని. అందుకే ఇదే గొప్పగా వ్రాసి పెట్టి. మిమ్మల్ని మోసంచేశారు....ఇదీ మా జీవితం. చూశావుగా. పోనీ మమ్మల్ని నీతోపాటు తీసుకువెళ్ళరాదూ. వస్తాం."

"రండి దానికేం. భూలోకం నా స్వంతమేమిటి! స్వంత ఇల్లు కూడా లేదు నాకు. అద్దెకొంపవాణ్ణి. అయినా నేను తిరిగి భూలోకం పోవడం లేదే.. ఈ సృష్టిరహస్యాన్ని తెలుసుకోవాలని, సృష్టి కర్త అయిన బ్రహ్మన్ని చేరాలని బయలుదేరి వచ్చాను"

"పదండే. సత్యాగ్రహం చేసో, సమ్మె చేసో, మన కనీసకోర్కెలు తీర్చుకుందాం. భూలోకం పోదాం" అన్నది రంభ.

తిలోత్తమ నామీద ఒక కన్ను వేసే వుంది.

"నువ్వేదో బ్రహ్మన్ని చూడాలంటావు. సృష్టిరహస్యం అంటావు. ఆయనెవరు? ఎక్కడుంటారు....అదే లోకం ప్రశ్నించింది. నెమ్మదిగా నన్ను వచ్చిక చేసుకుంటే. నాతోపాటు రావచ్చునని ప్లాను వేస్తోంది. అమ్మడు. పోనీ తీసుకువెడితే

నేం? ఒక ఆడతోడు ఉంటుంది అను కున్నాను.

"అది ఈ లోకాలన్నింటికి పైన ఉంటుందని విన్నాను. అక్కడకు వెదు తుండగా, మధ్యలో మీరు ఆపారు" అన్నాను

"మేం పోతాం" అంటూ నలుగురూ అంతర్ధానమైనారు.

మళ్ళీ చీకటి ఆవరించింది.

నా చుట్టూ తళుకుమనే నక్షత్రాలు. మరల ప్రయాణం సాగింది. వీళ్ళ సంగతి ఆ పరమాత్మనికి నివేదించాలనుకున్నాను. స్వర్గంలో జరుగుతున్న అన్యాయాలు, సృష్టి పరిణామవాదానికి భిన్నంగా ఉన్నాయి. దేవుళ్ళ ప్రవర్తన బాగాలేదు. మరీ స్వార్థం మితిమీరిపోయింది. ఎవరినీ పై లోకాలకు రానీయకపోవడం అన్యాయం. అసలు ఇలా జరుగుతున్నదని, తన ఉన్నతోద్యోగులైన దేవుళ్లు ఇంత అన్యాయానికి తలపడ్డారని అసలు పరమాత్మకు తెలుసా, తెలిసీ, సహించి ఊరుకున్నాడా!

మహావేగంతో వెడుతున్నాను. ఎన్ని వేల, లక్షల మైళ్ళో. రాకెట్‌ను మించిన వేగంలో ప్రయాణం చేశాను. ఎన్ని రోజులు వెళ్ళానో!

ఒక్కసారిగా నా తలపై ఒక గోళం వచ్చి పడి బద్దలైంది. గగనతలం వెలుగుతో నిండిపోయింది. ఆ గోళం పడ్డ వుడు, ఆ గోళమే వేయి ముక్కలైందో, నా తలే వేయి ముక్కలైందో మరి. ఏదో జరిగింది. వేవేల రోజాకిరణాలు నన్ను వలయాలుగా చుట్టివేశాయి. వేయి మంది సూర్యులు ఒక్కసారిగా వెలిగారు. ఆ అద్భుతకాంతిలో వేడి లేదు. అది చల్లని ప్రశాంతి. మందమైన ధవళకాంతి. ఎంతో నిర్మలంగా, పవిత్రంగా ఉన్నది వాతావరణం.

నా హృదయకుహరంనుండి సన్నని గంటలధ్వని బయలుదేరింది. అవి వేవేల గంటలై మ్రోగి, మార్మోగి పైకి ఉబికివస్తున్నవి. నా తల బ్రద్దలవుతోంది. వేయిరేకులుగా విడిపోయి, సహస్రదళ పద్మం విచ్చుకున్నట్లు అయింది. అన్ని గంటల భిన్ననాదాలు, ఏకనాదమైంది. ఒకే ధ్వని అనాహతం.

నేను పరమాత్మను దర్శించబోతున్నా ననే ఆతృత. ప్రజ్ఞ. ఆయనతో ముఖా ముఖీ మాట్లాడాలి. ఆ విశ్వరూపుని దర్శించాలి. సృష్టిరహస్యం తెలుసుకోవాలి. చివరకు ఆయనతో, ఆ విశ్వాత్మలో లీనం కావాలి. చావు పుట్టుకలకు అతీతమైన స్థితి సంపాదించాలి.

గాలిమేఘంవలె నా శరీరం తేలిపోతున్నది. ఇతర మేఘాలు అనేకంవచ్చి నన్ను అతలాకుతలం చేశాయి.

"హే భగవన్ .... నువ్వు యెక్కడున్నావ్' .... అరిచాను. లక్షల గొంతులు ప్రతిధ్వనించాయి. అంటే అక్కడ లక్షలాది ప్రాణాలు, అశరీరమై, భగవంతుని

కోసం ఎదురుచూస్తున్నాయా! నాలాగా పిలవలేక ఇంతకాలం మూగపోయాయా! భగవంతుని పిలిచే ధైర్యంలేదా ఎవరికీ?

ఎన్నోవందల ఏండ్లు ప్రయాణించేసి వచ్చానే. ఏదీ నేను కోరుకున్న పరమాత్మ!

అంతలో ఒక దేవదూత వచ్చి నాకు చేయి అందించి పైకి లాగాడు. ఒక ద్వారంగుండా తీసుకువెళ్లాడు. అది ద్వారం కాదు, ఒక తెర, ఒక గాలితెర. అవతల అంతా నీరవ నిశ్శబ్దం, మరణాంతర ప్రశాంతత. అది సర్వవ్యాప్తమైన తేజోమయ జగత్తు .... అమౌక లోకం .... ప్రశాంత వియం.

అక్కడ ఒకాయన పెద్ద పెద్ద పుస్తకాలు ముందు పరుచుకుని కూర్చున్నాడు. గుమాస్తా అనుకుంటాను అయినా దివ్యంగా మెరిసిపోతున్నాడు.

"ఎవరునువ్వు" అడిగాడు నన్ను చూడగానే ఇతడు ఏ భాషలో అడిగాడో, నేను ఏ భాషలో చెప్పానో నాకు తెలీదు గానీ, అది భాష అవసరంలేని భావ సంభాషణ.

"ఎక్కడనుండి రాక? నీ పేరు? విలాసం?"

నాకు నిజంగా కోపం వచ్చింది

"క్షమించండి. మీరు మరీ బొత్తిగా నన్ను గుర్తించనట్లే మాట్లాడుతున్నారు.. నా పేరు వినలేదా! పేపర్లలో నా ఫొటో కూడా చూళ్ళేదా! .... అని అడిగాను.

నా పేరు ఆంధ్రలో తెలియని వారుండరు. ఇండియా మొత్తంలో నూ నాకు ఇంతో, అంతో పేరుంది. ప్రపంచంలో చాలా దేశాలకు నాపేరు పరిచయమే. ఇతగాడు మరీ అజ్ఞానిలాగా పోజు పెడితే చికాకు వెయ్యదామరి నా అంతటి గొప్ప వాణ్ని గుర్తించనట్లు నటించడమే గొప్ప అనుకుంటున్నాడన్నమాట పైగా ప్రశ్నిస్తాడా! నేనేమైనా ఉద్యోగానికి వచ్చానా! ఇంటర్వ్యూకి వచ్చానా.

అదే చెప్పాను;

"అయ్యా, తమరు గుర్తించలేదనుకుంటాను. నేను ఇండియా నుండి వచ్చాను. తెలుగువాణ్ని"

అతను దేభ్యం మొఖం పెట్టాడు.

"అంటే ఏ రకం జీవివి?" మరో ప్రశ్న ఎంత అజ్ఞానం, ఇతగాడు ఏ యూనివర్శిటీలో చదివాడో! సర్వీస్ కమీషన్‌లో పాసైనాడో, దొడ్డిదోవన ఉద్యోగం సంపాదించాడా అనిపించింది.

నాకు మండిపోయింది

"ఇదిగో మిస్టర్. నీపేరేమిటోగానీ, నన్ను గుర్తించనట్లు పోజు పెట్టావ్ సరే, ఒప్పుకున్నా. నేను ఏరకం జీవిని అని ప్రశ్నించడంలో నీ ఉద్దేశం .... సర్వోత్కృష్టమైన మానవజన్మ ఎత్తివచ్చానే!"

అతగాడన్నాడు:

"అబ్బాయ్. కోపగించుకోకు. ఎనభై నాలుగు లక్షల జీవరాసులలో నీది ఏ రాశో నే నెలా పోల్చగలను చెప్పు. అన్ని

రకాల జీవాలు. జీవరాసులు మా దృష్టికి సమానమే. అయితే నువ్వు మనిషి వంటావ్! అవునా!''

''మనిషినా! నేనొక పెద్ద రచయిత నయ్యా బాబూ! అనేక కథలు, నవలలు వ్రాశాను. సాహిత్య అకాడమీ ...నీకు తెలుసా! నీకెలా తెలుస్తుందిలే....'' అన్నాను.

అతగాడికి రచయిత అంటే అర్థం అయినట్లు లేదు బిక్క మొహంపెట్టి, తల గోక్కున్నాడు.

''ఏదో ఒకటిలే నీ వివరాలుచెప్పు. సద్దుమాస్తాను. నీవు చేసిన పుణ్యం ఎంత? పాపం ఎంత! ఇది ఎన్నవ జన్మ!'' భోగట్టా అడిగాడు.

నాకు మండుకొచ్చింది. నా ఇంటి అడ్రసు, ఆఫీసు అడ్రసు యిచ్చాను.

''ఇండియా అంటే? ఏ గోళం?'' అడిగాడు. అతగాడి అజ్ఞానానికి కోపం. నవ్వు వచ్చాయి. ''ఇండియా అంటే తెలీదు.''

''స్వామీ! తమరు ఈ ఉద్యోగం ఎన్నేళ్ళ బట్టి ఇలాచేస్తున్నారో అర్థం కావడంలేదు. మీకు జాగ్రఫీ బొత్తిగా తెలిసినట్లు లేదు

''ఏగోళం చెప్పావు కాదు?'' అడిగాడు.

''భూగోళం'' అన్నాను కసిగా.

''అలా ఏడవరాదా'' అన్నట్లు చూచాడు నా వైపు.

''మాది భారతదేశం. కర్మభూమి. లెక్కలేనంత మంది మా కర్మభూమిలో ఘోరంగా తప్పు చేశారు. మా సంస్కృతి గొప్పది. శ్రీకృష్ణుడు, రాముడు, బుద్ధుడు, శంకరుడు వీరంతా అవతారపురుషులు... మా దేశంలో జన్మించారు ! కు అనుమానం వుంటే ఆ విష్ణుమూర్తికి ఫోన్ చేసి కనుక్కో.''

అ చుట్టుపట్ల ఫోన్ ఉన్నట్లు లేదు. మెస్ట్ బాక్ పర్డ్.

నాకో చిన్న అనుమానం వచ్చి. అతన్ని నెమ్మదిగా కదిపాను

''కన్నట్లు తమరు గాంధిగారి పేరు విన్నారా? లేదా పోనీ ఇందిరాగాంధీ పేరు విన్నారా! ఈ మధ్య పాకిస్తాన్ యుద్ధంలో చెప్పిరాలు తీసిందయ్యా మా ఇందిరాగాంధి. ఆమె తెలీదు సీరు''

ఏ మాత్రం ప్రపంచ జ్ఞానం లేని వాణ్ని ఇలాటి పెద్ద ఉద్యోగంలో పెట్టి నందుకు నాకు ఏడుపొచ్చింది. ఏం చేస్తాం? భారత ప్రభుత్వ పద్ధతిని అను సరిస్తున్నారల్లే వుంది.

అప్పటికి మరో పదిమంది గుమాస్తా గాళ్లు పొగైనారు. నా కేస్ హిస్టరీ అర్థం కాక అందరూ బుర్రలు బద్దలు కొట్టు కుంటున్నారు

''లాభంలేదు. తెలియడంలే' దని పెదవి విరిచారు.

''ఓరి దౌర్భాగ్యుల్లారా'' అనిపిం చింది. నేను పరమాత్మ అయిన భగ




వంతుని చూడాలని నేను మోజు పడి, కోరి, ఇంతదూరం వస్తే ఇదా ఫలితం! ఈపాటికి, ఇండియాలో నా మరణవార్త, ఫొటోలతోసహా అనేక పత్రికలలో పడి ఉంటుంది. నా జీవితచరిత్రలు అచ్చయి వుంటాయి ఇక్కడ రేడియో కూడా లేదు. వారికి వినిపించడానికి.

"స్వామీ! ఎందుకొచ్చిన శ్రమగానీ, నన్ను ఆ దేవుడి దగ్గరకు పంపండి. నేను చూసుకుంటాను" అన్నాను.

"వీడెవడో గడుగ్గాయి' అనుకున్నారు. 'దేవుని దగ్గరకా! బలేవాడివే. నువ్వు ఎనభైనాలుగు లక్షల జన్మలు ఎత్తాక గానీ దేవుణ్ని చూడడం పడదు. అప్పటికి నీకు పాస్‌పోర్టు వస్తుంది" అన్నాడు.

నా గుండె గుభేల్ మన్నది. ఎనభై నాలుగు లక్షల జన్మలా! ఎంతైనా రచయితను గదా! ఓ కథ అల్లాను.

"అవన్నీ పూర్తి చేసుకునే వచ్చానయ్యా బాబూ" అన్నాను.

వాళ్ళు మళ్ళీ ఆలోచనలో పడ్డారు.

"భూగ్రహం నుండి కదూ వచ్చావ్"

"అవును మహాశయా! ఇండియా! అక్కడ నుండి చూస్తే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు కనిపిస్తాయి. మీ రెప్పుడు మా లోకం రాలేదా. మా వారు చంద్ర మండలం కూడా వెళ్ళి వచ్చారు" అన్నాను ధీమాగా.

వారికి నా గోడు అర్థం కాలేదు. అంతలో ఒక ముసలి దేవదూత వచ్చాడు దేవుడల్లే. అతనన్నాడు. 'బాబూ, నీవు మా కష్టమూ విచారించు. ఈ విశ్వం చాలా పెద్దది. విశ్వాంతరాళంలో కొన్ని లక్షల

గ్రహాలు, గోళాలు, మండలాలు — భూమండలం అంతపెద్దవి ఉన్నాయి. ఎన్నో చంద్రగోళాలున్నాయి. సూర్య గోళాలున్నాయి. దాదాపు వేయి సూర్య మండలాలున్నాయి నీవు చెప్పేది ఏదని అర్థం చేసుకోము అయినా ఒక్కక్షణం ఆగు.... '

నేనన్నాను, ''అయ్యా మీరు పెద్ద వారు. మీకు సర్వం తెలిసే వుంటుంది. మా దేశంలో వెంకటేశ్వరస్వామి అని ఒక గొప్ప దేవుడున్నాడు. నేనొకసారి ఆయన్ని దర్శించాను. '

ఆతను తల ఊపాడు.

''పోనీ, బ్రహ్మ, విష్ణుమూర్తి, ఈశ్వరుడు, వినాయకుడు, సుబ్రహ్మణ్యస్వామి వీరు తెలీదా'' ప్రశ్నించాను.

''తెలుసు లేవయ్యా! అయితే ఏమంటావు.''

''వారిని మా లోకంలో పూజిస్తారు. వీళ్ళందరికీ అక్కడ గుళ్ళు గోపురా లున్నాయి అక్కడకు పోయివస్తుంటారు భక్తులకోసం. వారు నన్ను చూసి ఉండ వచ్చు'' అన్నాను.

''అలా చెప్పరాదూ'' అన్నట్లు చూచాడు నావైపు, పెద్ద డిటెక్టివ్ పోజు పెట్టి.

అతన్ని యాహ్యాఖాన్ దగ్గరకు పంపితే షూట్ చేసి ఏ నదిలోనో పారేయించే వాడు.

''అది చాలా వెనుకబడ్డ గోళం. అందుకే మా వాళ్ళకు అంతుచిక్కలేదు'' అంటూ ఆయన ఎవరికోసమో పంపాడు. వెంటనే బిలబిలమంటూ నేను చెప్పిన దేవుళ్ళందరూ సకుల సమేతంగా వచ్చారు. అబ్బో! ఎంతమంది దేవుళ్ళు నాకు తెలిసినవాళ్ళు, తెలియనివాళ్లు ... ఒక్కొక్కరికి ఎన్నెన్ని ముఖాలు, ఎన్నెన్ని చేతులు .... బొమ్మలకొలువులా వుంది.

''వీరేనా నీవు చెప్పింది?'' అడిగాడు ఆయన వారిని చూపిస్తూ

అవునన్నాను.

''ఇతను మీకు తెలుసా?'' అని నన్ను చూపిస్తూ వారిని ప్రశ్నించాడు.

వాళ్ళందరూ నన్ను ఎగాదిగా పరిశీలించారు గానీ, ఎవరూ నన్ను గుర్తించి నట్లు లేదు. నన్ను చూడనేలేదట.

''నువ్వు ఎవరి భక్తుడివి?'' బృంద గానంలాగా ప్రశ్నించారు.

నేను ఎవరి భక్తుణ్ణీ కాను. ఎలా అబద్ధం చెప్పేది. దేవుడిముందు అబద్ధం చెబితే ప్రయోజనం లేదు. వెంటనే ఒక పథకం వేశాను. మా వీధి మొగదలలో చిన్న వినాయకుడి గుడి వుంది. ఆ గుడి ముందగానే రోజూ వెళ్లేవాణ్ణి. నేను గణపతిని చూడకపోయినా, ఆయనేనా నన్ను చూచివుంటాడని ఆశ కలిగి అడి గాను. ''ఏమండీ వినాయకుడుగారూ! రోజూ నీ ముందుగా అయిదారుసార్లు తిరిగేవాణ్ణే.''

''గుళ్ళోకి వచ్చావా...కొబ్బరికాయలు కొట్టావా?'' ప్రశ్న.

''లేదు.''

''అయితే నీవు నాకు తెలియదు పో.''

మా పేటలో శివాలయం ఉంది. అటుగా చాలాసార్లు వెళ్లాను. శివుణ్ణి అడిగాను, ఆయన ఐడెంటిఫికేషన్ సర్టిఫికేట్ యివ్వలేదు పార్వతీదేవిని అడిగాను. ఆమె కనికరించలేదు.

నేను ఏ గుడికీ వెళ్ళలేదు. కనుక ఈ దేవుళ్ళలో ఎవరికీ నన్ను చూచే అవకాశం కలగలేదు. పాపం వాళ్ళుమాత్రం ఏం చేస్తారు. దొంగ సర్టిఫికేట్ ఇవ్వాలి.

''నువ్వు భక్తుడివి కాదు. ఎన్నడూ గుడికి వెళ్ళలేదు....మమ్మల్ని చూడ్డానికి నువ్వు వచ్చివుంటే నీ కేసు ఎవరమో ఒకరం చూచేవాళ్ళం'' అన్నారు ముక్తకంఠంతో.

నా కర్మానికి నన్ను వొదిలి, ఆ దేవుళ్ళంతా పెళ్లాల కొంగులు పట్టుకుని, బాలోమంటూ వచ్చినదారినే వెళ్ళిపొయ్యారు.

''ఏమయ్యా! నువ్వు మరీ ఇంత పాపిష్టివాడివా!' అన్నాడు ఆ ముసలి దేవదూత నాకేసి జాలిగా చూచి.

''నేనేం పాపం చేయలేదు. ఏ పాపం ఎరగను'' అన్నాను.

''మరి ఇందరుదేవుళ్ళలో ఏ ఒక్కర్నీ పూజించలేదా!''

''నేను పాపం చేయలేదు'' అని మొండిగా తెగేసి చెప్పాను. ఆ దేవుళ్ళతో నాకేం పని పడలేదన్నట్లు.

ఆయన చిరాకుపడి పాపుల రిజిస్టర్ తీసి గబగబా వెదికాడు. తొందరగా నన్ను ఏ యమలోకానికో తోసేద్దామని. అందులో నా పేరు లేదు. గమ్మత్తేమిటంటే, మహాభక్తులు, గొప్పవాళ్లు, మునులు, బాబాలు, భగవాన్లు అనీ, పుణ్యాత్ములు అనీ మనుషులు కీర్తించే వారి పేర్లు చాలా ఉన్నాయి అందులో. అందులో జేబుదొంగలు, మరానాదొంగలు మంత్రులు ఉన్నారు. నా పేరు లేదు.

''నిన్నేం చేయమంటావ్'' ఆయన ప్రశ్నించాడు. 'నీకేం శిక్ష కావాలి'' అని న్యాయమూర్తి ముద్దాయిని అడిగినట్లు.

''అయ్యా, నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను చెప్పండి'' అన్నాను.

''అడుగయితే.''

''ఈ సృష్టికి మూలకర్త ఎవరు?''

''నీకెందుకు?'' ఆయనకు కోపం వచ్చింది. అల్ఫ్టాల్ ఒక మనిషి, సృష్టికి మూలాన్నిగురించి ప్రశ్నించడమా!

''పరమాత్మ'' అన్నాడు.

' అవునా! నన్ను సరాసరి ఆయన దగ్గరకు పంపండి. మిగతా వ్యవహారం నే చూచుకుంటాను'' అన్నాను.

''ఆయన ఒకరున్నారని వినడమే గానీ, ఎలా వుంటాడో మాకే తెలీదు. ఎక్కడ వుంటాడోకూడా తెలీదు. నాకే కాదు, ఇప్పుడు వచ్చిపోయిన ఈ దేవుళ్ల

ఎవరూ ఆ పరమాత్మను ఎరగరు. ఎవళ్ళ పని వాళ్లు చేసుకుపోతున్నాం అంతే!"

"పోనీ ఆ మార్గం చూపగలరా" అడిగాను.

"ఆపైన ఎక్కడో ఈ మండలాలన్నీ దాటాక, సహస్ర సూర్యమండలం ఉంటుందట. అదికూడా దాటిపోతే, అవతల ఆ పరమాత్మగారి తేజోమండలం వుంటుందట. అక్కడొక పెద్ద అభేద్యమైన తెర ఉంటుందట. అది దాటిపోతే, మళ్ళీ ఇవతలకు రావడం అంటూ వుండదు. మేం ఎవళ్ళం అంతదూరం వెళ్ళలేదు. ఎప్పుడో మాకు పనులు నిర్దేశించారు. చేస్తున్నాం. ఆ పరమాత్మ మరలా మమ్మల్ని పిలిపించిందిలేదు. మేం వెళ్ళిందీలేదు. ఆయనను చూచిందీలేదు. సరేనా నీ నువ్వు ఈ నైరి కోరిక, ఎవరూ కోరని కోరిక కోరుకున్నావేం .... నీకీ జ్ఞానం ఎలా కలిగింది?" ప్రశ్నించాడు.

ఏమో నాకే తెలీదు!

"అసలు నువ్వు ఈ నవగ్రహాల ప్రభావంనుండి తప్పించుకుని ఎలా రాగలిగావు. ఎవరూ ఇలాగా రాలేదే!" ఆయనే మళ్ళీ అడిగాడు.

"నవగ్రహాలు నన్ను ఆపలేదు. మీ దేవళ్లు ఎవరూ నాజోలి పట్టించుకోలేదు చూచారుగా. కనుక. నన్ను పైకి పంపండి వెళతాను." అన్నాను.

"బలేవాడివే! నేనా పంపేది. నా కా శక్తివుందని నీవు నమ్ముతున్నావా! ఉంటే ఈ దేవుళ్ళందరూ ఎందుకు పారిపోయారు నిన్ను చూడగానే. కావాలంటే భూలోకం పంపిస్తాను. పో" అన్నాడు.

"వద్దు స్వామీ నేను భూలోకం పోను" అన్నాను.

"పోనీ నరకానికి పంపండి. భూలోకంలోకన్న అక్కడే సుఖంగా ఉంటుందట" అడిగాను.

"బలేవాడివే. నిన్ను నరకానికి పంపడమా! నీ పేరే ఆ లిస్టులో కనీసం చివరగానైనా లేదు. నిన్ను అక్కడకు పంపిస్తే నీ వెనుకనే నన్ను పంపిస్తారు" అన్నాడు.

"అయితే దయచేసి నన్ను వదిలిపెట్టండి" అన్నాను.

అక్కడనుండి బయలుదేరాను. ఈ సారి ప్రయాణం చాలా హాయిగా వుంది. అనేక తేజోమండలాలు దాటాను. సూర్యమండలాలు దాటాను. తేజోమండలం చేరుతున్నాను అక్కడకు వచ్చాక ఒక బుద్ధి పుట్టింది. నేను ఎంతదూరం ప్రయాణంచేశానో, ఆ సృష్టి అంతా యెంత అందంగా కనిపిస్తుందో చూడాలని కోర్కె కలిగింది. వెనుతిరిగి చూచాను ఓహ్! ఎన్ని లక్షల కోట్ల నక్షత్రాలు, తారలు, సూర్యులు, చంద్రులు. ఏమి అందం. ఒక్క అడుగు ముందుకువేస్తే పరమాత్మ సన్నిధికి చేరేవాణ్ణి కాని ఒక చిన్న కోర్కె .. ఒక్క వెనుకచూపు

నన్ను విసిరివేశాయి. తిరిగి నా ప్రాణం రయ్యినవచ్చి శరీరంలో ప్రవేశించింది.

కళ్లు తెరిచి చూచేసరికి, పడిపోయి వున్నాను.



# రంగయ్యతాతగారి పరువు మర్యాద

కొడవటిగంటి కుటుంబరావు

రంగయ్యతాత లక్షాధికారి. పైగా వృద్ధుడు, మాననీయుడు. ఊళ్ళో అంతా ఆయన్ని భయభక్తులతో చూస్తారు. గొప్పగొప్పవాళ్ళంతా ఆయనయొక్క సద్గుణాలు మెచ్చుకుంటారు.

"ఈ ప్రాంతాల అతిథిప్రియుడంటే అది రంగయ్యతాతగారే!" అని డిప్టీ కలెక్టరుగారు ఎప్పుడూ అంటారు.

"ధనవంతుడ్డాని ఆయనకేమీ అతిశయం లేదు" అని శిరస్తాదారుగారు చాలా ఎన్నిక చేస్తారు.

"అతిథుల్ని సత్కరించటంలో ఆయన తరవాతే యెవరైనా!" అని మేజిస్ట్రేటుగారు సాక్ష్యం ఇస్తారు.

"వితరణలో ఆయనచెయ్యి మహా పెద్దది!" అని లోకలుఫండు ఇంజనీరుగారు ఒప్పుకుంటారు.

ఇంతమంది ఇన్నివిధాల యెన్నిక చేసిన మనిషిమీద ఆయన సంతానమే

కష్టంవేసిన మాట నిజమే. రాను రాను కుర్రకారు మరీ అధోగతిపాలు కావటానికి ఇదే తార్కాణం!

ఆయనమీద కత్తికట్టి కుర్రవెధవ లేమైనా బాగుపడ్డారా అంటే అదీ కనిపించదు. ఒకడు తాతగారు బతికుండగానే ఆయనకున్న ఊళ్ళోనే కాఫీహోటల్లో ప్లేట్లు అందిస్తూ, పరువు తక్కువవాళ్ళ ఇళ్ళల్లో మకాం పెట్టాడాయె. ఇంకో మనవడు కంపెనీవాళ్ళకి హార్మోనియం వాయిస్తున్నాడాయె. మరొకడు కులగోత్రాలులేని విశంతువును పెళ్ళాడి ఆ మనిషిచేత పోషింపబడుతున్నాడాయె. ఇంకో అప్రయోజకుడు ఊళ్ళో ఉన్న మోటార్లూ, ఆయిల్ ఇంజన్లూ బాగుచేస్తూ మసిగుడ్డలతో తిరుగుతాడాయె.

ఇదేనా తిరుగుబాటు? తిరుగుబాటంటే మొహంమీద కోపం వచ్చి ముక్కు కోసేసుకోవటమేనా?

ఒకణ్ణి పట్టుకుని నాలుగు ముక్కలూ రూడించి అడిగాను.

"నువు చాల పొరపాటు పడుతున్నావు" అన్నాడు వాడు. "మేం తిరుగుబాటయితే చేశాంగాని మొహంమీది కోపంతో ముక్కు కోసుకున్నమాట అబద్ధం. మాపిధి మేం నిర్వర్తిస్తున్నాం. మా ఆత్మలని మేం రక్షించుకోవటమే కాకుండా, మా పొట్టలు మేం పోసుకుంటూ ఇంతకాలానికి జీవితంలో ఆనందమేమిటో తెలిసికోగలిగాం.

"నా మటుకు నేను కాఫీహోటల్లో పనిచేస్తాను. శరీరానికి తగినంత చాకిరి పొట్టకు కడుపునిండా తిండి. నాపని అయిపోగనె హాయిగా వైట్‌రోజ్ సబ్బు పెట్టి వేణ్ణీళ్ళ స్నానం చేసి, మంచి ఇస్త్రీ మడతలు వేసుకుని, జుట్టుకి వాసననూనె రాచి మంచి సిగిరెట్టు వెలిగించి ఏ సినిమాకో పోతాను. ఈ ఊళ్ళో ఏ సినిమాకు గాని, నాటకానికి గాని, సర్కసుకు గాని నాకు టిక్కెట్టక్కర్లేదు. పన్నెండింటిదాకా పచార్లు కొట్టివచ్చి పడుకుంటే వెర్రినిద్ర పడుతుంది. కలకూడా రాదు. మళ్ళీ టంచనుగా అయిదింటికల్లా లేచి పనిలో జొరబడతాను.

"నాకేమిటి లోటు? వెనకటి ఆశ్రమంలో నాకేమీ ఉండేదికాదు—అసంతృప్తి తప్ప చేసేటందుకు పనీ లేదు. తినేటందుకు తిండీ లేదు. కాఫీకి అర్ధణా కావాలంటే రంగయ్యతాతకి తెలియాలి. సిగిరెట్టు కొనుక్కుందామంటే అసలే లేదు. ఎప్పుడూ సిగరెట్లు ముష్టే గద! దరిద్రం మందా? రంగయ్య మనమడికన్న దరిద్రుడు లేడుగద! అందరికీ నేనంటే హడలే—ఎక్కడ సిగరెట్టడుగుతానో, ఇప్పించమంటానో అని ఇతరత్రా నేనంటే ఇష్టమైన వాళ్ళక్కూడా ఈ మూలంగా నేనంటే భయం! పేరుకు మటుకు రంగయ్య మనమడు! లక్షాధికార్ల బిడ్డ . దొంగతనాలు చేసేవాణ్ణి; ఇంటిడబ్బే అనుకో! అయినా దొంగతనానికి పాల్పడిం తరవాత నా మొహం దొంగమొహమే!....ఏ విధంగా చూసినా, నన్ను చూస్తే నాకే ఏవగింపుగా ఉండేది. రాత్రిపూట నిద్రపట్టేది కాదు. పడితే పీడకలలొచ్చేవి... పైగా రంగయ్యతాత ఆజమాయిషీ! సినిమాకు పోవటానికీ లేదు. పొద్దూన అరగంటలోపల ఇంటికి రావాలి. తొమ్మిదింటికల్లా నిద్రపోవాలి. డ్రిల్లూ!

"ఇంత ప్రాణాలు బిగబట్టుకున్నా ఎప్పుడో అప్పుడు రంగయ్యతాత గౌరవానికి హానికలగనే కలిగేది... సిగిరెట్టు కాలుస్తుండగా ఎవడో పీనుగ చూడనే చూసేవాడు. ముసలాడికి చెప్పనే చెప్పేవాడు! ఇప్పుడే వెధవా చెప్పడు. కావలిస్తే ముసలాడి మొహానే పొగ విడుస్తాను....!

"మిగిలినవాళ్ళూ నా మాదిరిగా నే బాగుపడిపోయినారు గాని చెడిపోలేదు.

మావా డొకడు మంచి ఇంజనీరు. వాడికి డిగ్రీలేదు గాని ఉంటే వేలకువేలు సంపాదించును. ఎంత కొత్త యంత్రమైనా పట్టుకురా — నిమిషంలో అమర్చుతాడు. వాడి లైనులో వాడికి గొప్ప పేరు వస్తున్నది. చూస్తూ ఉండు. వాడెంత పైకొస్తాడో!....

"అవును, ఇంకోడు సంగీతంలో పడ్డాడు. వాడిచేతుల్లో సుఖం ఉంది. ఆమాట నేననటం కాదు—మంచి పాటగాళ్ళే అన్నారు. రంగయ్య తాతయ్య మీద తిరగబడిం తరవాత ఆరునెలల్లో వాడు మంచి హార్మోనిష్టయి కూచున్నాడు. లేనట్టయితే గోళ్లు గిల్లుకుంటూ కూర్చుండవలసినవాడు. వాణ్ణి సినిమావాళ్లు తీసుకుంటున్నారు. నెలకు నూటయాభై ఇస్తారట. రంగయ్య తాత వాడికి నెలకి నూటయాభై దమ్మిడీలు కూడా ఇచ్చిన పాపాన పోలేదు....

"వెధవ ముండని పెళ్లాడాడని అందరూ వాడిమీద పడి ఏడుస్తారు. ఆవిడచేసిన మహాపాపం ఏమీలేదు. బతికుండగానే మొగుణ్ణి వదిలేసింది. వాడి సంగతి అందరికీ తెలుసు. పరువైన ఆడది ఎవతెకూడా వాడితో కాపరం చెయ్యదు. వాడి ధర్మాన వాడు చచ్చాడు. ఆ తరవాత మావాణ్ణి పెళ్ళాడింది. పదెకరాల భూవసతి ఉంది. మావాణ్ణి చూచో పెట్టి మేపుతున్నది. అది చూసి ఓర్వలేని వాళ్లు అష్ణి వీటి దంటారు. వీటిదైతే లేవదీసుకు పోవటాని కెవడైనా ప్రయత్నించడేం? రెండు నగలున్నదాన్నే వదలుకదా. ఆ మనిషి చాలా మంచిది. చచ్చినా ఇంకోడి కేసి చూడదు. ఆమాట ఒప్పుకోవటం ఇష్టంలేక అసూయ కొద్దీ అడ్డమైన కూతలూ కూస్తారు. నా ఉద్దేశం — అటువంటి భార్య దొరికిన వాడెవడైనా అదృష్టవంతుడనే!....

అంతా విన్నాను.

"ఇదంతా కాదనను గాని, అబ్బాయీ, నువొక పొరపాటు పడుతున్నావు. జీవితమంటే కడుపునిండా తిండీ, ఇష్టమైన వ్యాపకమూ, అనువైన పెళ్ళామూ— ఇంతే ననుకుంటున్నావు. ఇంతకన్న విలువైన విషయాలున్నై. మాటవరసకి చెబుతున్నాను. మీ తాతగారు ఆడి తప్పని మనిషి. పేరుపడ్డ దాత. ఆతిథ్యంఇవ్వటంలో అసమానుడైన గృహస్తు—!"

నామాట పొంతం కానివ్వకుండానే రంగయ్య మనమడు గట్టిగానవ్వి, "ఎవరు చెప్పారు మీకీ అబద్ధాలు?" అన్నాడు.

"డిప్టీ కలెక్టరుగారూ, ఇంజనీరుగారూ అబద్ధాలాడుతారా. శిరస్తాదారుగారు కూడానా....ఆయన పరువు ప్రతిష్ఠల విలవ గ్రహించక పోబట్టే మీరంతా ఇట్లా చెల్లాచెదరై పోయినారు. ఇప్పటికైనా మీరు పశ్చాత్తాపపడి తిరిగివస్తే ఆయన ముసలిప్రాణం—వీక్షణాన హరీ అంటుందో మరి!—చాలా సంతోషిస్తుంది" అన్నాను.

రంగయ్య మనమడు మళ్ళీ విరగబడి నవ్వి, "మా తాతకి పరువనేది ఉందని నువ్వనుకుంటున్నావు. ఉండొచ్చు; డిప్టీ కలెక్టరుగారి దగ్గిరా శిరస్తాదారుగారి దగ్గిరా ఆయన ప్రవర్తన సరిగానే ఉండొచ్చు. కాని మా తాతకి నిజంగా పరువూ పాడూ ఏమీలేదు. పరువున్నవాడు మూడేళ్ళనాటి పాతగుడ్డలు పిగిలినందుకు చాకలాడికి డబ్బు విరగ్గోస్తాడా? పంటలు పండక రైతులు అలో లక్ష్మణా అని ఏడుస్తుంటే బకాయిపడ్డ ధాన్యానికి పత్రాలు రాయించి పుచ్చుకుంటాడా? కష్టసమయంలో ఉండిన తన నౌకరీలోకి రాలేకపోయిన కూలి వాళ్ళని పనిలోనించి తియ్యటమేగాక ఊళ్లో వాడి కెవరూ పని ఇవ్వకుండా చేసి ఊళ్ళోవించి సాగనంపుతాడా? ఈ ఊరి అలగాజనంలో మా తాత చస్తే పండుగ చేసుకోనివాళ్లుంటారా? దోపిడిచేసే దొంగ వెధవలికి పరువు ప్రతిష్ఠ లేమిటి? కష్టపడి పని చేసుకునేవాడికి పరువు ప్రతిష్ఠలూ మానాభిమానాలు గాని!

"నన్ను చూడరాదూ? నేను చేసుకునే పని దాయను. నా పిగిరెట్లు దాయను. ఆఖరికి నాముండనుకూడా దాయను కాని రంగయ్య నాకు తాత అనేది ఒకటే దాస్తాను. అదే నాకు తలవంపులు!.... నేనే కాదు. మా అందరికీ అంతే! మా పానకంలో పుడక ఆ ఒక్క ముసలాడే! ఆయన పరువు ప్రతిష్ఠల సంగతి నాకు చెప్పావు గనక నా పరువు ప్రతిష్ఠల సంగతి ఆయనికి చెప్పు. ఆయన్ని త్వరగా చచ్చిపొమ్మను. ఆయన ఒక్కడే.

మందిమి సంతోషిస్తాం....ఆఖరుకు డిప్టీ కలెక్టరుగారయినా అదే ఏడుస్తా రను కోను!"

ఈ మాటలు వింటుంటే నాకేమనాలో తెలీలేదు.

"అబ్బాయీ, ఇదంతా నేను మీ అందరి శ్రేయస్సు కోరే చెప్పాను. గనుక మరోవిధంగా అనుకోకు! మీరంతా నిజంగానే సుఖంగా ఉంటే నేను మరేమీ మాట్లాడను. నా ఉద్దేశంకూడా మీరూ మీరూ సుఖంగా ఉండాలనే .... కాని మరొక్క విషయం అడుగుతాను చెప్పు; మీరంతా ఈ విధంగా నిరాధారపు జీవితాలు జీవిస్తున్నారు కదా; మీలో ఎవడైనా రెండు రోజులు పడక వేస్తే మీ గతేమిటి? అదైనా ఆలోచించారా?" అన్నాను.

రంగయ్య మనమడు జేబులోవించి అయిదురూపాయిల నోటొకటి తీసి, "ఆలోచించేటందుకేముందీ ఇదిగో, ఈ అయిదురూపాయలూ మావాడి కొకడికి మనిఆర్డరు చెయ్యబోతున్నాను. వాడేదో ఖర్చులో ఉన్నానని రాశాడు. మిగిలిన వాళ్లుకూడా తలాకాస్తా పంపుతారు. మాలో ఏ ఒక్కణ్ణీ మిగిలినవాళ్లు చూస్తూ చూస్తూ చావనివ్వం....అసలురహస్యం మీ కర్థం కాలేదు. మేం రంగయ్యతాతతో ఊరికే పోట్లాడి ఇవతలికి రాలేదు. శాస్త్రీయంగా ఆ ముసలాడి మీద తిరుగుబాటు చేశాం!" అన్నాడు.

"వెళ్ళిరా, బాబూ! మీరే గెలిచారు, సందేహం లేదు" అంటూ నా దారి

# చీకటి దారి చుట్టు ఎడారి



"అందం ఆడవాళ్ళ సొత్తయితే అనుభవించడం నావంటివాళ్ళ హక్కు! లోకం గొడ్డుపోలేదు, నిన్నే సొంతంగా ఉంచుకోడానికి. ఊళ్ళో సవాలక్షమంది ఆడవాళ్ళని అనుభవిస్తాను. అందర్నీ పెళ్లాలుగా చేసుకుని వాళ్ళని పోషించడానికి నేనేం శ్రీకృష్ణపరమాత్ముడ్ని కాను....పో యిక్కడ్నుంచి... పోతావా పోవా....?"

"ఫణిబాబూ....నా బ్రతుకు అన్యాయమైపోయింది. నేనిప్పుడు పట్టిమనిషినికూడా కాదు. కడుపులో మీ రూపం కదులుతుంది. నా నూరేళ్ళ జీవితాన్ని కూల్చేస్తున్నది. ఇప్పుడు మీరు కాదంటే నాకు చావే గతి. నన్ను బ్రతికించండి. ప్రాణభిక్ష పెట్టండి...."

"రాధా... నీ ఏడ్పులకి పెడబొబ్బలకి నా గుండె కరగదు. అనవసరంగా ఆయాసపడకు. అంతగా ప్రాణంమీద తీపి వుంటే లోకంలో అనేక మార్గాలున్నాయి. రహస్యంగా వెళ్ళి ఏ డాక్టర్నన్నా చూడు. నీ కింక ఏ సమస్యా వుండదు ..."

"ఫణిబాబూ....నువ్వు నా ప్రాణానివి నువ్వు లేకపోతే నేను లేను...."—అని మాటల్తో మైమరపించిన నా ఫణిబాబేనా, ఈ మాటలంటుంటా? నిన్ను పెళ్లి చేసు

కుంటానని దేవునిసాక్షిగా వరమిచ్చిన నా ఫణిబాబేనా ఈనాడింత నిర్దయగా మాట్లాడుతున్నారు? ఫణీ.... మీ మనసింత పాషాణంగా ఎలా మారిపోయింది? మీరింత నిర్దాక్షిణ్యంగా ఎందుకు మారిపోయారు?..మీరిలా తిరస్కరిస్తారని... ఇంతగా హింసిస్తారని కలలోకూడా అనుకోలేదు....ఈ రంపపుకోతని యెలా భరించను ఫణీ ...ఎలా భరించను? మీ మాటల్ని నమ్మి సర్వస్వాన్ని అర్పించి నందుకు ఇదా ప్రతిఫలం? మిమ్మల్నే దైవంగా ఎంచుకుని నిత్యమూ ఆరాధిస్తున్న నాకు మిగిలింది ఇంతేనా? ఫణీ, మీరెందుకింతగా మారిపోయారు? నామీద ఎందుకింత కక్ష వహిస్తున్నారు....పోనీ, చెప్పండి...నేనేదైనా అపరాధం చేశానా?"

"అవును. నేసింది అపరాధమే. అందుకే అనుభవిస్తున్నావు. అంత సులువుగా నాకు మనసిచ్చావే....? అంత తొందరగా నాకు లొంగిపోయావే..? నువు నాకే మనసిచ్చావని నమ్మకమేమిటి? నీ కడుపులో బిడ్డ నా బిడ్డేనని రుజువేమిటి?"

ఫణిబాబు మాటలు మాటలులా లేవు. ఈటెల్లా దిగుతున్నాయి. శూలాల్లా గుచ్చుకుంటున్నాయి. రాధ గుండెల్లో గునపాలు దిగేసి కెలుకుతున్నట్టుగా అనిపిస్తున్నది. అల్లల్లాడిపోతుంది రాధ. పెనుగాలిలో చిగురుటాకులా నిలువెల్లా వణికిపోతుంది.

ఫణిబాబు నోటినుండి అంతంతటి మాటలు వస్తాయని ఆమె ఏనాడూ ఊహించలేదు. ఫణిగురించి ఆమె ఎన్నెన్నో కలలు కన్నది ఎన్నెన్నో ఆశాసౌధాలు నిర్మించుకున్నది. అవన్నీ పటిష్టమైనవి అనుకున్నది పవిత్రమైనవి అనుకున్నది కాని, ఈనాడేమిటి, ఇలా జరుగుతున్నది? తన ఆశలన్నీ పేకమేడల్లా కూలిపోతున్నాయి... తన జీవితం అగాధంలోకి చొచ్చుకుపోతున్నది. భవిష్యత్తంతా అంధకారమయమైపోతున్నది.

ఈ ఫణిబాబు తను ప్రేమించిన ఫణిబాబేనా? తనకి మనసిచ్చిన మనోహరమూర్తియేనా?

ఫణిబాబు ఉత్తముడనుకున్నదే? ఉత్తమాదర్శాలు కలవాడనుకున్నదే? యువతరానికి ఆదర్శమూర్తి అనుకున్నదే? తనకి భగవంతుడు ప్రసాదించిన వరమనుకున్నదే?—తన నమ్మకాన్ని వమ్ము చేస్తూ ఫణిబాబు ఇలా ఎందుకు మారిపోయాడు? పేరును సార్థకం చేసుకుంటూ ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడు?

—ఈ ప్రశ్న ఆమె హృదయంలో చేయిపెట్టి దేవుతున్నది. ఆమెను యివునా దహించివేస్తున్నాయి. ప్రత్యుత్తర మివ్వలేక పోతున్నది. అబలగా, అశక్తురాలిగా కంటికి మింటికి ఏకధారగా ఏడ్వటంకంటె ఆమె ఏమీ చెయ్యలేకపోతున్నది.

"ఛీ....ఏమిటీ గోల..? నా ప్రశ్నని నీ ఏడుపుతో సమాధానపరుద్దామను

కుంటున్నావేమో....అదేమీ కుదరదు.... ప్రపంచం చాలా విశాలంగా వుంది.... నాకంటే విశాలమైన హృదయమున్న వాళ్ళూ, నీలాంటి అందగత్తెలకి లోటుం డదు....వెళ్లు....వెళ్ళిక్కడినుంచి....

'ఫణీ....!''

అన్న కేకలో నరనరాలూ ఆమెలోని బాధని ...ఆవేదనని....అవమానాన్నీ ఆవే శంగా వ్యక్తంచేశాయి.

''ష్ .... ఎందుకలా అరుస్తావ్ .... నువు అరచీ ప్రయోజనంలేదు. బెదరించీ లాభం లేదు .... దిక్కున్న చోటు చూసుకో... వెళ్ళు....''

''వెళ్ళను .... నాదిక్కు మీరే, నా చోటు ఇక్కడే....మీరు కాదన్నా నేను మీ భార్యనే. మీరే నాభర్త. నామీద మీకు అన్ని అధికారాలూ వున్నాయి.... అన్ని హక్కులూ వున్నాయి. నన్ను చంపండి. పీక నులిమి పారెయ్యండి. నేను మీదాన్ని. నా సర్వస్వాన్ని మీకు ఎప్పుడో అర్పించాను. ఇప్పుడు నా ప్రాణాన్ని కూడా ఇవ్వడానికి సిద్ధంగా వున్నాను....తీసుకోండి....''

రాధలో ఏదో మొండి ధైర్యం వచ్చింది. పిచ్చి ఆవేశమొచ్చింది. ఆ నాటితో తన బ్రతుకు అటో ఇటో తేలి పోవాలి అన్న దీక్షతో వున్నట్టున్నది. అతని కాళ్లు పట్టుకున్నది. బ్రతిమలాడు కుంటున్నది. ప్రాధేయ పడుతున్నది. రాళ్లు కరిగేలా ఏడుస్తున్నది.

ఫణిబాబులో చలనం లేదు. ఆమె చేతులు వాటేసుకున్న తన కాళ్ళని గింజు కుంటున్నాడు విదిలించుకోపోతున్నాడు.

''వదులు....పో. ఇవతలికి పోతావా పోవా....'' అంటూ ఆమెని చేతులతో విసిరిపారేశాడు. ఆమె మెట్లమీదనుంచి దొర్లి క్రింద పడింది. మరొక్షణంలో తలుపులు దభేలుమన్నాయి!

తలుపుల్ని అదిమిపట్టి నిలబడిన ఫణి బాబు పెదాలను అతని పళ్లు గట్టిగా నొత్తి పట్టాయి. కోపమో, బాధో తెలియదు. అతని పై పెదవి వూరికే కంపించిపోతు న్నది. రాగరంజితాలైన కళ్ళని గట్టిగా మూసుకున్నాడు. అవతల తలుపులు దబ దబా బాదిన చప్పుడు వినిపిస్తున్నది. అతని గుండెల్లో గంటలు వాయిస్తున్నట్ట యింది. భరించుకోలేక అస్వస్థతగా—ఏమి చెయ్యాలో పాలుపోని స్థితిలో సతమతమై పోతున్నాడు.

''ఫణీ!''

—ఎవరో గర్జించినట్టయింది. రాధ మాత్రంకాదు! కళ్ళువిప్పి చూశాడు. ఎదురుగా అతని మాతృదేవత, జానకి!

ఆమె ఇంట్లోనే వున్నది. ఇంతవరకు జరుగుతున్నదంతా ఆమె గమనిస్తూనే వున్నది. ఆమె గమనిస్తుందన్న విషయం ఫణిబాబుకి తెలియకపోలేదు!

తల్లి ఆశలు తీరగా తను ఎదిగి పోయే దన్నవిషయం ఆమెకి అర్థం కావాలి ఆమె సంతోషించాలి. ఆమెని సంతృప్తి

పరచాలి. ఇది అతని కోరిక. ఇప్పటి తన ప్రవర్తన తల్లిని బాగా సంతృప్తి పరచుతుందనుకున్నాడు.

కాని. అలాజరగలేదు. అతను ఆశించిన విధంగా జరగలేదు.

జానకి అతని ఎదురుగా రౌద్ర మూర్తిలా రుద్రకాళిలా నిలబడి వుంది. అతను చేసినపని ఆమెని సంతోష పెట్టి నట్లుగా లేదు. విపరీతమైన ఆవేశాన్ని తెచ్చిపెట్టింది.

ఆ రూపంలో తల్లిని ఇదివరకు ఎన్నడూ చూసి ఎరగడు ఫణిబాబు. అతను భయంతో గిజగిజ లాడాడు.

జరిగిన సంఘటనకి జానకి ఉడికి పోతున్నది. కొడుకు ప్రయోజకత్వానికి ఆమె మురిసిపోవడం లేదు. మరిగి పోతు న్నది. ఆమెరక్తం సలసలా కాగి పోతున్నది.

ఆ ఆవేశంలో ఏంచేస్తున్నదో ఆమెకే తెలియలేదు. వొళ్ళు మరచిపోయిన వుద్రేకంలో ఫణిబాబు చెంపల్ని వాయ గొట్టింది. చేతులు నెప్పి పుట్టేదాకా— అతని చెంపలు కెంపులయ్యేదాకా విడిచి పెట్టలేదు.

చిత్రం!

ఫణిబాబుకి చీమకుట్టినట్టేనా లేదు. తల్లి అంతగా నొచ్చుకున్నందుకు గాని తనని నొప్పిస్తున్నందుకు గాని అతనికి బాధలేదు పైగా—అతని ఆనందం కట్టలు తెంచుకు ప్రవహించింది.

ఆమె అలా శిక్షించడంకోసమే ఎదురు చూస్తున్నట్టుగా — ఆనాటితో తనలో గూడుకట్టుకునివున్న దిగులంతా దిగిపోయి నట్టుగా—తన జీవితం ధన్యమైపోయి నంతగా సంతోషించాడు ఆనందం ఉప్పొంగి రాగా—ఆనంద బాష్పాలు వర్షిం చగా "అమ్మా" అంటూ ఆమెని కౌగ లించుకుని ఆనంద పారవశ్యంలో ఏడ్చే శాడు.

ఆ ఏడుపుకి అర్థమేమిటో జానక్కి తెలియదు. అర్థం చేసుకునే శక్తి ఆమెకి లేదు. తను కొట్టినందుకు ఏడుస్తున్నాడా. అనుకుంది. ఆ ఏడుపు ఆమెని కరిగించ లేదు. కోపాన్ని ద్విగుణీకృతం చేసింది. ఫణి ఆమెని "అమ్మా" అని పిలవడం హతకురాలిని చేసింది. వొంటిమీద తేళ్లూ జెర్రులూ ప్రాకుతున్నట్టు అనిపించింది. ముళ్ళమీద నిలబడినట్టు అనిపించింది.

"ఛీ....! దుర్మార్గుడా. నువు నన్ను అమ్మ అంటున్నావా? ఎవరురా నీకు అమ్మ....? నేను నీకు అమ్మనా? ఏ ముఖం పెట్టుకుని పిలుస్తున్నావు...? నీలాంటి నీచుడు ఇలాంటి పవిత్రమైన చోటున వుండడానికి తగడు....వెళ్లు... పో అవతలకి .... జూదగాళ్లు .... తాగు బోతులు .... ప్రపంచంలో చాలామంది వున్నారు. దోపిడీముఠాలు, నీలాంటి— నీతి జాతీ లేని మనుషులూ కోకొల్లలుగా వున్నారు. వెళ్లు ...వాళ్ళతోపాటు నువ్వూ ఒకడివై నీ యిష్టానుసారం సంచరించు.




మవ్వింక ఒక్క క్షణంకూడా యిక్కడ వుండడానికి వీల్లేదు. మళ్ళీ నా కంట బడ్డావంటే నీ కళ్ళముందే ఉరిపోసుకు చస్తాను....పో అవతలకి....''

అంటూ హుంకరించింది జానకి. ఇది ఆమె ఒక్కనాటి ఆవేశం కాదు. ఒక్కనాటి ఆవేదన కాదు. తరతరాలనుంచి యుగయుగాలనుంచి ఆమెలో జీర్ణించుకుపోయిన కశగా—ఆమెలో కరడు కట్టుకుపోయిన ద్వేషంగా ప్రజ్వరిల్లుతున్నది. ఇంతకాలమూ ఆమె హృదయంలో దాచుకున్న అగ్నిపర్వతం బ్రద్దలైపోయింది. లావాలాంటి హృదయావేదన వెల్లువలై ప్రవహింపసాగింది.

ఇంతటి శిక్ష కన్న కొడుక్కా? తొమ్మిదినెలలూ భరించి కని పెంచిన కొడుకు ఆమెకి గర్భశత్రువైపోయాడా? ఏమిటీ వైపరీత్యం? ఏమిటీ సృష్టి విచిత్రం?

జానకి అవతారం చూసి, ఆమె హావభావాలు గమనించి చప్పగా చల్లారిపోయాడు ఫణిబాబు....తన ఉనికి ఆమెకి మృత్యువుగా పరిణమించడం అతనికి ఇష్టంలేదు. తన మూలంగా కన్నతల్లి మరణం సంభవించడం అతను భరించుకోలేడు.

తల్లిని శాంతింపజేసే శక్తిగాని, ఆమెని క్షమించమని ప్రార్థించే ధైర్యంగాని ఫణిబాబుకు లేదు. తన దౌర్భాగ్యానికి తల్లడిల్లిపోతూ — అడుగులో అడుగు వేసుకుంటూ మౌనంగా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

అతను ఏమైపోయినా లెక్కలేనంత నిర్లక్ష్యంగా వుంది జానకి.

ఫణి అక్కడనుంచి తప్పుకోగానే తలుపులు తీసింది. తియ్యగానే ప్రత్యక్షమైన రాధని చూసింది. చూసి అమాంతం ఆమెని కావలించుకున్నది. కావలించుకుని ఏడ్చేసింది.

ఆ కష్టం రాధకు వచ్చినట్టుగా లేదు. తనకే వచ్చినట్టుగా బాధ పడిపోతున్నది జానకి.

రాధ రాధగా కనిపించడంలేదు. ఫణి ఫణిగా అనిపించడంలేదు. రాధ ముఖంలో తమె ముఖాన్ని చూసుకుంటున్నది ఫణి మాటల్లో భుజంగం మాటలు ధ్వనించసాగాయి. రాధ స్థానంలో తనూ—ఫణి స్థానంలో భుజంగం ఆ సంఘటనని ఎదుర్కొంటున్నట్టుగా అనిపించింది!

ఈ నాడు రాధ అనుభవిస్తున్న నరకయాతనే ఆనాడు తనూ అనుభవించింది. సరిగ్గా ఇలాంటి దారుణ సంఘటననే తనూ ఎదుర్కోవలసి వచ్చింది. ఇప్పుడు రాధని ఆదుకోవడానికి—ఆమెని ఆదరించడానికి తను సిద్ధంగా వుంది. ఆనాడు తనకి ఎవరూలేరు. ఒంటరిగా జీవితంతో పోరాటం సాగించింది కనీసం సానుభూతి వచనాలు పలికిన సాటివాళ్లుకూడా లేకపోయారు. ఏకాకిగా అనాధగా బ్రతుకును ఈడ్చడానికి ధైర్యం వహించింది. భుజంగా—తన కష్టంతో పోల్చుకుంటే రాధది ఒక కష్టమేకాదు.

తను ఏమైతే ఎంచుకుని ఫణికి ఆపేరు పెట్టిందో—ఆ పేరు అక్షరాలా సార్థకమైంది. పాము కడుపున పాము పిల్లే పుడుతుంది గాని పావురం పుడుతుందా? తండ్రికి తగిన కొడుకు అనిపించుకుంటున్నాడు ఫణి....తండ్రిలో ప్రవహించిన విషపు రక్తమే ఫణిలోనూ ప్రవహిస్తున్నది.

ఫణి ప్రవర్తనా—మాటల తీరు—ఆ దుర్మార్గం—ఆ దుష్టస్వభావం—అంతా ఆ తండ్రిదే. ఆ తండ్రి ఒక పెద్ద దుర్మార్గుడయితే ఈ కొడుకు మరో పరమ దుర్మార్గుడు. తండ్రిని మించిన కొడుకైపోయాడు....

ఫణి ప్రవర్తన జానకిని బాగా ఆశ్చర్యపరచింది. అతని మాటలు మరింత అద్భుత మనిపించాయి.

సరిగ్గా పాతికేళ్ళ క్రితం ఆమె ఇలాంటి సంఘటనకే గురికావలసి వచ్చింది. ఇలాంటి దారుణ చర్యకే బలికావలసి వచ్చింది.

ఫణిస్థానంలో భుజంగం ఆనాడు ఇవే మాటలన్నాడు. ఇదేమాదిరిగా ప్రవర్తించాడు. ఇప్పటికీ ఆ సంఘటన ఆమె కళ్ళముందు మెదుల్తున్నది భుజంగం మాటలు చెవుల్లో గింగుర్లు పెడుతున్నాయి.

"అందం ఆడవాళ్ళ సొత్తయితే అనుభవించడం మగవాళ్ళ హక్కు. లోకం గొడ్డుపోలేదు. నిన్నే సొంతంగా



యువ

వుంచుకోడానికి. వూళ్లో సవా లక్షమంది ఆడవాళ్ళని అనుభవిస్తాను. అందర్నీ పెళ్ళాలుగా చేసుకుని పోషించడానికి నేనేం శ్రీ కృష్ణ పరమాత్మడ్ని కాను. ఫో యిక్కడ్నుంచి....''

ఆనాటి భుజంగం మాటలు ఆమె మరచి పోలేదు. ఆమె జీవితాన్ని నరక కూపంలోకి దింపిన ఆనాటి దుస్సంఘటన ఆమె పిందు జీవితానికి గొడ్డలి పెట్టు. అంతటి పరాజయాన్ని ఆమె ఎలా మరచి పోగల్గుతుంది?

ఆమె అప్పటికి గర్భవతి! సరిగ్గా ఆమెదికూడా రాధ పరిస్థితే!

తన పరిస్థితిని వెళ్ళబోసుకుంది. దయ చూపమంది. ప్రాధేయపడింది. ఏడ్చింది మొత్తుకుంది. ప్రయోజనం లేకపోయింది. భుజంగం కరగలేదు. అణుమాత్రమైనా చలించలేదు

విస్పహాయగా, నిస్తేజంగా చేతలుడిగి కుప్పకూలి పోయింది. భవిష్యత్తంతా అంధకారం బంధురంగా కనిపించింది. ఉన్న కొద్ది ఆశా అంతరించి పోయింది. శాపోపహతురాలిగా మిగిలిపోయింది.

భుజంగం ఆమె జీవితాన్ని కాలరాచి పారేశాడు. నలుగుర్లోనూ తలెత్తుకో కుండా చేశాడు. బ్రతుకుమీద ఆశని చంపేశాడు. చంపేసి వికటాట్టహాసం చేశాడు. అసలు సిసలైన కసాయివాడని పించు కున్నాడు. ఆమెకి కనుమరుగై పోయాడు. పిరికి వాడిలా పారిపోయాడు.

జానకి హృదయం నీరసంగా మూల్గింది. ''భగవాన్ ఏమిటి నాకీశిక్ష..? నేనేం పాపం చేశాను .... నన్నెందుకిలా హింసిస్తున్నావు....?'' అంటూ కనబడని దేవుడ్ని తలుచుకుని విలపించింది.

*  *

''బాబాయిగారూ .... నేను వెళ్ళిపోతు న్నాను. నాకు సెలవు ఇప్పించండి....''

అన్నాడు ఫణి. తల్లిచేతులు నొప్పి పుట్టించి నరాసరి బాబాయిగారున్న రీడింగ్ రూంలోకి వచ్చేశాడు.

అతని మాటలు వినీవినగానే చటు క్కున వెనక్కి తిరిగింది ''వీల్ ఛైర్!'' ఆ వీల్ ఛైర్‌లో కూర్చుని నోట్లో పైపు నోట్లోనే వుంచుకుని. చేతులో పుస్తకం చేతులోనే వుంచుకుని తెల్లబోయి చూస్తున్న ఆ బాబాయిగారి పేరు పట్టాభి రామారావుగారు,

పట్టాభి రామారావుగారికి నడవడానికి కాళ్ళయితేలేవు గాని....కావలసిన సంపద వుంది. గొప్ప మనసు వుంది,

ఆదిలో, ఫణిబాబు ఆయన్ని బాబు గారూ అనేవాడు. పట్టాభికి అది ఇష్ట ముండేది కాదు, ఫణిని ఒప్పించి ''బాబాయిగారూ'' అని అనిపించుకుంటు న్నాడు.

ఫణికి ఫణిదృష్టిలో తల్లి వున్నా లేనట్టే లెక్క, తండ్రి లేకపోయినా—తల్లినీ తండ్రినీ పట్టాభి రామారావులో చూసుకో గల్గుతున్నాడు.

"ఏమిటి, ఏం జరిగింది?"

అన్నారు ఆశ్చర్యంలోనుంచి తేరుకుని పట్టాభి.

ఫణి సమాధానం ఇవ్వలేకపోయాడు. రెండు చేతుల్తోనూ ముఖాన్ని కప్పుకుని ఏడ్వసాగాడు.

ఆ దృశ్యం పట్టాభిని కలచివేసింది. ఫణి ఈరోజు ఏమిటో కొత్తగా కనిపిస్తున్నాడు. మానసికంగానూ, శారీరకంగానూ బాగా నలిగిపోయినట్లుగా వున్నాడు అనుకున్నాడు. ఏమి జరిగిందో తెలియదు గాని, ఏదో జరిగివుంటుందని మాత్రం పసిగట్టాడు.

వెంటనే వీల్‌ఛైర్ చక్రాలు వేగాన్ని అందుకున్నాయి. మరుక్షణంలో ఫణి దగ్గరకి చేరాయి.

"ఏం జరిగింది బాబూ...."

అన్నారాయన అతని వీపును రాస్తూ.

ఫణి, ఆ ఆప్యాయమైన పలకరింపుకు పులకరించిపోయాడు. ఎడారిలో వాయా సిస్సులా అనిపించాయి ఆయన మాటలు. అమాంతం ఆయన మోకాళ్ళమీదకి ఒరిగి పోయాడు. ఆయన వొళ్ళో తల వంచుకుని ఏడుపుని ఆపుకోడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

పట్టాభి అతని తల నిమిరాడు వాత్సల్య పూరితంగా.

"ఏం జరిగింది నాయనా? ఇవ్వేళ ఎందుకంతగా కలతపడుతున్నావు.... ఏమయింది?"

అంటూ అడిగారు.

"జరక్కూడనిదే జరిగింది బాబాయి గారూ .. అమ్మకి కోపం తెప్పించాను.... ఎప్పుడూ లేనంతగా బాధపెట్టాను ..."

అంటూ వెక్కిళ్లతో చెప్పుకుపోయాడు ఫణి

ఆ మాటలు పట్టాభిని అంతగా కదిలించినట్టు లేదు. ఆయన చాలా తేలిగ్గా తీసుకున్నారు. పైగా పెదవులమీద చిరునవ్వు చిందించారు. చిందించి—

"అంతే కదా..., ఇంకా ఏమిటో అనుకున్నాను ? మీ అమ్మకి కోపం రప్పించడం — మీ అమ్మ బాధపడ్డం ఇవ్వేళ ఏమీ కొత్తగాదుగా .... ఎందుకంతగా కలవరపడుతున్నావు .... అంతా చక్కబడుతుంది....నువు వూరుకో...."

అన్నారు

తల్లీకొడుకుల మధ్య కలతలు ఈ నాటివి కాదు. ఫణి పుట్టుకనుండీ వస్తున్నవే ...ఎప్పుడూ వుండేవే ఇది తెలిసిన పట్టాభి ఫణి మాటల్ని తేలిగ్గా తీసుకోవడంలో అర్థం లేకపోలేదు.

"కాదు, బాబాయిగారూ .... ఇది ఎప్పుడూ జరిగే గొడవలాంటిది కాదు. చాలా తీవ్రమైనది.'

"ఊరుకుందూ. నాకేమిటో కొత్తగా చెబుతున్నావేమిటి? మీ అమ్మా నువ్వూ ఇలాంటి తీవ్రమైన గొడవల్లో ఎన్నిసార్లు చిక్కుకోలేదు. అయినా మీ అమ్మకి చీమ కుట్టినా పాము కరిచినంతగా బాధపడ

యువ




తావు....ఎందుకు ఫణీ....? ఆమె మనసు మరల్చుకోనీ .. నిన్ను కొడుగ్గా ఆదరించే మంచిరోజులు రానీ .... అప్పుడు మీ అమ్మని పువ్వుల్లో పెట్టుకుని పూజించుదువు గాని ... అంతవరకు ఓపిక పట్టు ..''

''ఆ మంచిరోజు వచ్చేసింది బాబాయి గారూ. ..ఆ మంచిరోజు వచ్చేసింది.... మా అమ్మ నన్ను కొట్టింది....''

అన్నాడు ఆనందంగా ఆవేశంగా ఫణి!

అందుకు పట్టాభి చలించలేదు. ప్రతిగా నవ్వి. పైపు నోట్లో పెట్టుకున్నారు. ఆయన్ని గమనించినట్టు లేదు ఫణి. తన ఆవేశంలో చెప్పుకుపోతున్నాడు....

''మా అమ్మ నన్ను కొట్టింది బాబాయి గారూ .. తప్పుపని చేసినందుకు శిక్షించింది .... నేను తప్పుపని చేసినందుకు శిక్షించింది....''

ఫణి మాటలకి పట్టాభి ఉలిక్కిపడ్డారు. ఆయన నోట్లోని పైపు జారి క్రింద పడింది. నోరు తెరచి—

''నిజమా?'' అన్నారు.

ఏదో జరగరానిది జరిగిపోయినట్టు ఆశ్చర్యపోయారు.

''నిజం బాబాయిగారూ...నిజం. కానీ, ఈ శుభసమయంలో నే ఇల్లు విడిచిపెట్ట వలసి వస్తున్నది అమ్మకీ మీకూ దూరమై పోవలసి వస్తున్నది. అందుకే విచారంగా వుంది....''

అన్నాడు ఫణి తల దించుకుని....

''ఎందుకు ఫణీ .... అలా యెందుకు జరిగింది....?''

అన్నారు ఆశ్చర్యంగా నే పట్టాభి.

"మా అమ్మ నా ముఖం చూపించవద్దంది....నా ముఖం కనపడితే చచ్చిపోతానంది....బాబాయిగారూ....మా అమ్మ చావును నేను చూడలేను....మా అమ్మ బ్రతికివుండాలి. వెయ్యేళ్ళు వర్ధిల్లాలి....నాకు సెలవు ఇప్పించండి....నేను వెళ్ళిపోతాను...."

అంటూ వేడుకున్నాడు ఫణి.

పట్టాభికి ఆ మాటలు దిగ్భ్రమ కలిగించాయి. ఇది కలా? నిజమా? అన్నంత ఆశ్చర్యంలో వున్నారాయన.

"ఫణీ....నువ్వు తొందరపడకు. నేను కనుక్కుంటాను. ఇప్పుడే కనుక్కుంటాను...." అంటూ చేయిదగ్గరున్న కాలింగ్ బెల్‌ని నొక్కారు.

"లేదు బాబాయిగారూ....మా అమ్మ నిర్ణయానికి తిరుగులేదు. నేను ఈ యింటిని విడిచిపెట్టడంకంటె గత్యంతరం లేదు. ఈ నాటితో ఈ యింటికి నాకూ ఋణం చెల్లిపోయింది. బాబాయిగారూ ... అమ్మ ఆదరణకి దూరమై అల్లల్లాడిపోయే నాకు మీ చల్లని నీడని ప్రసాదించారు. తల్లీ తండ్రీ దైవం అన్నీ మీరే అయి నన్నె ఇంతవాడ్ని చేశారు. నన్నొక మనిషిని చేశారు. మీరే గనక నన్ను ఆదుకొనకపోతే అడవిలో క్రూరమృగానికీ నాకూ ఏమీ తేడా వుండేదికాదు.... మంచి అంటే ఏమిటో మీవల్ల తెలుసుకున్నాను....మంచి గుణాలు అంటే ఎలా వుంటాయో మీద్వారా తెలుసుకున్నాను. మంచి ప్రవర్తన అంటే ఏమిటో మీరు నాకు బోధించారు. నన్ను మా అమ్మ ఈ సంఘానికో చీడపురుగుగా తయారు చెయ్యాలనుకున్నది. మీరు మనిషిలా మీలో కలుపుకున్నారు. మీరు దేవతలు. మీ ఆదరణని మీ వాత్సల్యాన్నీ ఎన్ని జన్మలెత్తినా మరచిపోలేను. మీవల్ల నా జీవితం పునీతమైపోయింది. మీ దయవల్ల నాకు నేనుగా నిలబడగల శక్తి ఏర్పడింది. ఇప్పుడు నేను ఎక్కడికి వెళ్ళినా—ఏం చేసినా ఏ సజ్జనుడికీ తీసిపోను. ఇదంతా మీ చలవ నా గురించి మీరు బాధపడకండి. నాకిప్పుడు ఏ దిగులూ లేదు. లోకంలో కనీసం మామూలు మనిషిగా అన్నా చలామణీ అయ్యే అర్హతలు నాలో వున్నాయి. వాటిని నేను కాపాడుకుంటాను. మా అమ్మ కోరిక ఏదయినప్పటికీ, మా అమ్మ ఆశయం ఏదయినప్పటికీ మీ మనిషిగా—మీ మనసులా—నేనెలాంటి నీచానికీ పాల్పడను. మీకు హామీ ఇస్తున్నాను. నన్ను నమ్మండి ...కాని, నాదొక్కటే విచారం. మా అమ్మ నన్ను శిక్షించే స్థితికి వచ్చినప్పుడు—నేను తప్పుచెయ్యగా దండించే భాగ్యం అబ్బినప్పుడు—నేను కలలుకన్న రోజులు సమీపించినప్పుడు ఆ అదృష్టానికి దూరమైపోతున్నాను...అదీ నా బాధ..."

—అంటూ ఒక్క క్షణంకూడ అక్కడ వుండకుండా వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు ఫణి.

"ఫణీ....ఫణీ...." అన్న పట్టాభి పిలుపు గాలిలో కలిసిపోయింది.

* *

బాణంలా దూసుకు పోతున్న ఫణి— పట్టాభి పిలుపుతో తన తల్లి అతని దగ్గరికి వెళ్ళడాన్ని గమనించాడు. ఒక్కసారి వెనుతిరిగి చూశాడు. కాని, అతను ఆశించినట్టుగా జానకి అతన్ని చూడలేదు చూసికూడా చూడనట్టే పట్టాభి రీడింగ్ రూమ్ వైపు వెళ్ళిపోయింది.

ఫణిలో నీరసం ఆవహించింది. అడుగులో అడుగు వేసుకుంటూ బయటి గుమ్మందాకా వచ్చాడు. గడపదాటుతూ అనుకున్నాడు—

"ఈ రోజుతో ఈ యింటికీ నాకు చెల్లు"—అని. అనుకుంటూనే గడప దాటబోయాడు.

ఎవరో వెక్కుతూ ఏడుస్తున్న ధ్వని సన్నగా వినిపించింది. ఇంకెవరు? రాధే అయివుంటుంది!

ఫణి కాళ్ళకు బంధాలు పడ్డాయి. అడుగులు తడబడ్డాయి. తటపటాయించాడు ముందుకీ వెనుకకీ వూగిసలాడాడు.

బాబాయి గారికి ఇది నీతులు వల్లెగించాను ...నేను పశువునా? మనిషినా? అని అనుకోలేకపోతున్నాను. అతనిలో ఆర్ద్రత మేల్కొన్నది.

అయస్కాంతాన్ని చేరుకొన్నట్టుగా చేరుకున్నాడు రాధని.

ఆమెని గట్టిగా వాటేసుకొని భోరుమన్నాడు.

"నేను చెయ్యరాని తప్పు చేశాను.... నన్ను క్షమించు రాధా...."

అన్నాడు ఉద్రేకంతో అంతులేని పశ్చాత్తాపంతో.

రాధ అతని ప్రవర్తనకి స్థాణువులా నిలబడి పోయింది. కలా? వైష్ణవ మాయా? అన్న నిజానిజాల తలంపులో వుక్కిరి బిక్కిరై పోయింది.

ఏమైతేనేం ఆమె ఆశ తీరింది. ఆమె జీవితం ధన్యమైపోయింది. ఆమెకి కావలసింది అదే!

క్షణంలో ఆమె కన్నీళ్ళు ఆనందాశ్రువులై పోయాయి. ఆనంద పారవశ్యంలో ఆమె తన్ను తాను మరచి పోయింది. అతని పాదాల మీదికి వొరిగిపోయి—

"నా దైవం కరుణించాడు, నన్ను అనుగ్రహించాడు" అన్నది.

ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన రాధని అంతగా హింసించినందుకు ఫణి పరితపించిపోయాడు.

"రాధా ...నువ్వు బాధపడతావని నాకు తెలుసు రాధా....నాకు తెలుసు. కాని, అనివార్య కారణాలవల్ల నేను అలా ప్రవర్తించవలసి వచ్చింది. నన్ను క్షమిస్తావు కదూ....? నీ సుతి మెత్తని హృదయాన్ని రాక్షసుడిలా నలిపి వేశాను. ఎంత బాధపడిపోయి వుంటావో? ఎంతగా అల్లల్లాడిపోయి వుంటావో? తలుచ

కుంటేనే భయంగా వుంది....''

అతని మాటలు రాధని సంభ్రమాశ్చర్యాలలో ముంచివేశాయి. ఏది నమ్మాలో ఏది నమ్మకూడదో ఆమెకి అర్థం కావడం లేదు.

''అయితే మీరు ఇప్పటిదాకా ఆడిందంతా నాటకమా...?''

అనడిగింది సందేహనివృత్తి చేసుకుందామని.

''నాటకంకాదు....మన ప్రేమకి ఒక పరీక్ష....!''

''పరీక్షా....? ప్రాణాలతో చెలగాటమా? అంత భయంకరమైన పరీక్షా? నేనెలా భరించగలననుకున్నారు ...?''

''నువు భరించలేవని నాకు తెలుసు రాధా....మా అమ్మ ఎదుట అలా నటించవలసి వచ్చింది. ఏం చెయ్యను?''

''మీ నటన మీ అమ్మగారిని ఎంతగా బాధపెట్టిందో తెలుసుకున్నారా . ?''

''అవసరంలేదు రాధా ... అవసరం లేదు....నేను అలా ప్రవర్తిస్తేనే మా అమ్మకి తృప్తిగా వుంటుందనుకున్నాను. సంతృప్తిగా వుంటుందనుకున్నాను....''

అతనేమంటున్నాడో రాధకి అర్థం కాలేదు అయోమయంగా చూసింది.

''నన్ను హింపిస్తే మీ అమ్మగారు సంతోషిస్తుందనుకున్నారా....ఎంత పొరపడ్డారు. నాకు జరిగిన అవమానాన్ని తలచుకుని ఆమె ఎంతగా కుమిలిపోయారో తెలుసా? నాకొచ్చిన కష్టమేమీ వుండదనీ, కంటికి రెప్పలా కాపాడతాననీ వాగ్దానం చేశారు .... మీ అమ్మగారి హృదయం అమృతంలాంటిది. అలాంటి మాతృమూర్తిని మీ రపార్థం చేసుకుంటున్నారు. ఆమే గనక నాకు సానుభూతి కనబర్చక పోతే ఈపాటికి మీకు నా శవం కనపడి వుండేది .... అయినా మీకేమయింది? అసలు వొంట్లో బాగుంటున్నదా? ఒకసారి ఏ మెంటల్ స్పెషలిస్టునన్నా చూడలేక పోయారా....?''

రాధ మాటలకి ఫణి నవ్వుకున్నాడు. అమాయకంగా వెలిబుచ్చుతున్న అభిప్రాయాలని అతని నవ్వు గాలిలో తేల్చేస్తున్నది....అర్థరహితం చేస్తున్నది.

''పొరపడింది నేను కాదు రాధా. నువ్వు మా అమ్మని నేను అర్థం చేసుకున్నంతగా—ప్రపంచంలో ఏ కొడుకూ ఏ తల్లినీ అర్థం చేసుకోలేదు. మా అమ్మ సంగతి నీకు తెలియదు ...నీకు తెలిసింది చాలా తక్కువ ''

''అయితే ఆమెనే డాక్టరుకు చూపించలేకపోయారా .... ఎందుకింతగా అశ్రద్ధ చేశారు....?

''నీ ప్రశ్నల్లో నీ ముఖంలాగా అమాయకత్వం తప్పితే మరేం కనిపించడం లేదు. అందుకే నాకు నవ్వు వస్తున్నది. మా అమ్మ విశేషంలాంటి మనిషి. ఏ డాక్టరుకీ చూపించవలసిన అవసరంలేదు.''

''అయితే మీరు ఆమె అభిప్రాయా




లకి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే సంతోషిస్తుందనీ....సంతృప్తి పడుతుందనీ.''

''అవును. నిజం. కాని. నువు చెప్పినట్టు కాదు. ఒక్కమాటగా చెప్పాలంటే—నేను దుర్మార్గుడుగా వుంటే మా అమ్మకి కొండంత సంతృప్తి ...!'

''నేను నమ్మను ...''

'నిన్ను నమ్మించడానికి ప్రయత్నిస్తాను ...''

''మీరు ప్రయత్నించవచ్చేమో గాని... యదార్థంగా మాత్రం అలా జరగదు. ఏ తల్లీ తను కన్నకొడుకు దుర్మార్గుడు అవాలనీ, దుష్ప్రవర్తనకు అలవడాలనీ కోరుకోదు....ఇది అసంభవం. అలా జరగదు....''

''అవును. నిజమే. లోకంలో సర్వసాధారణంగా జరిగేవిషయాన్ని చెప్పావు. కాని. మా అమ్మ విషయంలోనూ, నా విషయంలోనూ అది నిజంకాదు. నేను అందరిలాంటి కొడుకునూ కాదు. మా అమ్మదృష్టిలో నేను శత్రువును. గర్భశత్రువును....''

''అలా ఎందుకవుతుంది? ఈ ఇంట్లో అడుగు పెట్టీపెట్టగానే మీ ఆగ్రహానికి బలి అయ్యాను. మీ అమ్మగారి అనుగ్రహానికి పాత్రురాల్ని కాగలిగాను. మీ అమ్మగారిలో ప్రత్యేకత వున్నమాట నిజమే. కాని, మీరు చెప్పేవిధంగా మాత్రం కాదు. ఆమె సాటి స్త్రీగా—సాటి మాతృమూర్తిగా నన్ను దరికి చేర్చుకున్నారు. ఆమెలో ఎలాంటి అవలక్షణాలూ నాకు కనిపించలేదు. పైగా,

ఆమె నాకో దేవతలా కనిపించింది....''

''అది నీ అదృష్టం రాధా....అది నీ అదృష్టం. అందుకే నాకు చాలా సంతోషంగా వుంది. నువ్వు ఈ విధంగా ఈ ఇంట్లో ప్రవేశించావు. అనుకోని పరిస్థితుల్లో మా అమ్మ ఆదరణకి పాత్రురాలు కాగలిగావు. ఇప్పుడు నీకింక ఏ కష్టమూ రాదు. ఆ తల్లి నీడలో నీ భవిష్యత్తు సుఖమయమవుతుంది. నువు సుఖపడతావు....నాకంతకంటే ఏం కావాలి.... ఇప్పుడు నేను విశ్చింతగా వుండొచ్చు.... అందుకే ధైర్యంగా వెళ్ళిపోతున్నాను.''

''వెళ్ళిపోతున్నారా. ఎక్కడికి?''

''చెప్పలేను....ఎక్కడికి వెళ్తున్నానో నాకే తెలియదు....''

''మళ్ళీ ఎప్పుడొస్తారు....?''

''అదీ తెలియదు....''

''అంటే....ఇంక రారని అర్థమా?'' అయితే నన్నుకూడా తీసుకుపోండి. నేనూ మీతోనే వస్తాను....''

''రాధా....నువు తొందరపడకు. నాకే ఒక దారీ తెన్నూ లేదు....నిన్ను కూడా పెట్టుకుని ఎక్కడ తిరగను? అందులోనూ నువు పట్టిమనిషివి కావు. నీకు మంచి ఆశ్రయం దొరికింది. మా అమ్మ నీడలో నీకు ఏ లోటూ రాదు. నువు చాలా అదృష్టవంతురాలివి. అందుకే మా అమ్మ అనురాగాన్ని అందుకోగలిగావు.''

''నన్ను ఆదరించగల్గిన మీ అమ్మగారు మిమ్మల్ని ఆదరిస్తారు....ఇక్కడే వుండిపోండి....''

''లేదు రాధా .... మా అమ్మ చాలా మాటపట్టింపు మనిషి. ఆమె శపథం విన్నావుగా. నేనామెకి మళ్ళీ కనిపిస్తే ఉరిపోసుకుంటానంది. అన్నంత పనీ చేస్తుంది .. మా అమ్మ సంగతి నీకు తెలియదు....''

''తెలియదు తెలియదు అనడమే గాని .... తెలియజెప్పడం వుండదా? చెప్పండి .... మీ అమ్మగారు మిమ్మల్ని అలా ఎందుకు చూస్తున్నారు....మీరామె కన్నబిడ్డ కాదా?''

''కన్నబిడ్డనే .... కాని. కన్నతల్లి ప్రేమకి నోచుకోని అభాగ్యుణ్ణి....''

''అదే. ఎందుకూ అంటున్నాను ... మీరు చేసిన నేరం ఏమిటి?''

''నేరమా? నేరం చేసేవుంటే నిజంగా ఆదరించునేమో నా తల్లి. నేరం చెయ్యకపోవడమే నా నేరం....''

''చాలా విచిత్రంగా వుంది. ఇందులో ఏదో రహస్యముంటుంది. లేకపోతే ఆమె మీమీద ఇంత పగబూనదు....ఆ రహస్యం మీకూ తెలిసేవుండాలి. చెప్పండి. ఆ తల్లి అభీష్టానికి వ్యతిరేకంగా మీరు చేసిన దారుణం ఏమిటి?''

''నన్నలా అడక్కు రాధా. నేను చేసిన అపరాధమేమిటో నాకే తెలియదు అంటున్నాగా. నన్ను నమ్ము. నిజంగా నాకు తెలియదు. నాకు తెలిసిందల్లా ఒకటే! మా అమ్మ నన్ను చూస్తేనే నాకు




నడిపించాలని ప్రయత్నించడం....''

''ఎంతయినా కన్నతల్లి కదా, అలా ఎందుకు ప్రవర్తిస్తున్నదంటారు? ఎప్పుడయినా ఆలోచించారా....?''

''ఆలోచనా?....సర్వకాల సర్వావస్థల్లోనూ నా చింత అదే. మా అమ్మ ఒక విచిత్రమైన మనిషి. ఎంత విచిత్రమైన మనిషి అయినప్పటికీ కారణరహితంగా నన్ను పెడత్రోవన పెడుతుందనుకోను. ఏదో బలవత్తరమైన కారణం వుండే వుంటుంది. ఏదో రహస్యం వుండే వుంటుంది. తెలుసుకుందామని చాలాసార్లు ప్రయత్నించాను. నేనేకాదు, పట్టాభి రామారావుగారుకూడా ఈ విషయంలో విఫలులయ్యారు. నా విషయంలో తప్పితే మిగతా విషయాల్లో మా అమ్మ చాలా సాత్వికమైన మనిషే. ఆమెకీ హృదయముంది. మెత్తని మనసు వుంది. ఆమె బాధపడుతుండగా నేను అనేకసార్లు చూశాను. ఆమె ఏడుస్తుండగా చూశాను. చెప్పలేని ఆవేదనతో సతమతమైపోవడం గమనించాను. ఆమెలో ఏ అగ్నిగుండాలు మెదుల్తున్నాయో? ఏ తరకు రంపాలు కదుల్తున్నాయో? ఆమె ఏ ముళ్ళకంపల మీద నడుస్తున్నదో? తెలియదు. అందుకే మా అమ్మ అంటే నాకు అభిమానం. ఆమె నన్ను ఎంత చెడ్డత్రోవలో నడిపించాలని ప్రయత్నించినా—బాబాయిగారి దర్శకత్వంవల్ల నేను చెడిపోవడంలేదు. నా తల్లిని తల్లిగా గౌరవించే శక్తిని కోల్పోవడంలేదు....''

''మిమ్మల్ని తలుచుకుంటుంటే, మీ

జీవితాన్ని వూహించుకుంటుంటే నాకు మతిపోతున్నది. ఇలాంటి వొడిదుడుకుల్లో జీవిస్తున్నారని నేనెప్పుడూ వూహించ లేదు... నాకా అవకాశమే ఇవ్వలేదుమీరు. ఎప్పుడు చూసినా నవ్వుతూ త్రుళ్ళుతూ నాకు నిత్యసంతోషిలా కనిపించారు. నా జీవితంలో నవ వసంతాలు కురిపించారు. మీరింత బాగా నటిస్తారని ఎప్పుడూ ఆలోచించలేక పోయాను....''

''అదంతా నటన కాదు రాధా....నీ ప్రేమ మహత్యం! నీ సాన్నిధ్యంలో అన్ని మరచి పోయేవాడిని. మైమరచి పోయే వాడిని.... నీతోవున్న ఆ కాస్సేపూ సర్వ సమస్యలకి దూరంగా వుండగలిగే వాడిని. చీకటిదారిలో పడి మార్గం తెలియకుండా ఎడారిలో కొట్టుమిట్టాడుతున్న నాకు ఆశా జ్యోతిలా కనిపించావు. ఆనంద దీపికలా అనిపించావు. అందుకే రోజురోజుకి నీకు దగ్గరయి పోతూవచ్చాను. రోజు రోజుకి నీమీద మోజు పెంచుకుంటూ వచ్చాను .... బాబాయిగారు నాకు మార్గ దర్శకులయితే — నువ్వు ఆ మార్గాన్ని కాంతివంతం చేసిన కరదీపికవి. నువ్వే లేకపోతే నా జీవితం చీకటై పోయి వుండేది రాధా. నా భవిష్యత్తు అగమ్య గోచరమై పోయి వుండేది....''

ఫణి కళ్ళల్లో నీళ్లు నిండాయి. ఆ కన్నీటిని తుడుస్తూ అతనిలో వొదిగి పోయింది రాధ.

''ఇంతకాలమూ ఇంత బాధనీ ఇంత కాలకూటాన్నీ మీరొక్కరే భరించారా ఫణీ.... ప్రాణానికి ప్రాణంగా ప్రేమిం చారే....మనసులో మనసుగా కలిసేసు కున్నారే....ఈ విషయం నాతో ఎందుకు చెప్పలేదు .... ఎందుకు చెప్పలేక పోయారు....''

''ఇది నావ్యక్తి గతమైన విషయం రాధా. ఎవరితోనూ చెప్పుకుని ప్రయో జనం లేదు. చెప్పి విన్నా కూడా వేధిం చడం తప్పితే నువ్వుమాత్రం చెయ్య గల్గింది ఏముంది....?''

''అయితే మీరు నన్ను అర్థం చేసు కున్నది అంతేనన్నమాట....! మీసుఖాన్ని పంచుకోవడంతోపాటు మీ దుఃఖాన్ని కూడా పంచుకోగల అర్హత నాకు లేదా చెప్పండి....''

''జరిగిపోయిందేదో జరిగి పోయింది. ఇప్పుడు తెలిసిందిగా ...ఇంక వూరడి స్తావో వురిపోసుకో మంటావో నువ్వే చెప్పు....''

''అలా అనొద్దు ఫణీ ...మీరులేని ఈ బ్రతుకెందుకు? మీరులేని సుఖం నా కెందుకు ..? మీ ఆత్మ శాంతికోసం నా చాతనైన సాయం చెయ్యనివ్వండి....మీ కష్టసుఖాల్లో నన్ను భాగం పంచుకో నివ్వండి భరించలేని మీ మనోవ్యధకి అంతంలేదా? సంచిరోజు లనేవి రావా? రానా ..మీ కథ వింటున్న నాకే ఇంత మనస్తాపంగా వున్నది....వొంటరిగా మీ రెలా భరించ గల్గుతున్నారు? ఎలా నిగ్ర




హింసకో గురౌతున్నారు....?''

''పిచ్చిదానా .... ఇంతటి దానికే నువ్వింతగా బేలపడిపోతున్నావే? నేను అనుభవించిన మనోవేదనలో ఇది ఎంత? నేను ఊహ ఎరిగినప్పటి నుంచీ ఈ బాధని భరిస్తూనే వున్నాను.... విని భరించుకో గల శక్తి నీకుంటే విను చెబుతాను.''

నాన్న ఎలా వుంటాడో నాకు తెలియదు. అసలు వున్నాడో లేడో నాకు తెలియదు పూర్తిగా లేడనికూడా అనుకోవడంలేదు. మా అమ్మ నుదుట బొట్టూ ఆమె పసుపూ కుంకుమలూ చూసి తండ్రి వున్నాడనే అనుకుంటూ వుంటాను. ఏనాడూ కనిపించక పోవడం తోచి లేడూ అనుకుంటూ వుంటాను.

నాకు ఊహ వచ్చేవరకూ నేను ఎలా పెరిగానో తెలియదు. మా అమ్మ ఎలా పెంచిందో తెలియదు. ఊహ వచ్చినప్పటి నుంచీ నా పతనం ఆరంభమయింది. అప్పట్లో నాకు మంచీ చెడ్డా తెలిసేదికాదు. ఉత్తమము, నీచమూ అర్థమయ్యేదికాదు. ఎలా అవుతుంది? కన్నతల్లి నన్ను తప్పుత్రోవలో నడిపిస్తుందని ఎలా అనుకుంటాను? కాని, అప్పుడప్పుడు ''ఇదేమిటి? నా తల్లి నన్ను నా యిష్టానికి వా. లేస్తున్నది?'' అని నా చిన్నబుర్రలో తడుతూ వుండేది. అలా అనిపించినప్పుడు మా అమ్మ నాకో వరంలా తోచేది నన్ను తీర్చి దిద్దుకోవడంలో సర్వ స్వాతంత్ర్యాన్నీ ప్రసాదించిన మా తల్లి ఎంత గొప్పది? అనుకునేవాడివి....

కాని, చిన్నతనంలో అలా గాలికి వదిలేస్తే నా భవిష్యత్తు అంధకారమై

పోతుందని తెలిసేదికాదు.

తోటివాళ్ళని చూసి నేర్చుకోవడం ఆ వయస్సులో సర్వసాధారణమైన విషయం. మంచయినా చెడ్డయినా తోటివాళ్ళనిబట్టే ఆధారపడి వుంటుంది. మంచీ చెడ్డా వేరు చేయగలిగే శక్తి నాకు ఆ వయసులో ఎలా వస్తుంది?

"అమ్మా చదువుకుంటాను. నా తోటి వాళ్లు చాలమంది బళ్ళోకి వెళ్ళి చదువు కుంటున్నారు...."

అన్నా నొకసారి అమ్మతో.

తనని "అమ్మా" అని పిలవకూడదని అమ్మ శిలాశాసనం.

"మరేమని పిలవను?" అని అడిగా నొకసారి.

"ఏమనీ పిలవవలసిన అవసరంలేదు. ఆ అవసరం నీకు కల్పించడం లేనప్పుడు ఇక పిలవవలసిన ప్రస్తావన ఎందు కొస్తుంది.... అదిగో దాన్ని చూడు.... అది నన్ను పేరెట్టి పిలిస్తేనే దాని అక్కర తీరుస్తున్నానా....?

—అంటూ కుక్కపిల్లని చూపించింది మా అమ్మ.

అప్పటిలో మా అమ్మమాటకి అర్థం అంతగా బోధపడలేదు.... ఇప్పుడు తలచు కుంటుంటే గుండె చెరువై పోతుంది . "నన్నెందుకు పుట్టించావు భగవంతుడా!" అని మూగవోయిన కంఠంతో ఏడ్చు కుంటూ వుంటాను....

అలాంటి పరిస్థితిలో మా అమ్మ దగ్గ ర్నుంచి — నా చదువు విషయంలో ఎలాంటి సమాధానం వచ్చిందో నువ్వూహించుకోవచ్చు.

"నువ్వు చదువుకుని.... ఊళ్ళేల నవ సరంలేదు .... రోడ్లు ఖాళీగాపడి ఏడు స్తున్నాయి. వెళ్ళు. వెళ్ళి. నీకు తగ్గ స్నేహితుల్ని వెతుక్కో...."

నేను చదువుకోవడంలేదని ఎగతాళి పట్టించే మాటలు కావవి అమ్మ మన సారా వాంఛించిన నా భవిష్యత్తు అదే!

కుక్కపిల్లతో సమానంగా నేనూ పెరగసాగాను. దాని అవసరాలు తీరు తున్నట్టుగా నా అవసరాలూ తీరు తున్నాయి. నా ఆకలీ తీరుతున్నది.

నాకు తగిన ఫ్రెండ్సుని నేనూ వెతు క్కున్నాను. మా అమ్మమాటలు అక్ష రాలా పాటిస్తూ. అప్పటినుంచే నా పతనం ఆరంభమైంది. నా పతనానికి రోజూ మా అమ్మ సోపానాలు వేస్తుండేది....

నా పెట్టెలోకి ఎలా వస్తుండేవో గోళీలు బొంగరాలూ వస్తుండేవి. అవి మా అమ్మ నాకిచ్చే బహుమతులని తెలుసు కోవడానికి అట్టేకాలం పట్టలేదు. మా అమ్మ అవన్నీ ఇస్తున్నదనీ — నేను ఆడుకోడానికి మా అమ్మ కావలసినంత స్వేచ్ఛ ఇచ్చిందనీ చెబుతుంటే నా తోటి వాళ్లు నోరు వెళ్ళబెట్టి వింటుండేవాళ్లు.

ప్రత్యేకంగా నాకో గది వుండేది. అందులో నాకు సంబంధించిన సామగ్రి అంతా వుండేది. నా స్వేచ్ఛని తలుచుకుని




ఉక్కిరిబిక్కిరై పోతూ వుండేవాడ్ని. నా మిత్రులు నన్ను మరింతగా ఉబ్బించేస్తూ వుండేవాళ్లు నా మిత్రుల దృష్టిలో మా అమ్మకి నేనొక్కగానొక్క గారాబు బిడ్డను; నాగారం. మా అమ్మ మమకారం ఎలాంటిదో వాళ్ళకు తెలియదు.

మా అమ్మ నన్నుచూస్తే అసహ్యించుకుంటుందనీ, పురుగును విదిలించినట్టు విదిలించి కొట్టేస్తుందనీ ..ఆప్యాయంగా పలకరించడం అంటుంది. "అమ్మా" అని పిలుచుకోడానికికూడా నాకు అర్హత లేదనీ—ఒకవేళ పొరపాటున "అమ్మా" అన్నా నాకు ఆ రోజు ఉపవాసమని మా మిత్రులెవరికీ తెలియదు.

ఆలా తెలియకుండా వుండడమే మంచిదనుకున్నాను. తెలిసినట్టయితే నాతోటివాళ్ళల్లో నాకంత గౌరవం ఏర్పడదు. నన్నో నాయకుడుగా వాళ్ళు ఎంచుకుని వుండరు. అప్పట్లో నా అదృష్టానికి నేనే మురిసిపోయేవాడిని.

ఆడుకుంటే అమ్మ కొడుతుందని ఒకడూ—బడికి వెళ్ళలేదని అమ్మ పోరు పెడుతుందని మరొకడూ — తప్పుపని చేసినందుకు దండించిందని ఇంకొకడూ— వాళ్ళవాళ్ళ అమ్మలగురించి చెప్పుకుపోతుంటే — అప్పుడు నేను యెంత అదృష్టవంతుడినో, అని మురిసిపోతూ వుండేవాడిని.

నాతోటి కుర్రవాళ్ళల్లో నా పరపతి పెరిగిపోసాగింది. నేనో రింగ్ లీడర్ని అయిపోయాను. ఒక జట్టుకు నాయకుడిని అయిపోయాను.

రోజంతా రోడ్లమీద తిరగడం—ఆకలయినప్పుడు అన్నానికి రావడం—నిద్ర

పోవాలనుకున్నప్పుడు ఇంటికి చేరుకోవ డం—ఇదీ నా కార్యక్రమం.

ఎక్కడికి వెళ్ళావని అడిగేవాళ్లు లేరు. ఏం చేశావని ప్రశ్నించేవారు లేరు. అసలు నేను వున్నానో లేదో అని చూసేవాళ్ళు కూడా లేకపోయారు.

నా స్నేహితులకు తగ్గరీతిలో నేను ఎదుగుతున్నాను. వాళ్లు నన్ను ఎడ్యుకేట్ చేస్తున్నారు. అది మంచో చెడో తెలియదు.

రానురాను నా పెట్టెలోకి చిల్లరమల్లర డబ్బులుకూడా వస్తుండేవి. అంతే. మా అమ్మ నా సాదరు ఖర్చులకుగాను అందులో వుంచుతుండే దన్నమాట....!

చేతులో బాగా డబ్బులు ఆడుతుండేవి. ఉత్తుత్తి చీట్లాటలు మానేసి డబ్బుతో ఆడడం ఆరంభించాను. వస్తుండేది. పోతుండేది.

ఒకరోజున చీట్లాటలో పెద్ద కొట్లాట జరిగింది. నిజానికి, ఆ కొట్లాట లేవదీసిన వాడినికూడా నేనే. జేబులోవున్న డబ్బులన్నీ ఖాళీ అయిపోగా—ఓటమిని అంగీక రించలేక నా బలాన్ని ప్రదర్శించాను. ఫలితంగా రక్తం కళ్ళ చూడవలసి వచ్చింది.

ఆరోజు ఇంటికి తొందరగా వచ్చేశాను. అనుకోకుండా అమ్మకళ్ళ బడ్డాను. రోడ్డుమీద దుమ్మంతా నామీదే వుంది. చొక్కా చిరిగిపోయింది. అక్కడక్కడా రక్తం మరకలున్నాయి.

నా అవతారం చూసి అమ్మ తిడుతుందనీ—కొట్టొచ్చుననీకూడా భయపడ్డాను. అలా భయపడ్డానికి కారణం. అమ్మ తీక్షణమైన చూపులే.

"చీట్లాట ఆడాను డబ్బులన్నీ పోయాయి ఉక్రోషం పట్టలేక కొట్టేశాను. నాకూ దెబ్బలు తగిలాయి."

అన్నాను అమ్మ అడక్కుండానే. ఆ రోజు నన్ను శిక్షించకుండా విడిచిపెట్టదనే నా ఊహ.

కాని. నేను ఆశించినట్టు జరగలేదు.

అమ్మ చిన్నగా నవ్వుకుంది ఆ నవ్వు నా ఘనకార్యం తలచుకుని నవ్విన నవ్వు. నేను చేసిన మంచి పనికి సంతోషించిన నవ్వా....? అమ్మ ఎందుకలా నవ్వింది? నన్నెందుకు శిక్షించకుండా విడిచిపెట్టింది? కాదు. ఏదీ కాదు. ఆ నవ్వు నవ్వుకాదనీ. నా పతనావస్థ ఆరంభమైనందుకు అమ్మ పొందిన సంతృప్తి అని తెలియడానికి చాలాకాలం పట్టింది.

అప్పటినుంచీ ఆ నవ్వే నా కళ్ళల్లో మెదుల్తూవుండేది. కన్ను మూసినా తెరిచినా ఆ నవ్వే! ఆ నవ్వు నన్నేమిటో వెన్నాడుతున్నట్టుగా వుండేది. భరించుకో లేక పోయేవాడివి. అమ్మ నన్ను కొడితే బాగుండును. తిడితే బాగుండును గట్టిగా శిక్షిస్తే బాగుండను—అనే ధ్యాస అప్పటి నుంచే ఆరంభమైంది

ఆ తర్వాత కొద్ది రోజులు దాకా నా చేతికి డబ్బులు అందలేదు. పెట్లోకి



యువ




డబ్బులు వస్తాయని....రోజూ ఎదురు చూశాను. ఎప్పుడూ లేనిది "అమ్మ డబ్బులిస్తే బాగుండును" అనిపించింది. అలా చాల రోజులు గడచిపోయాయి. పైసాకూడా నా చేతికి దక్కలేదు.

నా ఫ్రెండ్సంతా నన్ను యెగతాళి పట్టించడం మొదలెట్టారు. అంతకంటే ఎక్కువగా—చీట్లాట దగ్గర కూర్చోడానికి అర్హత కోల్పోవడం—నన్ను బాధించింది. ఒక్కసారిగా ఏకాంతంలోకి తోసేసినట్టు అనిపించింది. పిచ్చెక్కినట్టుగా వుండేది. ఎవళ్లేమి మాట్లాడు కుంటున్నా — నా గురించే మాట్లాడు కుంటున్నట్టుగా. ఎవరు నవ్వినా — నన్నుచూసే నవ్వు తున్నట్టుగా భావించేవాడిని. అందరూ నన్ను అవమానిస్తున్నట్టుగా తలపోశాను.

అమ్మ నాకు డబ్బులివ్వడం మానేపించింది. కొట్టక్కర లేకుండా తిట్టక్కర లేకుండా—అమ్మ నాకు విధించిన శిక్ష—అదిః లేదో. ఇలాంటి పనులకి అమ్మ నన్ను శిక్షించదు. ఇంకా ఉత్సాహ పరుస్తుంది తప్పితే....

ఒక రోజున నా కళ్ళని జిగేల్ మని పించే డబ్బు కనిపించింది. నా పెట్టెలో కాదు. రోడ్డుమీద నడిచి వెళ్ళి పోతున్న ఒక ఆసామీ జేబులో .... ఒక అతని జేబులోనుంచి నోట్ల కట్టలు నా కళ్ళని మిరుమిట్లు గొలిపాయి. మళ్ళీ నా స్నేహితుల్లో కలిసి మెలసి తిరగాలంటే డబ్బు కావాలి. ఎలాగయినా డబ్బు సంపాదించాలి....

కళ్లెదుట కట్టలు కట్టలుగా డబ్బు కనిపిస్తున్నది. అందిన అవకాశాన్ని జార విడుచుకోవడం నాకు ఇష్టంలేక

పోయింది.

నన్ను దొంగతనానికి ప్రోత్సహించిన మరోవిషయంకూడా వుంది. ఒక వేళ దొంగతనం సక్రమంగా పారితే డబ్బు నాదవుతుంది. లేక పోతే పట్టుబడి పోతాను. పట్టుబడిపోతే ఈ విషయం అమ్మకి తెలుస్తుంది. అమ్మ వూరుకోదు. నన్ను గట్టిగా కొడుతుంది. అమ్మ చేతులు నా మీద పడతాయి. ఆ ఆనందం అనుభ వించాలని చాల రోజులుగా కనిపెట్టుకు కూర్చున్నాను. ఇప్పుడో మంచి అవ కాశం దొరికింది. ఎలా జరిగినా పరవా లేదు. చూద్దాం, ఏం జరుగుతుందో—అన్నట్టుగా అతన్ని సమీపించాను. ఇది వరకు ఎప్పుడూ దొంగతనం చెయ్యలేదు. అయినా నాకు భయం వెయ్యలేదు. పట్టు బడినా మంచిదే అన్న నా తలంపే అందుకు కారణం కావచ్చు ధైర్యంగా ముందడుగు వేశాను.

నడిరోడ్డులో — పట్టపగలు—అంత జనసంచారంలో — ఎదురుగా వెళ్ళి జేబులో నుంచి నోట్ల కట్టలు తొంగిచూసే పర్సును కొట్టేస్తుంటే చూస్తూ వూరుకునే రోజులు ఇంకా రాలేదు. రాలేదు గనకనే నేను పట్టుబడి పోయాను. అతని బల మైన చేతికి చిక్కిపోయాను....అంతతో పోలేదు, ఆ ఆసామీ నన్ను దవడలు వాయగొట్టాడు.

చుట్టూ జనం మూగారు. సంగతి విని మరికొంతమంది యోధులు ముందుకు వచ్చారు. నన్ను చితక్కొట్టేశారు.

కొందరు పోలీసులని పిలవండి అన్నారు. మరికొందరు పోలీసుస్టేషనుకు తీసుకుపదండి అన్నారు. మొత్తంమీద అక్కడ ఒక పెద్దగుంపు పోగయింది.

ఆ గుంపులోనుంచి ఒక పెద్దమనిషి నన్ను రక్షించాడు. అతను నన్ను పట్టాభి రామారావుగారి ఇంట్లో చూశాడట. ఆయనకి సంబంధించిన మనిషిని అను కున్నాడు. వెంటనే వచ్చి నాకు అండగా నిలిచాడు.

పట్టాభిగారి పేరు చెబితే ఎంతంతటి వాళ్ళూ వినయవిధేయతలు ప్రదర్శిస్తారు. పట్టాభిగారి అస్త్రం జనంమీద బాగా పని చేసింది. నన్ను పెద్దమనిషికి అప్పగించి ఎవరిదారి వారు చూసుకున్నారు.

పెద్దమనిషి నన్నుతీసుకుని పట్టాభిగారి దగ్గరకి వచ్చాడు. వచ్చి ఫిర్యాదుచేశాడు.

—అంతా విని పట్టాభిగారు చాలా ఆశ్చర్యపడ్డారు. అంతకు మించిన బాధని అనుభవించారు.

"ఏం దొంగతనం చేశావా....?"

అని నన్నడిగారు. నేనేమీ సమాధానం చెప్పలేదు. చెప్పడానికి ఏమీ లేదని పించింది. దీని పర్యవసానం యెలా వుంటుందో చూడాలనిపించింది. మా అమ్మ ప్రతి చర్య ఎలా వుంటుందో గమనించాలనిపించింది. ఆ చిన్న వయ సులో మా అమ్మ దెబ్బలకోసంకూడా అంతగా అంగలార్చేవాడిని....!




పట్టాభిగారి ప్రశ్నకి నా మౌనం ఏం సమాధానంగా ఊహించుకున్నారో ఏమో ఆయన కనుబొమలు లేచాయి. రెప్ప వెయ్యకుండా చూశారు. వెంటనే కాలింగ్ బెల్ నొక్కారు.

క్షణాల్లో మా అమ్మ అక్కడికి వచ్చింది. దోషిలా నిలబడ్డ నన్నూ— అపరిచిత వ్యక్తినీ—పట్టాభి రామారావు గారినీ మార్చిమార్చి చూసింది అమ్మ.

"పిలిచారా... ?" అనడిగింది.

"అవును జానకీ .. ఫణి చెడిపోతున్నాడు. ఇవ్వాళ దొంగతనం చెయ్యడానికికూడా సిద్ధపడ్డాడట .. వీరాస్వామిగారు అడ్డుపడి ఆపుచేశారు గాని....లేకపోతే మనవాడు దక్కేవాడు కాదు పోలీసువాళ్లు పసువుతీసి పందిరివేసి వుండేవాళ్ళు."

"నిజమా....వాడు దొంగతనం చేస్తున్నాడా?" అనడిగింది అమ్మ.

"అవును....అదిగో వీరాస్వామిగారే మీవాణ్ని ఇక్కడికి చేర్చారు. ఫణిని అలా గాలికి వదిలెయ్యడం బాగులేదు జానకీ." అన్నారు పట్టాభి.

"నా కొడుకు బాగోగుల గురించి నాకు తెలుసు బాబుగారూ...."

"అయితే తెలిసే దొంగగా తయారు చేస్తున్నావా....?"

"అవును...."

"జానకీ ...!"

అమ్మ మనస్తత్వం ఏమిటో అప్పటివరకు బాబాయిగారికి తెలియదు. నాపట్ల ఆమె ఎలా ప్రవర్తిస్తున్నదీ అన్న విషయం ఆయనకు తెలియదు అదే ప్రథమం. అందుకే ఆయన ఎంతో ఆందోళన

చెందారు.

"గోరుతో పోయేదాన్ని నిర్లక్ష్యం చేస్తే గొడ్డలికోసం వెతకాల్సి వస్తుంది జానకీ. కన్నతల్లివి. పిల్లలగురించి. వాళ్ళ భవిష్యత్తును దిద్దితీర్చడం గురించి నీకు నేను చెప్పక్కరలేదు. నీ కొడుకు చెడి పోతున్నాడు .... ఇంత క్రితంకూడా నీ కొడుకుగురించి వినివున్నాను. చిన్నపిల్ల వాడు. ఏదో అల్లరిచిల్లరగా తిరుగు తున్నాడు అనుకున్నాను. నువ్వు భయ భక్తుల్లో వుంచకపోతావా అనుకున్నాను. కాని, వ్యవహారం చాలదూరం పోతున్నది. ఫణి దొంగతనాలు చెయ్యడందాకా వచ్చాడు.... నువ్వు తల్లిగా నీ కర్తవ్యాన్ని ఏమరుస్తున్నావేమోనని నాకు భయంగా వుంది...."

"నాకూ భయంగానే వుంది బాబు గారూ. మీరు నాకు శరణమిచ్చారు. ఇంత పిడచ ప్రసాదించారు. జీవితానికో దారి ఏర్పరచారు. ఒక అనాధ కొడుకుమీద ఇంత శ్రద్ధ తీసుకుంటున్నందుకు... మీకు కాని విషయాల్లో జోక్యం కలగజేసు కుంటున్నందుకు.... ఇది ఏ పరిణామానికి దారి తీస్తుందోనని నాకూ భయంగానే వుంది బాబుగారూ...."

అమ్మ తొణకలేదు, బెణకలేదు. ధైర్యంగా తన భయాన్ని బయటపెట్టింది.

"జానకీ... ఫణి నీ కొడుకు. నీ యిష్ట మొచ్చినట్టు చేసుకోవచ్చు. అది నాకు అనవసర విషయమే కావొచ్చు. కాని, వాడు చెడిపోతున్నాడు. బాగా చెడిపోతు న్నాడు. వాడిని క్రమశిక్షణలో వుంచు. వాడికి ఉజ్వలమైన భవిష్యత్తును కల్పించు."

"వద్దు బాబుగారూ .... వద్దు. వాడు అలాగే పెరగాలి .... అలాగే పెద్దవాడు కావాలి. నా ఆశయం తీరాలి."

"వాడిని చేతులారా చెడగొట్టడం నీ ఆశయమా...?"

"అవును ..."

"జానకీ...నువ్వు నువ్వేనా? స్పృహలో వుండి మాట్లాడుతున్నావా .... వాడు నీ కొడుకు జానకీ. నీ కొడుకు....!"

"నాకు తెలుసు...."

"నీ మూర్ఖత్వం వల్ల ఒక నూరేళ్ళ జీవితం నష్టభ్రష్టో కలిసిపోతుందని గ్రహిం చావా?"

"నాకు తెలుసు ..."

"ఏమిటి నీకు తెలిసింది....? చదువు సంధ్యలు లేకుండా రోడ్ల వెంబడి తిరగ నివ్వడమా? రౌడీలా తిరుగుతుంటే చూచి సంతోషించడమా? దొంగతనాలు చేస్తుంటే ఆనందించడమా? వాడినెందుకు అలా తయారుచేస్తున్నావు.... వాడి నిక్షేపం లాంటి బ్రతుకును చేజేతులా పాడుచేసి తీర్చుకుందామనుకునే ఆ ఆశయం ఏమిటి....?"

"బాబుగారూ .... దయవుంచి నన్నీ విషయంలో వొత్తిడి చెయ్యకండి. మీ ఉప్పు తిని బ్రతుకుతున్న విషయం నిజం.




మీకు ఎదురాడితే ఈ ఉన్న నీడకూడా కరువైపోతుందని తెలుసు. అందుకు నేను విచారించడంలేదు. తెలిసీ, మీ సేవలకి సంబంధించినంతవరకు నేనేమీ తప్పుచెయ్యలేదు. తప్పుచేస్తే చెప్పండి. వెంటనే సవరించుకుంటాను. క్షమించమని ప్రాధేయపడతాను. ఇక, ఫణి ప్రవర్తన అంటారా, అది నా స్వవిషయం. నా వ్యక్తిగత విషయాల్లో మీరు జోక్యం కలగజేసుకోకండి. నన్నూ, నా కొడుకునూ మా మానాన మమ్మల్ని విడిచిపెట్టండి. ఎవరి భవిష్యత్తూ ఎవరూ తీర్చిదిద్దలేరు. ఏది ఎలా జరగాలో జరుగుతుంది....''

''ఇలా వేదాంతం వల్లెవేస్తూంటే నీ కొడుకు పచ్చినెత్తురు తాగేవాడుగా తయారవుతాడు ...''

''తాగనివ్వండి .... నాకు కావలసింది కూడా అదే. నేను బ్రతుకుతున్నదికూడా ఆ శుభసమయంకోసమే .. !''

''జానకీ...నీకేమయింది? నువ్వెందుకు ఇలా మాట్లాడుతున్నావు .... వాడు చెడిపోతే నీకు కాదా....? వాడి ప్రవర్తన ద్వారా నువ్వు బజారుకెక్కుతావు....ఆ తర్వాత నిన్ను సంరక్షిస్తున్న నేను వీధిలో పడతాను .... ఇదంతా కావాలనే చేస్తున్నావా....?''

''క్షమించండి బాబుగారూ....నానుంచి మీకు ఎలాంటి మచ్చా రాకూడదని నిత్యమూ దేవుడ్ని ప్రార్థించు కుంటున్నాను. నా వల్ల మీకు అలాంటి ఆపద ఏదయినా వస్తుందని మీరు అనుకుంటే— ఇప్పుడే ఈ యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోతాను....''

''జానకీ....!''

''అంతేకాదు బాబుగారూ .... ఫణి విషయంలో మీరు వృధా శ్రమపడుతున్నారు. తల్లిగా నా కర్తవ్యాన్ని

నేను నెరవేర్చలేక పోతున్నానని మీరు బాధ పడిపోతున్నారు. మీరు దయామయులు. నా కొడుకును నిర్లక్ష్యం చెయ్యడం మీరు చూడలేక పోతున్నారు. మీ దయవాడిమీద ఏక్షణంలో ప్రసరించినా అది నాకు క్షేమం కాదు. నా జీవితానికి, నా బ్రతుక్కి అది గొడ్డలి పెట్టు అవుతుంది. అలాంటి పరిస్థితిని కోరి తెచ్చుకో దలచుకోలేదు....మీరు వాడి విషయంలో జోక్యం కలగ జేసుకోకండి .... వాడిని ఎలా పెంచాలో నాకు తెలుసు. ఎలా పెద్ద చెయ్యాలో నాకు తెలుసు నా కోరిక ప్రకారం నా కొడుకును నేను పెంచుకో నివ్వండి....లేదా. నాకు సెలవు ఇప్పించండి. ఇవ్వాళే. ఈ క్షణంలోనే ఈ యింటికీ నాకూ రుణం చెల్లిపోయింది అనుకుంటాను... '

అంటూ అమ్మ నా వైపు చూసింది. చూసి నవ్వింది. మళ్ళీ అదే నవ్వు. అదే భావప్రకటన....ఆ క్షణంలో నేను చచ్చిపోతే ఎంత బాగుండును అనిపించింది.

అమ్మ నన్ను పీకనులిమి చంపేస్తే ఎంత హాయిగా వుండును? అనిపించింది.

నాకు ఏడుపు ముంచు కొచ్చింది. గొల్లున ఏడ్చేశాను. .

''అమ్మా .... నన్ను తిట్టమ్మా ... నన్ను తిట్టు....నేను దొంగతనం చేశానమ్మా....నన్ను కొట్టు నీ కసితీరేదాకా కొట్టు... నన్ను శిక్షించు....నన్నిలా విడిచి పెట్టెయ్యకమ్మా....నీకు చేతులు నొప్పి పుడతాయనుకుంటే ఇదిగో ఈ హంటర్ తీసుకుని కొట్టమ్మా....''

అంటూ గోడకున్న హంటర్ తీసి అమ్మ చేతుల్లో పెట్టి ఏడ్చాను.

అమ్మ హంటర్ వైపు. నా వైపు. పట్టాభిగారివైపు చూసింది. కొడుతుం దేమోనని నేను యెదురుచూశాను.

నన్ను కొట్టలేదు అమ్మ. నా ఆశ తీరలేదు. హంటర్‌ని చుట్టి గోడకు తగిలించి నావైపు చూసి మళ్ళీ నవ్వి వెళ్ళిపోయింది.

ఆ నవ్వునుంచి వెలువడిన చీమలూ జెర్రలూ నా వొళ్ళంతా ప్రాకాయి. నా ఏడుపు తారస్థాయి నందుకుంది. అలా ఎంతసేపు ఏడ్చానో నాకే తెలియదు.

కొంతసేపటికి పట్టాభిగారి చెయ్యి నా వంటిమీద పడింది. ఆయన మోకాళ్లు పట్టుకుని ఏడ్చేశాను.

నన్నూ నా దైన్యస్థితినీ అర్థం చేసుకోడానికి పట్టాభిగారికి ఆట్టేసేపు పట్టలేదు. ఆయన నా గురించి చాలా ఆలోచించారు. ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నారు. కృతనిశ్చయంతో నన్నాయన దగ్గరకు తీసుకున్నారు

ఆ క్షణంనుంచి నా జీవితానికో కొత్త మార్గం ఏర్పడింది. ఆ దయామయుని అండదండల్లో నా జీవితం రూపురేఖలు పూర్తిగా మారిపోయాయి. నా భవిష్యత్తు స్వర్ణమయం చెయ్యాలని ఆయన సంకల్పం. ఆయన సంకల్పం నెరవేర్చుకో




డానికి బంగారు సోపానాలు వేశారు. ఆ సోపానాలమీద నా నడక ఆరంభమైంది.

మా అమ్మకి తెలియకుండా ఇదంతా జరిగిపోతూవుంది. నా చదువు సంధ్యలు. నా సత్ప్రవర్తనా అంతా రహస్యంగా వుండాలని పట్టాభిగారి ఉద్దేశ్యం. ఆయన ఉద్దేశ్యం ప్రకారమే నేనొక నటుడుగా తయారయ్యాను. రెండురకాల జీవితాల్ని పోషిస్తున్నాను. నా నిజస్వరూపం ఒకటయితే నా బాహ్యప్రవర్తన మరొకటి. పట్టాభిగారు నన్ను ఎప్పటికప్పుడు సరి చేస్తూ నాలోని లోటుపాట్లని దిద్దుతూ ఇంతటివాడిని చేశారు.

కాని మా అమ్మదృష్టిలో నేను ఇంకా విద్యాహీనుడ్నే ఇంకా దుర్మార్గుడ్నే. నేనలా వుండడమే ఆమెకి ఆనందం. కన్న తల్లి ఆనందంకంటే కొడుక్కి కావలసింది ఏముంది....? అందుకే, ఆమె ఆనందం మేరకు నటిస్తున్నాను. దుర్మార్గుడుగా వ్యవహరిస్తున్నాను,

"రాధా, ఇప్పుడు చెప్పు ...నాలాంటి జీవితం ఎవరికయినా వస్తుందంటావా? నాలాంటి నిర్భాగ్యుడు ఎవరయినా వుంటారంటావా?"

రాధ ఏమీ మాట్లాడలేకపోయింది. ఆమెమాత్రం ఏం చెప్పగల్గుతుంది? ఏం చెప్పడానికీ నోరు పెగలక అతని హృదయానికి హత్తుకుపోయింది.

"రాధా... ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది, నన్ను వెళ్ళనీ, మా అమ్మ ఏ క్షణంలోనన్నా ఇక్కడికి రావొచ్చు. నన్ను చూడవచ్చు. ఆ తర్వాతి పరిస్థితి ఎలా వుంటుందో ఊహించలేము."

"అంటే, మీ అమ్మగారు అన్నంత

పనీ చేస్తారంటారా ...?"

"అందులో సందేహంలేదు. నేనిక్కడ నుంచి ఎంత తొందరగా వెళ్ళిపోతే అంత మంచిది."

"అయితే .... మిమ్మల్ని పూర్తిగా మరచిపోమని సెలవా? నా జీవిత మిలా అడవికాచిన వెన్నెల్లా వృధా అయిపో వలసిందేనా? మీ అమ్మగారిలో మార్పు రాదంటారా? ఆమె మీయెడ అలా ఎందుకు ప్రవర్తిస్తున్నదో తెలుసుకోడానికి మీరు ప్రయత్నమే చెయ్యరా... ?"

"చేసి ప్రయోజనంలేదు రాధా. మా అమ్మ ఎందుకలా చేస్తున్నదో తెలుసుకోవడం అంత సులభం కాదు ...అది నా దురదృష్టమని సరిపెట్టుకోవడమే మంచిది."

"మీరు తొందరపడి నిర్ణయం చేసుకోకండి. నేను ప్రయత్నించి చూస్తాను...."

"నువ్వా...."

"ఏం నావల్లకాదా? కాకపోయినా— ప్రయత్నించడంలో తప్పేముంది?"

"ఏంలేదు ...కానియ్ ...! కనీసం నువ్వు ఆ నిజం బయటపెట్టేవాకా అయినా నేను మా అమ్మకి దూరంగా ఉండాలిగా....అందుకే నన్ను వెళ్ళనివ్వమని అంటున్నాను...."

"మీరు వెళ్ళక తప్పదంటారా...."

ఇంతకన్నా ఎక్కడ విడమర్చి చెప్పమంటావు రాధా .... కొన్నాళ్ళ పాటయినా మనకి ఎడబాటు తప్పదు... మంచి రోజులు వస్తాయి ... మీ అమ్మ మనసు మారతుంది. మన కష్టాలు గట్టెక్కుతాయి...."

"నిజంగా నేనంత అదృష్టవంతురాలి నంటారా....? నాకంతటి భాగ్యం కలుగుతుందంటారా...."?

"రాత్రి తర్వాత పగలు వచ్చి తీరుతుంది రాధా ఆ ఆశనే లేకపోతే నేనిన్నాళ్లు ఇలా బ్రతికి వుండేవాడిని కాదు. . నేను వెళ్తున్నాను ...అప్పుడప్పుడు వచ్చి కలుస్తుంటాను నీవు నా కూడావచ్చినా రాకపోయినా—నీ మనసును నాతోనే తీసుకుపోతున్నాను కనక— నేను ఎక్కడున్నా క్షేమంగానేవుంటాను. నాగురించి విచారపడకు .."

అంటూ ఫణి పరిగెత్తినట్లుగా నడిచి వెళ్ళిపోయాడు. రాధ కన్నీళ్లు ఆతన్ని ఆపలేక పోయాయి.

* *

"జానకీ నీ మూర్ఖత్వంవల్ల ఫణి శాశ్వతంగా దూరమై పోతున్నాడు... చూశావా...?"

"అవును బాబుగారూ.. వాడు కసాయివాడై పోయాడు. వాడి రాక్షసత్వానికి ఒక అమాయకురాలి జీవితం అన్యాయంగా బలై పోయింది అలాంటి వాడిని క్షమించి ఎలా విడిచిపెట్ట మంటారు?"

జానకి మాటలకి పట్టాభి స్తబ్ధు




చేయ్యాడు. ఆ మాటలు ఆయన్ని కొంత ఆనందపరచాయనే చెప్పాలి ..ఆమెలో మార్పు వచ్చిందని చెప్పక చెబుతున్నది ఆమె నిర్ణయం.

పట్టాభి పెదవులమీద చిరునవ్వు తాండవించింది. ఆయనకేదో ధైర్యం కలిగింది.

"చూశావా జానకీ.. ఒక అబలకి అన్యాయం జరిగిందంటే నువ్వెంతగా పరితపించిపోయావో..! ఆ అబలని ఆదరిస్తున్నావు. అయిన వాడిని కాలదన్నుకుంటున్నావు కాని. ఫణి నువ్వనుకుంటున్నంతటి రాక్షసుడు కాడు. అతని గుణగణాలు నాకు తెలుసు..."

"మీకు తెలియదు బాబుగారూ... వాడు పచ్చి మోసగాడు... దుర్మార్గుడు పీడదు ..తాగుబోతు...?

"ఆ... ఇంకా ..?"

అంటూ నవ్వేశాడు పట్టాభి. అతని నవ్వు జానకిని మరింత రెచ్చగొట్టింది.

"వాడి ఘాతుకం మీకు తెలియదు బాబుగారూ....ఆ అమాయకురాలిని ప్రత్యక్షంగా చూస్తేగాని ఆమె బాధని కళ్లారా చూస్తేగాని మీకు అర్థంకాదు...."

"నాకు అర్థమైంది జానకీ....నాకు అంతా అర్థమైంది కాని. ఫణి ఎప్పుడూ అంతటి పాడుపని చెయ్యడు...."

"అలాంటి నమ్మకం మీకెలా కలిగిందో నాకు తెలియదు. కళ్ళారా చూసిన సంఘటనని నమ్మలేనంత గుడ్డిదాన్ని కాదు నేను. ఇప్పుడే ఆ అమ్మాయిని తీసుకు వస్తాను ...ఆమెనే అడిగి తెలుసుకోండి. నిజానిజాలు తెలుస్తాయి...."

"ఆగు జానకీ....ఆగు. దీనికి సాక్ష్యాధారాలు, రుజువులూ అక్కరలేదు. నువ్వు చెప్పిన దాంట్లో అబద్ధంలేదు. నేను చెప్పిందీ నిజమే...."

"బాబుగారూ...."

అర్థంకానిదానిలా ఆశ్చర్యపోయింది జానకి.

"అవును జానకీ....ఆ విషయమే నీకు విశదీకరించి చెప్పాలని అర్జెంటుగా పిలిపించాను.

జానకీ నువ్వు నన్ను యజమానిగా చూస్తున్నావో? కాళ్లులేని కుంటివాడుగా జాలి చూపిస్తున్నావో?—నాకు తెలియదు గాని, నీ సేవల్లో నేను సర్వస్వమూ మరచిపోతున్నాను. నువ్వు లేకపోతే నా జీవితం ఎలా వుండేదో ఊహించుకోలేక పోతున్నాను.

అందుకే నువు నా హృదయంలో సుస్థిరమైన స్థానాన్ని ఏర్పరచుకున్నావు. దానికి నువ్వు ఎన్ని వ్యాఖ్యానాలన్నా చేసుకో, ఎన్ని అర్థాలన్నా తీసుకో. అంత కంటే విడమర్చి చెప్పలేను.

నీమీద నాకున్నది కేవలం జాలిమాత్రం కాదు. అనాథగా నా యింట్లో ప్రవేశించినా, నీమీద నాకు అంతులేని అభిమానం వుంది. నువ్వు నాకు పరాయిదానివిగా కనిపించలేదెప్పుడూ. సొంతంగా భావించుకున్నాను. బాంధవ్యం కలుపుకున్నాను. పవిత్రంగా ఊహించుకున్నాను.

—ఇదంతా ఇప్పుడు నీకు చెప్పవలసి వస్తున్నది. కారణం లేకపోలేదు. ఒకసారి నువ్వు ఏమన్నావో జ్ఞాపకం వుందా? నీ కొడుకు చెడిపోతున్నాడు, కట్టుదిట్టాలు చెయ్యమని నేను కోరినప్పుడు నువ్వు పెడచెవిని పెట్టావు. అంతకంటే ఘోరంగా నన్నూ, నా హద్దుల్ని వేలెత్తి చూపించావు. నీ సొంత విషయాల్లో జోక్యం కలగజేసుకోవడం నా తప్పే.

కాని, నువు నాకు పరాయిదానివి ఎలా అవుతావు? నీ కొడుకు నాకు పరాయివాడు ఎలా అవుతాడు? నువ్వు ఉపేక్షించినా, నీ కొడుకును సక్రమమార్గంలో పెట్టడం నా కర్తవ్యం అనుకున్నాను. కాని, అటువంటి చర్య నేను యెక్కడ తీసుకుంటానో, అని నువ్వు ముందుగానే హెచ్చరించావు. నేను బెదిరిపోయినమాట వాస్తవం.

అప్పుడు ఫణి మీద నేను శ్రద్ధతీసుకుంటే నువ్వెక్కడ దూరమైపోతావో అని భయపడ్డాను. ఎంత భయపడినా ఫణిని నిర్లక్ష్యం చెయ్యలేకపోయాను.

ఇప్పుడు ఫణి నువ్వనుకునే దుర్మార్గుడు కాడు. చాలా బుద్ధిమంతుడు. విద్యావంతుడు. కాలేజీ చదువుకూడా పూర్తిచేశాడు. పరీక్ష పాసైన రోజు అతను సంతోషించలేదు. అతను కృతార్థుడయాతే నువ్వు సహించలేవని లోలోపల కుమిలిపోయాడు. అమ్మ ఆదరణకి పాత్రంకాని ఈ చదువులూ పరీక్షలూ తనకి వద్దని అక్కడితో తన




చదువుకి ఫుల్‌స్టాప్ పెట్టేశాడు. నేను ఎంత చెప్పినా వినిపించుకోలేదు...''

పట్టాభిగారు చెప్పుకుపోతుంటే జానకి గిజగిజలాడిపోయింది. ఆమెలో కోపమేవుందో—దుఃఖమే వుందో... ఏముందో చెప్పటానికి కష్టం.

''బాబుగారూ...'' అని గద్గదికంగా అంటూ సోఫాలో కూలబడిపోయింది జానకి.

''జానకీ...అవును. నేను చెప్పేదంతా యదార్థం. ఫణిని ప్రయోజకుడ్ని చేశాను. అతన్ని సుశిక్షకుడుగా పెంచి పెద్ద చేశాను. అతని భవిష్యత్తుకి వెలుగుని ప్రసాదించాను. నీ బాధ్యతని నేను నెత్తిమీద వేసుకుని అతన్ని మనిషిగా తీర్చాను. నీకు ఫణిలో కనిపించిందీ—ఫణిగురించి వినిపించిందీ అంతా బూటకం నటన.

వ్యక్తిగతంగా ఫణిబాబు చాలా మంచివాడు. నీకు కనిపించినంత మూర్ఖుడూ జ్ఞాన రహితుడూ కాదు. ఇదంతా నా సారధ్యంమీదనే జరిగింది. రహస్యంగా జరిగింది. ఎప్పుడో ఒకప్పుడు ఈ రహస్యం బట్టబయలు అవుతుందని నాకు తెలుసు. తెలుసుకున్న నువు నన్ను క్షమించలేవని కూడా తెలుసు.

సమయం చెయిజారి పోతున్నది. ఫణి దూరమై పోతున్నాడు. ఈ సమయంలో నీకు చెప్పకపోతే ఇంకెప్పుడు చెప్పను....?

నీకు తెలియకుండా నీ కొడుకుని ప్రయోజకుడ్ని చెయ్యడం నీ దృష్టిలో నేరమే కావచ్చు. కాని, ఈ విషయంలో నువు వెనకాముందూ ఆలోచించి నిర్ణయం తీసుకో. నువ్వూ ఈ యింటికి దూరమై పోతే—ఈ కుంటివాడి గతి ఏమయి

పోతుందో ఒక్కసారి ఆలోచించి నువ్వు అడుగు వెయ్యి.

నేను చేసిన అపరాధానికి నన్ను తిట్టు. నీయిష్టమొచ్చినట్టు చెయ్యి కాని, ఈ యింటిని చీకటి చేసి వెళ్ళిపోకు. నా కోరికని మన్నించి ఫణిని మనిషిగా ఆదరించు. పాముగా చీదరించుకోకు. నీ చేతులు పట్టుకుని ప్రార్థిస్తున్నాను.... నువు నన్ను ఒంటరివాడిని చేసి వెళ్ళిపోకు. ప్లీజ్....

పట్టాభి కళ్ళు స్రవించాయి. అతని వీల్‌చైర్ వేగన్ని పుంజుకుని జానకిని చేరుకున్నది.

జానకి సమాధానం చెప్పలేదు. ఏమీ సమాధానం చెప్పలేదు. ఏడుస్తూ కూర్చుంది. అసహాయగా చేతలుడిగి వెక్కివెక్కి ఏడ్వసాగింది. ఆమె ఆశలు కూలిపోయినట్టుగా, లక్ష్యం దెబ్బతిన్నట్టుగా, తన బ్రతుకు ఆనాటితో విచ్ఛిన్నమై పోయినట్టుగా, విచార మేఘాలతో ముసురువేసిన ఆమె ముఖాన్ని చేతుల్తో కప్పుకుని భోరుమని ఏడ్వసాగింది.

పట్టాభి ఆమెని అనునయించాలని తేరుకునేట్టు చెయ్యాలని ఎన్నోవిధాలుగా ప్రయత్నించారు.

"బాబుగారూ నన్నెందుకు యిలా అన్యాయం చేశారు? నా బ్రతుకుని ఇలా ఎందుకు కాల్చేశారు? నా జీవితాన్ని నిట్టనిలువునా చీల్చేసే అధికారాన్ని మీరెందుకు తీసుకున్నారు బాబుగారూ, మీరు ఎందుకు తీసుకున్నారు?"

అంటూ గొల్లుమన్నది. పట్టాభిగారి మనసు పరిపరివిధాల పోయింది.

"జానకీ. నేను తప్పే చేశాను. నన్ను క్షమించు నన్ను క్షమించలేవా?"

పట్టాభి ఎంత ప్రాధేయపడినా ఆమె సమాధానం ఇవ్వలేదు.

"ఇప్పుడు నువ్వు ఇంతగా బాధపడవలసిన విషయం ఏముంది జానకీ?

"ఫణి నీ కొడుకు. అతను బుద్ధిమంతుడయ్యాడు ప్రయోజకుడయ్యాడని సంతోషించడం పోయి, ఏడుస్తున్నావా? ఎందుకు జానకీ, అతనిమీద నీకింత పగ ఎందుకు? ఆ అమాయకుణ్ణి ఇంత శత్రువుగా చూడాలని ఎందుకు అనిపిస్తున్నది?

అతను నీ కొడుకు కాదా? నిజంగా అయివుండడు. అవును కదూ? అతని జన్మరహస్యం ఏదో వుంది. అది నీకు తెలుసు. ఇప్పటి నీ ఆవేదనకి కారణం కూడా అదే అయివుండాలి. నేను నీవాడిని. నన్ను నీ ఆత్మీయుడుగా ఎంచుకుని అదేమిటో చెప్పు జానకీ. నీ గుండెల్లో బరువుని దించుకో. నా చాతనైన సాయం నేను చేస్తాను. ఆ రహస్యమేమిటో చెప్పు. విన్నతర్వాత నీ వైఖరే తప్పనిసరి అయితే నేనూ అవలంబిస్తాను. నన్ను నమ్ము. నా మాటమీద విశ్వాసం వుంచు. చెప్పు జానకీ, నిజంగా అతను నీ కొడుకేనా? నీ కడుపున పుట్టిన బిడ్డ




దేనా?''

పట్టాభి మాటలకి జానకి కరిగిపోయింది. ఆమె ఏడుపు మరింతగా తారస్థాయి నందుకుంది. ఆయన సానుభూతి ఆమెమీద మంత్రంలా పనిచేసింది.

''చెబుతాను బాబుగారూ...తప్పకుండా చెబుతాను వినండి. విని, నా లక్ష్యసాధనకు సహకరిస్తారో, లేకపోతే నా నిర్లజ్యానికి శిక్షిస్తారో అంతా మీకే విడిచి పెట్టేస్తున్నాను.''

అంటూ మొదలు పెట్టింది.

* *

రామాపురంలో పోస్టుమాస్టారయినా, మాస్టారయినా జగన్నాధం ఒక్కడే.

ఆయనకున్న ఆస్థిపాస్థులన్నీ ఆవూరి మోతుబరి నాగభూషణం కైవశం అయిపోయాయి. నాగభూషణానికి పేదలతో చెలగాటమాడ్డం ఒక వేడుక. డబ్బు తప్పితే అతనికి వేరే లోకంలేదు. దాన్ని ఆర్జించడంకోసం ఎన్ని అగచాట్లనైనా భరించేవాడు. ఎన్ని అడ్డదార్లనైనా తొక్కేవాడు ఎంత గడ్డయినా తినేవాడు. ఊళ్ళో ప్రజల బలహీనతలని స్వార్థానికి బాగా వుపయోగించుకోవడంలో ఆరితేరిపోయిన మనిషి అతను. అతనికి పాపపుణ్యాల వివక్షత తెలియదు. దయాధర్మాల విశిష్టత తెలియదు. అతని దదొక రకమైన ప్రపంచం!

విధం చెడిన ప్రజలు అతనికి దాసోహమనక తప్పలేదు. పూటకూడుకోసం దేవుళ్ళాడే ప్రజలకి అతను దైవమై కూర్చున్నాడు.

జగన్నాధం రెక్కల కష్టం చిల్లర ఖర్చులకికూడా వచ్చేదికాదు. అటువంటి పరిస్థితిలో నాగభూషణాన్ని ఆశ్రయించక తప్పలేదు. ఆశ్రయించి నందుకు ఫలితంగా, వున్న ఒక్కగానొక్క ఇల్లూ నాగభూషణం పేరున పెట్టెయ్యవలసి వచ్చింది.

నిజానికి జగన్నాధానిది పెద్ద కుటుంబ మేమీ కాదు. భార్య నాంచారమ్మ. కూతురు జానకి. ఈ ఇద్దరి పోషణ కోసమే ఆయన సర్వస్వాన్నీ పోగొట్టుకో వలసి వచ్చింది. ఆస్తంతా కేవలం వాళ్ళ తిండీ బట్టాకోసం వెళ్ళి పోయిందను కుంటే పొరపాటు.

నాంచారమ్మగారి అంతు తెలియని జబ్బు ఆయన ఆస్తిని హారతి కర్పూరం చేసేసింది. జగన్నాధాన్ని మానసికంగానూ, భౌతికంగానూ క్రుంగదీసివేసింది.

జానకి వాళ్ళ ఒక్కగానొక్క బిడ్డ. ఆమెగురించి వాళ్ళకి ఎన్నో అభిప్రాయా లుండేవి. ఆమె భవిష్యత్తును దిద్దడం గురించి ఎన్నో ఆశలు వుండేవి. కాని, అనునిత్యమూ మందులకోసం, జీవన భృతికోసం తడువుళ్లాటగా వుంటున్న సమయంలో జానకికి తగిన సదుపాయాలు అమర్చలేక పోయారనే చెప్పాలి.

నాంచారమ్మగారు — రాశిచావుకోసం ఎప్పుడూ కలిపెట్టుకు కూర్చునేది.

మందులతో బ్రతికే ఈ బ్రతుకు కంటే చావేనయమని—ఆమె తలంపు. తను చచ్చిపోతే కూతురు జీవితానికన్నా ఒక మార్గం ఎర్పడుతుందేమో నని ఆమె ఆశ. అంటే, కూతురి కోసం ఆమె ప్రాణాన్నివ్వడానికయినా సిద్ధంగా వున్న దన్నమాట.

ఇక, జగన్నాధంగారు:

ఆయనకి జానకి అంటే ప్రాణం. కొడుకయినా కూతురయినా జానకి ఒకర్తే. ఆ ఒక్కదాన్నయినా సరిగ్గా పెంచలేక పోతున్నామే. అని ఆయన బెంగ.

రెక్కలు ముక్కలు చేసుకుని ఎలాగో కష్టపడి తిండికి లోటులేకుండా జరుపు కొచ్చేస్తున్నారు.

జానక్కి వయసు వస్తున్నకొద్దీ ఆమె అందం ఇనుమడించసాగింది. మట్టిలో మాణిక్యంలా మెరిసిపోతున్న ఆమెని చూసుకుని జగన్నాధం దంపతులు మురిసి పోతూ వుండేవాళ్లు.

జానకి గొప్పవాళ్ళింట్లో పుట్టవలసిన అమ్మాయి అని, తప్పుజారి తమ ఇంట్లో పుట్టిందనీ తలపోస్తూ వుండేవాళ్లు.

పనిలో జానకి చురుకుతనం, చదువులో ఆమె సునిశితమైన తెలివి, సాటి లేని సంస్కారం—వీటన్నిటిద్వారా ఆ వూళ్ళో జానకి ఒక అయస్కాంతమై పోయింది.

జానకి తమకి పుత్రికగా జన్మించడం తమ అదృష్టంగా ఆనందిస్తూ వుండేవాళ్లు ఆ తలిదండ్రులు.

జానకికి కష్టమనేది తెలియకుండా అతి




సుకుమారంగా పెంచాలని, హంసతూలికా తల్పాలమీద వుంచాలనీ, పట్టుపరుపులపై నడిపించాలనీ, పల్లకీలమీద తిప్పాలని.... ఇంకా ఎన్నెన్నో ఆశలున్నాయి జగన్నాథానికి.

ఆమెని ఒక గొప్పింటి కోడలుగా చెయ్యాలని, ఆమెకి కాబోయే వరుడు ఫారిన్ రిటర్న్డ్ అయివుండాలని, జానకిని కంటికి రెప్పలా చూసుకునే భర్త లభించాలనీ ఆశయాలున్నాయి జగన్నాథానికి.

కాని, ఎలా? ఎలా సాధ్యం?

ఆశలకీ ఆశయాలకీ కానీ ఖర్చు అవసరంలేదు. అవి తీరాలంటే లక్షలమీద మాట!

అందుకే, అతని మాటలు విన్న జనం 'పిచ్చివాడు'. అనుకునేవాళ్ళు. జానకిని తలచుకున్నప్పుడు మాత్రం — 'నిజమే, జానకి అటువంటి పుట్టుక పుట్టవలసిన పిల్లే. దురదృష్టవంతురాలై జగన్నాథం ఇంట్లో పుట్టింది'—అనుకునేవాళ్ళు.

జగన్నాథం ఆశలూ ఆశయాలూ తీరడానికి అతనిదగ్గర మిగిలిన ఆనలా మచ్చలేని పరువూ, మంచివాడనే ప్రతిష్ఠా, అతను కష్టపడి బకాయి లేకుండా కట్టే ఇరవై వేల ఇన్సూరెన్సూ. ఇవే అతనికి అప్పుడప్పుడు కాస్త ధైర్యాన్ని యిస్తూ వుంటాయి. కూతుర్ని అందలాలు ఎక్కించలేకపోయినా — ఆనందమయిన జీవితాన్ని ఏర్పరిస్తే చాలు—అనుకుం

టుండేవాడు.

జగన్నాథం గాలిమేడలు నిర్మించు కుంటూ వుండగానే—జానకి భవిష్యత్తును మధురంగా ఊహించుకుంటూ వుండగానే కాలం గిర్రున తిరిగిపోయింది.

జానకి యవ్వనంలో అడుగుపెట్టింది.

ఆమెకి తగిన వరుడ్ని వెతకాలని— ఆమెనో యింటిదాన్ని చెయ్యాలని—జగ న్నాథం తపన అంతా యింతా కాదు.

అతనలా సంబంధాలకోసం వెతుకుతూ వుండగానే ఊళ్ళో కుర్రకారు కళ్ళన్నీ జానకి చుట్టూ పరిభ్రమించసాగాయి.

పని కల్పించుకుని జగన్నాథం ఇంటికి వస్తూవుండేవాళ్ళు. జానకిమీద వాలుచూపులు విసుర్తూ వుండేవాళ్ళు. నెమ్మది నెమ్మదిగా జగన్నాథంగారి యిల్లు ఒక ముఖ్యమైన తూ ద లి గా తయారయిపోతున్నది. కొందరు ధైర్యం చేసి ప్రేమలేఖలు రాయడందాకా వచ్చేశారు.

జగన్నాథానికి కంగారు ఎక్కువయింది. పరువూ మర్యాదా ఆయనకి ప్రాణంకంటే తీపి. వాటిని కాపాడుకోడానికి ఆయన పడే శ్రమ అంతా ఇంతా కాదు.

కాళ్ళకి బలపాలు కట్టుకుని పెళ్ళికొడు కులకోసం వేట ఆరంభించారు. ఆయన మనసుకు నచ్చిన వరుడు దొరకడం దుర్లభమైపోయింది. అధమం, దొరికినా కట్నాలూ, కోరికలకీ తూగగలిగే శక్తి ఆయనకి యెక్కడిది? నిరుత్సాహం ఆయన్ని తినివెయ్యసాగింది.

జానక్కి పెళ్ళిచేసి వెంటనే త : దూరంచేసుకోవాలని లేదు జగన్నాధానికి. ఆమె పెళ్ళి ఆలస్యం కావడంకూడా ఆయనకి ఒకవిధంగా సంతృప్తిగానే వుంది.

మిట్టపల్లాలమీద ప్రయాణించే బండిలా దొర్లిపోతున్నది జీవితం.

అనుకోకుండా ఒక అతిథి వూడిపడ్డాడు వాళ్ళింటికి. అతను వెంకట్రామయ్య. జగన్నాధానికి దూరపుబంధువు. అతను రావడం ఎంత ఆశ్చర్యమయిందో, అతను తెచ్చినవార్త అంత ఆనందపరచింది.

వెంకట్రామయ్య జానకికి ఒక లక్షాధి కార్ల సంబంధం తీసుకువచ్చాడు.

జగన్నాథం జానకి భవిష్యత్తుగురించి కన్న కలలన్నీ ఆ సంబంధం నిజం చేసే ట్టుగా కనిపించింది.

లక్షల ఆస్తికి ఒక్కడే వారసుడు. తల్లీ కొడుకూ మిగతా నౌకర్లూ చాకర్లూ తప్పితే ఆ ఇంట్లో ఆడబిడ్డల పోరు లేదు.

లంకంత భవనం. తరతరాలనుంచి వస్తున్న ఆస్థి. దానితో తులతూగే పరువూ మర్యాదా.

జానకి అంతటి అదృష్టవంతురాలే అని పించినా — ఆకస్మికంగా వచ్చిన ఈ సంబంధం కలో నిజమో తెలియలేదు జగన్నాధంగారికి.

పెళ్ళికొడుకు తండ్రి ఆర్మీలో ఏదో పెద్దఉద్యోగం చేసేవాడట. కుటుంబంలో స్వరాజ్యంకోసం పాటుబడినవాళ్ళుకూడా




పున్నారు. వంశ పారంపర్యంగా వస్తున్న దేశభక్తి వాళ్ళది. దేశంకోసం ప్రాణాలు అర్పించేవాడు పెళ్ళికొడుకు తండ్రి. పెళ్ళికొడుకు అసలు ఉద్యోగం చెయ్యవలసిన అవసరంలేదు. కాలుమీద కాలువేసుకు కూర్చుంటే రోజులు హాయిగా వెళ్లిపోతాయి. ఎంతమంది యెన్నిరోజులు తిన్నా తరగని ఆస్థి వుంది. అయినా పురుషలక్షణమని ఉద్యోగం చేస్తున్నాడు. లక్షణమైన ఆఫీసరు ఉద్యోగం చేస్తున్నాడు.

అతను ఆర్మీలో ఒక పెద్ద ఉన్నతాధికారి. ముప్పయ్యేళ్ళకి మించని వయసులో అంత పెద్ద ఉద్యోగం చెయ్యడం గర్వించతగిన విషయం. కాని, కుర్రవాడు చాలా మంచివాడు. ఉదాత్తమైన గుణం కలవాడు. అతనికి ఇప్పుడప్పుడే పెళ్ళిచేసుకోవాలని లేదు. తల్లికి గుండెజబ్బు. ఆమె కంగారుపడుతూ—కొడుకు పెళ్ళికి తొందరపడుతున్నది. ఆమె నోరు అంత మంచిది కాదంటారు గాని ఆమెతో సంబంధం వుండదు. పెళ్ళికొడుకు వ్యక్తిత్వమున్న మనిషి. అతన్ని యెదిరించి నిలవగల శక్తి యెవరికీ లేదు. అమ్మాయిని పువ్వుల్లో పెట్టుకు పూజిస్తాడు.

—ఇదీ పెళ్ళిపెద్ద మాటల సారాంశం.

అంతా బాగానేవుంది గాని, పెళ్ళికొడుకు సైన్యంలో వున్నాడనేసరికి నిరుత్సాహపడిపోయారు జగన్నాధం. యుద్ధం ముంచుకొచ్చే రోజులు దగ్గరపడుతున్నాయి. చూస్తూ చూస్తూ కూతురి గొంతుకోయడమా? అని అతను బాధపడుతున్నాడు.

(ఇంకా వుంది)

మార్చి నెల

# భావపరిచయ పోటీ



బహుమతి పొందిన వ్యాఖ్యలు

అన్నుమిన్నచేయి సన్నాసిచేతిలో
బడెనొ లేదొ యతడు పరవశించె;
ఇద్దరకును పెండ్లి ఏనాడొ యైనది—
కాలికోలది దిరిగి కలిసిరిట్లు.

—బన్నాసా. ఏలూరు.

కామక్రోధములను గర్హించి, మేలైన
యోగ మభ్యసించి జోగియయ్యె
సొగసుగత్తె చేయి సోకినమాత్రాన
కామియయ్యె మోక్ష కామిగాక.

—కె. అంజనప్ప. తిరుపతి.


ఎప్పటికే బెకబెక అవసరమో
అప్పటికా బెక బెకలాపన!
బెకబెకాగ్రణిని నేను!
మాకెద సాక్షిల
మాకెదనవళిల -


ఓట్లెత్తు నాద -
ఓట్లన్ని
నాకే!

ఏప్రిల్ నెల

# భావపరిచయ పోటీ

**బహుమానం రూ. 10—00**



**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.**

వ్యాఖ్య వచనంగా గానీ. పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ. పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులోపంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమాన మివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు

వ్యాఖ్యలు మాకు మార్చి 5 వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొన వచ్చును. ప్రవేశరుసుములేదు.



# రాజీనామా

కొడవంటి కాశీపతిరావు

బస్సులో కిటికీ దగ్గరగా కూర్చున్న అమలకు దూరంగా పొలాల్లో నడువొంచి చేను కోస్తున్న పల్లెపడుచులూ, అంత వరకూ గాలికి బంగారపు అలల్లాగా ఊగుతూ పడుచుల చేతి కరుకుదనం రుచిచూపి బంగారపు ముద్దల్లాగా ఒక చోట పడిపోతున్న వరిచేను గుట్టలూ, గట్టుమీద పంచెగగట్టి నోట్లో పెద్దచుట్ట గుప్పుగుప్పుమనిపిస్తూ అవసరంలేని వాళ్ళను గదమాయిస్తూ, అవసరం ఉన్న వాళ్ళను ఓరగా చూస్తూ నిల్చున్న నాయుడూ చూడ్డానికింపుగా కన్పిస్తున్నారు.

చక్కని పల్లె అనుభవాలు తనకు అత్తవారింటికి వచ్చినప్పుడల్లా కలుగుతాయి అనుకునేసరికి అమల ఒళ్ళు పులకరించింది. తను సెలవులు గడిపినట్టూ వుంటుంది. బియ్యేస్సీ సెకండ్ క్లాసు తెచ్చుకున్న గోపాలం బావకి కంగ్రాచ్యులేషన్స్ చెప్పినట్టూ ఉంటుందని బయల్దేరినట్టుగా అన్పించడంలేదు అమలకి. తనకప్పుడే గోపాలం బావతో పెళ్ళయిపోయినట్టూ....తను గోపాలం బావచేత వాళ్ళాఫీసరు కాదంటున్నా బలవంతంగా ఓ వారంరోజులు సెలవు పెట్టించి అత్తామామల్ని చూడటానికి పల్లెకెళ్తున్నట్టూ ఊహించుకుంటున్న అమల బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కుతున్నాయ్.

బస్సు ఒక్క కుదుపుతో ఆగగానే గభాలున బయటికి దుమికింది అమల గోపాలం బావని చూడాలని.

పాలేరు అమలని పలకరించి పరిచయం చేసుకున్నాడు. అరమైలు వాడివెనకే మాట్లాడకుండా నడవ మొదపెట్టింది. ఇంవాకటి బస్సులో కూర్చుని చూపిన ప్రకృతి అందాలు ఇప్పుడు స్వయంగా పొలంగట్టుమీద నడుస్తున్న అమలకు కన్పించలేదు. బస్సు ప్రయాణం....గోపాలం బావ రాకపోవడం....నెత్తి మాడ్చేస్తున్న ఎండా... వీటివల్ల విరసించినట్టున్న అమలకు రామచిలుకల కిచకిచలూ, ఇంకా కోతకురాని కొన్ని వరిచేల మీంచి వస్తోన్న సువాసనలు వెదజల్లే గాలీ, చేనుకోస్తున్న పడుచు చిలకల కలలూ సోకడంలేదు.

"అమ్మగారూ ఒచ్చేసేం" అంటూన్న పాలేరూ, "ఏవమ్మా ప్రయాణం కులాసాగా జరిగిందా." అంటూన్న మావయ్యా, "కాళ్ళు కడుక్కో తల్లీ" అంటూన్న అత్తయ్య కన్పించేరుకాని .. కావలసిన బావ అయిన వాళ్ళ ఇంటి గుమ్మం ముందు నిలబడ్డా కన్పించలేదు.

* *

సాయంకాలం అయిదు గంటలు కావస్తోన్నా ఎండ మాడ్చేస్తుందేమో గొడుగు వేసుకుని, గట్టుమీద నిలబడి కూలీలను అదమాయిస్తూ కనిపించేడు గోపాలం బావ. పెద్దపాలేరు కామోసు పక్కన నిలబడి తానూ అప్పుడప్పుడు కేకవేస్తున్నాడు.

అకస్మాత్తుగా ధాన్యలక్ష్మిలా సాక్షాత్కరించిన అమలను చూస్తూ "మా అమలే!" అంటూ ఆశ్చర్యపోయేడు గోపాలం.

"తరువాత తీరిగ్గా ఆశ్చర్యపోదువుగాని ...కాఫీ టిఫిన్ తీసుకువచ్చేను. ఆ చెట్టు నీడకి పద ' అంటూ దారి తీసింది అమల.

పెళ్ళి కాకముందే కొంగు కట్టేసుకుంటున్నావే." అంటూ చిలిపిగా నవ్వేడు. అదరా బాదరా చేతులు కడుక్కుని, ఆవురావురని టిఫిన్ తింటున్న గోపాలాన్ని జాలిగా చూస్తోంది అమల. ఎందుకో తలెత్తి చూసిన గోపాలం అమల తన్నే దీర్ఘంగా

చూస్తోండటం గమనించి, "నన్ను కొరుక్కుతినేస్తావా ఏమిటి అలా చూస్తు న్నావ్?" అనడిగేడు.

"ఈ ఎండా, ఈ కష్టమే విన్ను సగం తినేసినట్లున్నాయ్ .... ఇంకా ఏముంది? అయినా ఈ పనులన్నీ చూసుకోడానికి పెద్దపాలేరున్నాడు గదా. నువ్వుకూడా ఎందుకు వాళ్ళతో సమానంగా కష్ట పడటం...." అంది అమల టిఫిన్ బాక్స్ సర్దేస్తూ.

"అలాకాదు అమలా....వాళ్ళతోపాటు మనమూ కష్టపడితేనే వాళ్ళు మన పనిని వాళ్ళపని అనుకుని చేస్తారు. జమీందారీ పద్ధతి ఎందుకు ఫెయిలయిందంటావ్? జమీందారెవ్వడో పట్నాల్లో విలాసాల్లో మునిగి తేల్తూ వాళ్ళమీదా వీళ్ళమీదా పెత్తనం వదిలేస్తే వాళ్ళు చేతనైనంత చిక్కించుకుని, మాకేం పోయిందని వదిలేసేవారు. మనం ఎదురుగుండా కనిపిస్తూ కష్టానికీ, సుఖానికీ వాళ్ళ నాదుకుంటూంటే వాళ్ళ కంతకంటె ఇంకేం కావాలి అలాంటి యజమాన్లకోసం వీళ్ళ ప్రాణాలైనా ఇచ్చేస్తారు" అంటూ చెప్పుకుపోతున్నాడు గోపాలం.

"అది సరే ఇంతవరకూ నువ్వుండ బట్టే ఈ పనులన్నీ జరిగేయా... ఇప్పుడు లేకపోతే జరగవా. మావయ్య ఉన్నారు గదా ఇవన్నీ చూసుకోవడానికి" అంది అమల.

"లేదు అమలా....ఇంతవరకూ మా నాన్న కష్టపడ్డారు చాలు. ఇక నాకు రెక్క లొచ్చాకకూడా వాళ్ళని కష్టపెట్టడం భావ్యం కాదు. పైగా వాళ్ళు పాతకాలపు మనుష్యు లేమో, వాళ్ళు చేసే వ్యవసాయపు పద్ధ తులు అన్నీ పాతవే. అందుకే ఉన్న ఈ పాతికెకరాలూ బాగా సాగుచెయ్యాలని వుంది. ఈ ఏడాది 'హంస' వేసాను చూడు. ఎకరాకి ఇరవై బస్తాలు రాలింది. మన ఇంటిప్రక్క నాయుడు 'పద్మ' వేసి బహుమతి గెల్చుకున్నాడు. వచ్చేఏడాది ఆ బహుమతి నెలాగైనా నేను సంపా దించాలని నాకు పట్టుదలగా వుంది."

"ఇప్పటికే మనదేశ జనాభా ఏభై అయిదు కోట్లంటున్నారు. ప్చ్... పోనీ జనాభా పెరగనీయ్. ఆహారోత్పత్తికూడా దానితోపాటు పెరిగితే జనాభా సమస్యకి భయపడాల్సిన అవసరంలేదు. తినేనోళ్లు పెరిగేకొద్దీ, పనిచేసే చేతులుకూడా పెర గాలి. పెరుగుతాయి" అన్నాడు దృఢంగా గోపాలం.

"బాగుంది. కాని నువ్వొక్కడివే నీ పాతికెకరాలూ బాగా పండిస్తే చాలా.... అందరూ నీలా ఆలోచించవద్దూ."

"నన్ను నిరుత్సాహపరచద్దు అమలా. ఇలా ప్రతి యువకుడూ వెనక్కి తగ్గి పోతే దేశం బాగుపడేదెప్పుడు? నాకు సాధ్యమైనంతవరకూ ఈ ఊళ్ళో మిగతా యువకుల్లోకూడా చైతన్యం కలిగిస్తు న్నాను. ఇప్పుడు నన్నుచూసి ఈ ఊళ్ళో ఎంతమంది పోటీలు పడుతున్నారో తెలు సునా? అదే నాక్కావాలి. పోటీలు కక్షల్లో కాదు పెంచుకోవాల్సింది....పని

చెయ్యడంలో.''

గోపాలం ఉపన్యాసం వింటూంటే అమల గుండెల్లో రాయి పడింది. గోపాలం గాని కొంపదీసి వ్యవసాయంలో ఉండి పోడుగదా. చక్కగా తనూ, తనభర్తా ఏపట్టణంలోనో కాపరం పెట్టి....తనభర్త ఉద్యోగం చేస్తూ సంపాదిస్తూంటే .... అతనిచేత మురిపాలు తీర్చుకుంటూ హాయిగా నాగరికతా ప్రపంచంలో బ్రతకాలని ఏ స్త్రీ కోరుకోదు? అమలకూడా గోపాలం ఎక్కడో ఉద్యోగం చెయ్యాలనీ....అతను ఆఫీసు నుండి తిరిగి వచ్చే వరికి చిరునవ్వుతో ఎదురై కాఫీ అందించాలనీ....అతను తెచ్చిన మల్లెపూలు అతనే తన తల్లో తురమాలనీ ...అతని చేతనే సినిమాకు వెళ్దాం అమలా అని పించుకోవాలనీ .... దూరంగా వుంటేనే పల్లెలగ్గానీ, అత్తమామలకి గానీ విలువుంటుంది గాబట్టి అప్పుడప్పుడు పల్లెకి వెళ్ళి వాళ్ళ ఆదరాభిమానాల్ని పొందాలని కలలు కనటంలో ఆమె తప్పేం లేదు.

కాని ఆ కలలన్నీ ఫేడౌట్ అయిపోతున్నట్టు డౌట్ వచ్చింది అమలకు. కాని అప్పుడేం బయట పెట్టలేదు.

కనుచీకటి పడుతూండగా ఇద్దరూ ఇంటికి తిరిగి వచ్చేరు. అమల లోపలికి వెళ్ళి వచ్చేసరికి గోపాలం బావ మామయ్యతో పొలం విషయాలన్నీ మాట్లాడుతున్నాడు. మామయ్య ఏవేవో సలహాలిస్తున్నాడు. అమల మనసు కలుక్కుమంది. ఆ వయస్సులో చదువుకున్న కుర్రాడు తండ్రితో ఈ ఉద్యోగాలకి అప్లికేషన్లు పెట్టాననీ .... ఇది ఇంటర్వ్యూ వచ్చిందనీ .... అదయితే ప్రాస్పెక్టస్ వుంటుందనీ ...ఇంత డబ్బు కావాల్సి వుంటుందనీ మాట్లాడాలి. అంతేకాని ఆ కాలవనీరు నాయుడు తిప్పేసుకున్నాడనీ ...''రత్న'' వేసిన మడికి నీరు తోడ్డానికి సమితివాళ్ళని ఇంజను అడిగేననీ ...మొన్న కొట్లోవేసిన ''జయ'' ధాన్యపు బస్తాలు పెట్టి అడుగుతున్నాడని మాట్లాడుతుంటే అమల కెలావుంటుంది?

మర్నాడుదయం అడిగేసింది.

''అవునుగానీ బావా....రిజల్ట్సు వచ్చి ఆరునెల్లు పైన కావస్తోంది. దేనికైనా ఎప్లయి చేసావా?'' అని.

''అదేమిటి అమలా, కొత్తగా అడుగుతున్నావ్. చదువుతున్న దగ్గర్నుండీ వ్యవసాయంలో మార్పులు చేస్తుండటం చూస్తూనే వున్నావు. నా మనసే తెలుసుకోలేక పోయావా? ఉద్యోగాలు కావాలని అందరూ పల్లకీలెక్కితే మోసే దెవరు? నేనిక్కడే వుండి వ్యవసాయంలో కొత్త కొత్త ప్రయోగాలు చేద్దామనుకుంటున్నాను.'' అన్నాడు గోపాలం.

అన్నట్టూ....పల్లెసీమల అందాలూ వరిచేల సువాసనలూ అమ్మగారికి ఇష్టమే కాబోలు....'' అన్నాడు అమల కళ్ళల్లో కళ్ళుంచి. ఆ కళ్ళల్లో కూలిపోతున్న మేడలుమాత్రం గోపాలానికి కనబడలేదు.

* *

లంచ్ టైములో పడవలసిన కాఫీ

టిఫిన్ పడలేదేమో. ఓ పక్క తలనొప్పి. మరోవంక ఆకలితో నీరసం వచ్చేస్తోంది అమలకి. పక్కకి చూస్తే ఇంకా టైపు చెయ్యాల్సిన లెటర్సు చాలా వున్నాయ్. ఉదయంనుండీ చేస్తూనేవుంది. ఎంతకీ తరగడంలేదు. ఇంకో టైపిస్టున్నా ఇవన్నీ తన నెత్తినే కొట్టేరు.

తలెత్తి చూస్తే ఆ ఇంకో టైపిస్టు శేఖరం కాలుమీద కాలేసుకుని అమెనే సూటిగా చూస్తున్నాడు ఆ చూపుకు తేళ్లు పాకినట్టయింది అమలకి. అమల తన చూపు వింకా మరల్చుకోక ముందే. అందుకే యెదురుచూస్తున్నట్టు "మే ఐ హెల్ప్ యూ" అన్నాడు. అడిగిన మాట కేమో ప్రాణం వచ్చినా, అడిగిన ముఖం లోని రంగులు నచ్చలేదు అమలకు. అయిదుగంటల్లోపల పూర్తవ్వాలీ అంటే అతని సహాయం వుండాల్సిందే. అందుకే తలూపింది. వెంటనే టేబిలుదగ్గరకు వచ్చేసేడు శేఖరం. కొన్ని కాగితాలు పట్టుకుపోతూ .... "అన్నట్టు లంచ్‌లో మీరు కాఫీ తీసుకున్నట్టు లేదు. అభ్యంతరం లేకపోతే నా ఫ్లాస్కులో వుంది" అంటూ ఆ కాగితాలు తీసుకుపోయి, ఆమె అంగీకారంతో పనిలేదన్నట్టుగా కాఫీ పట్టుకొచ్చేసేడు. వద్దని చెప్పడానికూడా ఓపికలేదు అమలకు.

తీసుకోబోయింది. కప్పు అందించేటప్పుడు ఆమె చేతులు తాకడానికి ప్రయత్నించేడు. ఏదో జరిగిపోతున్నట్టు మిగతా గుమస్తాలందరూ ఆత్రుతగా చూస్తున్నారు. అసహ్యంతో చేతులు వెనక్కి తీసుకోబోతే కాఫీ ఒలికిపోయింది. కాఫీ ఒలికిపోతే ఫర్వాలేదు. ఇంతవరకూ టైపు చేసిన కాగితాలమీద పడ్డది. తన ముఖ కవళికలే గమనిస్తున్న శేఖరం వెంటనే తన సీట్లోకి వెళ్ళిపోయేడు.

ఆపుకుందామన్నా ఆగని ఏడుపు ముంచుకొచ్చింది

ఆ క్షణంలో గోపాలం బావ గుర్తుకు వచ్చేడు తను ఏడుస్తున్నకొద్దీ మరింత పకపక నవ్వుతున్నట్టూ .... "చూసేవా ఉద్యోగస్థుల మన స్తత్వాలు" అంటూ పరిహసిస్తున్నట్టుగా అన్పిస్తోంది అమలకు.

ప్యూనువచ్చి అయ్యగారు రమ్మంటున్నారని చెప్పేడు.

భయంతో చెమటలు పట్టేశాయ్ అమలకు కాఫీపడిన కాగితాలు దులిపేసి, ఇంకా తడవని కాగితాలు జాగ్రత్తగా పైన పెట్టింది తలెత్తి చూస్తే శేఖరం తన కాగితాలే టైపుచేస్తూ కనబడ్డాడు. తను చూడగానే అందుకోసమే నన్నట్టు తనూ తలెత్తి చూసి నవ్వేడు అదోలా.

ఆఫీసరు దగ్గరకువెళ్ళి టేబిలు మీద పెట్టి దూరంగా నిల్చుంది. చూడవలసినవి చూడనే చూసేరు.

"ఏవిటండీ .... ఆఫీసు కాగితాలు తడిపేసేరు? ఇవెంత ముఖ్యమైన పేపర్సో మీకు తెలుసును కదా .... ఆ మాత్రం రెస్పాన్సిబిలిటీ ఉండక్కర్లేదూ .... ఏం మాటాడరు? .... పైగా ఏమిటి ఇన్ని

తప్పులున్నయ్యిందులో ....'' అంటూ చిరమరలాడుతూ తలెత్తి చూసేరు.

''ఇవాళ నా వంట్లో బాగులేదండీ.... అంచేత....''

''అలా అనుకుంటే సెలవు పెట్టుకోవాలి...అంతేగాని పేపర్లిలా పాడుచేస్తే ఎలా?...''

సీఎల్ పెట్టుకుంటే కేన్సిల్ చేసేరండీ...''

''మాటకి మాటా జవాబు చెప్పరండీ...''అంటూ విసుగ్గా... ''మిగతా ఈ ఫైలు తాలుకు పేపర్సేవీ...'' అన్నాడు.

''అవి శేఖరంగారు చేస్తున్నారండీ.'' అని గబుక్కున నాలిక్కరుచుకుంది అమల.

''శేఖరం చెయ్యడమేమిటి? అవి మీకు ఎంట్రస్ట్ చేసేనుగదా...మిమ్మల్ని చాలా రోజులనుండీ అబ్జర్వ్ చేస్తున్నాను దీనికి ఎక్స్ప్లనేషన్ రాసివ్వండి...వెళ్ళండి.'' అంటూ కసిరేశాడు ఆఫీసరు.

తన సీట్లోకి ఎలా వచ్చిందో తనకే తెలియలేదు అమలకి.

శేఖరం వచ్చి ''ఇవిగోనండీ.... చేసేసాను.'' అంటూ ఆ కాగితాలు అమల చేతిలో పెడుతూ మళ్ళీ చేతిని తాకడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆఫీసరు కేకలూ, శేఖరం చేతలూ వినోదంతో ఇంతంత కళ్ళు చేసుకుని గమనిస్తున్నారందరూ.

''థేంక్స్....మీరు వెళ్ళండిక్కడ నుండి.'' అంటూ గట్టిగా కేకేసి టేబులు మీద వాలిపోయి భోరుమంది. అలా ఎంతసేపుండి పోయిందో ...మళ్ళా ప్యూను వచ్చి....అయ్యగారేదో రాసియ్యమన్నారమ్మా ...'' అంటూ జ్ఞాపకం చేసేడు.

వెంటనే ఓ కాగితం సర్రున చింపి చరచర రాసేసింది రాజీనామా.

* *

''నువ్వు ఉద్యోగంలో చేరేవని తెలియగానే నాకు రాజీనామా ఇచ్చేసావనుకున్నాను ..అమలా... నీకంత కోరికగా వుంటే నేనూ ఓ ఉద్యోగానికి అప్లయి చేసేదా?....''అంటూన్న గోపాలాన్ని మరి చెప్పనీకుండా తన మెత్తని చేత్తో నోరుమూసేసి అతనిమీద వాలిపోయింది అమల. అతనిన్నాళ్ళు దూరం చేసుకుని రెండువిధాలా బాధపడిన అమల హృదయంలోని వేదన తెలుసుకుని మరింతగా దగ్గరకు చేర్చుకున్నాడు గోపాలం.

కొత్తగా పెళ్ళయిన వాళ్ళకి లేని సిగ్గు .... చందమామకెందుకో గాని మబ్బులచాటుకు తప్పుకున్నాడు.



# తప్పటడుగు

పరిమళా సోమేశ్వర్

(గత సంచిక తరువాయి)

"అరె! ఒక్క రోజుకే యింత బెంగా!" అనేవాడు నవ్వుతూ.

"ఔను. మీకది ఒక్క రోజుగానే కనిపించవచ్చు. కాని నాకది ఒక యుగంతో సమానం. మీరులేని నన్ను ఊహించుకోవటానికే భయంగా ఉంటుంది నాకు. రవీంద్రా! ఎన్నాళ్ళందుకిలా హింసిస్తావు? నన్ను వేరు శరీరంగా ఎందుకు ఉండనిస్తావు? నన్ను పూర్తిగా తీసేసుకో! నన్ను నీలో లీనం చేసేసుకో" అంటూ అతనిని పెనవైచుకు పోయేది మెహర్.

ఆమె ప్రేమలోని ఉధృతాన్ని చూస్తుంటే అతనికి ఒక్కొక్కప్పుడు భయం కూడా వేసేది. ఆమె తనకోసం యింతగా పరితపిస్తోందే. ఒకవేళ తామిద్దరూ విడిపోయే పరిస్థితులు కనుక ఏర్పడినట్లయితే ఆమె ఏమైపోతుందోనని భయపడేవాడు రవీంద్ర. కాని మరుక్షణమే తనని ఆలింగనం చేసుకున్న ఆమె సుకుమార దేహ స్పర్శతో పులకరించి పోయి సమస్త విశ్వాన్నీ మరచి పోయేవాడు.

మెహర్ అతని కోసం ఎంతగా తహతహలాడి పోయేదంటే సాయంత్రం వరకు అతని కొరకు వేచియుండే సహనం లేక తరచు కాలేజీలో క్లాసులుకూడా మానేసి హాస్పిటల్‌కి వెళ్ళేది. అతనితో

పాటు కలసి వార్డులన్నీ తిరిగేవి

అది చూసి చాలా మంది నర్సులు, డాక్టర్లు, రోగులు అంతా చెవులు కొరుక్కున్నా మెహర్ లెక్క చేసేది కాదు. పైగా వాళ్ళందరికీ తమ యిద్దరి మధ్య గల సంబంధాన్ని గురించి తెలియ బరచాలనే ఉద్దేశ్యంతో అతనిని తాకుతూ అతని మీద వాలిపోతూ ఉండేది. ఆమె ప్రవర్తనకి రవీంద్ర కూడా ఎంతో ఆశ్చర్య పోయేవాడు.

"నీకెంత ధైర్యం మెహర్!" అనేవాడు.

"ఎంత ధైర్యం లేకపోతే నిన్ను నా వాడిగా చేసుకున్నాను! చిన్నతనం నుండీ కూడా సాహస కృత్యాలు చేయటమంటే నా కెంతో సరదా!" అంటూ పకపక నవ్వేది మెహర్. అలా నవ్వుతుంటే ఆమె శరీరంలోని వంపులన్నీ అందంగా కదిలేవి. వాటిలో తల దాచుకుని ప్రపంచాన్నే మర్చి పోయేవాడు రవీంద్ర.

రవీంద్ర విగ్రహంలో, చిరునవ్వులో ఎంతో ఆకర్షణ ఉంది. అందువల్ల చాలా మంది స్త్రీలు అతనితో మాట్లాడటానికి, అతనితో స్నేహం చెయ్యటానికి తహ తహలాడి పోయేవారు.

మొదట్లో అది చూసి మెహర్ గర్వ పడేది. అంత మంది స్త్రీలచేత కోరబడే పురుషుడు తనకి దాసోహ మనటం విజంగా తన అదృష్టం అనుకునేది.

కాని క్రమేణా ఆయా స్త్రీల ప్రవర్తన ఆమెలో అసూయను, అసంతృప్తిని కలిగించ సాగింది.

ఏ ఆడవాంతో మాట్లాడుతున్నా రవీంద్ర శృంగారమూర్తిలా కనపడేవాడు. కావాలని అందంగా నవ్వేవాడు వాళ్ళని కవ్వించాలని కొంటెగా చూసేవాడు. అతని పద్ధతి ఏ మాత్రం నచ్చలేదు మెహర్‌కి.

రవీంద్ర తనవంక తప్ప మరో స్త్రీ వంక అలా శృంగారంగా చూడటం ఏ మాత్రం సహించలేకపోయింది. రవీంద్ర తనవాడు. తనని ప్రేమించేడు తనని స్వంతం చేసుకున్నాడు. అలాటప్పుడు అతనిలోని ప్రేమ, మోహం, శృంగారం అంతా తన కొక్కదానికే పరిమితమై పోవాలి. అతను లోకానికి కేవలం డాక్టర్ గానే ఉండాలి. తనకి మాత్రమే పురుషుడు అనుకునేది మెహర్.

ఇలా రవీంద్ర యితర స్త్రీలతో చనువుగా మాట్లాడుతున్నప్పుడల్లా మెహర్ మనసు ఆలోచనలతో కుతకుత ఉడికి పోయేది. అసూయతో భగభగ మండి పోయేది. తన అసమ్మతిని ఖచ్చితంగా అతనితో చెప్పేయాలనుకునేది. కాని అతను తనదగ్గరకు వచ్చి తన బలిష్ఠమైన బాహుబంధంలో తనని నలిపివేస్తుంటే ఆ మధురమైన బాధలో మిగతా బాధ లన్నిటినీ తేలికగా మర్చిపోయేది. ఆ దివ్య క్షణాలలో రవీంద్ర తనవాడే పూర్తిగా తనవాడేనన్న ధైర్యం, విశ్వా

వం కలిగేవి.

కాని ఒకరోజున హోటల్లో తామిద్దరూ కూర్చుని బీర్ త్రాగుతుంటే ఎవరో యిరవై యేళ్ళ నవనాగరిక సుందరి వచ్చి "హల్లో!" అంటూ రవీంద్రని కౌగలించుకున్నంత పని చేసింది.

మొదటి చూపులోనే ఆమె తనకంటె అందంగా ఆకర్షణీయంగా ఉన్నదని గ్రహించిన మెహర్ మనసు చిన్నబుచ్చుకుంది. దానికి తగ్గట్టు రవీంద్రకూడా ఆ యువతి సౌందర్యాన్ని కళ్ళతోనే త్రాగి వేస్తూంటే మరింత రెచ్చిపోయింది. షేక్ హాండిచ్చిన ఆమె చేతిని సుతారంగా ముద్దాడి 'యీమె మిస్ మెహరున్నిసా' అంటూ పరిచయం చేసేడు.

"ఐ సీ" అంటూ దీర్ఘం తీస్తూ అప్పుడే వచ్చిన బోయ్ ఫ్రెండుతో కలిపి మరో టేబుల్ దగ్గరకు వెళ్ళిందా జవరాలు.

నల్లగా మాడిపోయిన మెహర్ ముఖం వంక చూస్తూ రవీంద్ర ఒక్కసారిగా నవ్వేసి "అరె! అదేమిటి? అలా ఉన్నావ్? ఒంట్లో బాగా లేదా?" అనడిగేడు.

"ఏం లేదు...." అంది బలవంతాన కళ్ళనీళ్ళను ఆపుకుంటూ మెహర్. ఆమె హృదయంమాత్రం అవమానంతో దహించుకుపోతోంది.

హోటల్ నుండి బయటకు వచ్చేక "ఇంక నేను ఇంటికి వెళ్తాను" అంటూ సరాసరి టాక్సీదగ్గరకు నడచివెళ్ళింది.

"టాక్సీ ఎందుకు? నా కార్లో డ్రాప్ చేస్తాను" అన్నాడు రవీంద్ర.

"అవసరం లేదు" అంటూ విసురుగా వెళ్ళి టాక్సీలో కూర్చుంది.

ఆమె మనశ్శరీరాలు ఆవేశంతో, అవమానంతో, ఉక్రోషంతో దహించుకు పోతున్నాయ్ రవీంద్రకి తానొక్కతే కాదు ప్రేయసి. తనలాటి స్త్రీలు ఎందరో! హాస్పిటల్లో అతని చిరునవ్వుకు దాసోహం కాని నర్సులేదు ఆతని చూపుల బాణాలకు గురికాని స్త్రీ లేదు. తనకి రవీంద్రతో పరిచయమైన కొత్తలో క్వార్టర్స్లో అతని వెంట ఎందరో స్త్రీలుండటం చూసింది. రవీంద్ర నిజంగా శీలవంతుడైతే అంత మంది స్త్రీలతో ఎందుకు తిరుగుతాడు? ఈరోజుమాత్రం ఎవత్తో షేక్ హాండిస్తే తన కళ్ళ యెదటనే ఆమెచేతిని ముద్దు పెట్టుకుంటాడా? ఎంత సాహసం! ఆమె వంక అతను చూస్తున్నప్పుడు ... ఆ చూపులకు తన వళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకినట్లయింది. తనవంక చూసిన ఆ కళ్ళే మరో స్త్రీవంక అలా చూస్తుంటే తనెలా సహించగలదు? రవీంద్ర తన కళ్ళముందే అలా ప్రవర్తించటం తనని అవమానించటానికి కాదూ? పైగా ఆ స్త్రీ చాలా ఆడంబరంగా అలంకరించుకుంది. ఆ అలంకరణలో తనకంటె ఆమె ఆకర్షణీయంగా కనపడుతోంది. లోకంలోని స్త్రీలందరూ తనకంటె అందంలో తక్కువగా ఉండాలని తనేమీ అనుకోదు.

రవీంద్ర కంటికి తానొక్కతే అందంగా కనపడాలి. మరే స్త్రీకూడా అతనిలోని పురుషత్వాన్ని ఆకర్షించకూడదు. అదే తన ఉద్దేశ్యం.

రవీంద్ర తనలా ఆలోచించడా? అతను తనంత సెన్సిటివ్ కాదా? సెన్సిటివ్‌గా లేని మనిషి మరి తన నెలా ప్రేమించగలిగేడు? తనకోసం అంతగా ఎలా పరితపించగలిగేడు? అదంతా తన పొందుకోసం ఆడిన నాటకమేనా? తను లొంగిపోయేక తనమీద వ్యామోహం తగ్గిపోయిందా? ఇప్పుడుమాత్రం తను కోపంగా టాక్సీలో వచ్చేస్తుంటే "ఎందుకు? ఏమిటి?" అని అడగలేదే? తన మనసు బాగాలేదని తెలిసికూడా కారణం అడగకపోవటంలో అతని ఉద్దేశ్యం యేమిటి నిర్లక్ష్యమా? అహంకారమా?

అలా ఆలోచిస్తున్న కొలదీ తనని రవీంద్ర అవమాన పరుస్తున్నాడన్న భావం దృఢపడిపోయి ఆమె మనసు గాయపడింది. ఎంత ఆపుకుందామన్నా కన్నీరు ఆగలేదు.

టాక్సీలో సీటు వైపుకు చేరగిలబడి కూర్చుని నిశ్శబ్దంగా కన్నీరు కార్చింది మెహర్. ఆ సమయంలో ఆమెకు యీ ప్రపంచంలో తాను ఒంటరి దానినైనట్లు తనకి జీవించటానికి అవసరమైన కారణా లేవీ లేనట్లు అనిపించింది.

తమ వీధిలోకి వచ్చేసరికి దక్షి గోపాలం, అతని మిత్రబృందం యధాప్రకారం బిలబిలమంటూ బయటకు వచ్చి తొంగిచూసేరు.

"ఒంటిగా వస్తివేమి రామచిలకా?" అని ఒకడంటే

"జంటనేద వదిలేవే రామచిలకా?" అని మరొకడందుకున్నాడు.

"ఇవ్వాళ పాపం డాక్టర్‌సాబ్‌కి నైట్ డ్యూటీ ఉందేమో! అందుకే మెమ్‌సాబ్ చీకటి పడక ముందే యింటికి దయ చేస్తున్నారు."

"ఐతే యీ రాత్రంతా విరహతాపం తప్పదన్నమాట!"

"అన్నమాటే!"

ఆ వాక్యాలన్నీ శ్రద్ధగా విన్న మెహర్ సిగ్గుతో, అవమానంతో కుంచించుకుపోయింది. "ఐతే వీళ్ళకు తన కథంతా తెలుసన్నమాట! చివరికి ఎంత నికృష్టంగా మారిపోయింది తన బ్రతుకు! ఇంతటి అల్పుల చేతకూడా వెక్కిరింప బడుతోందంటే దానికి కారణం ఎవరు? ముమ్మాటికీ తనే! తనే చేతులారా తనజీవితాన్ని నాశనం చేసుకుంది. డాక్టర్ వివాహితుడని తెలిసీ అతనితో శారీరక సంబంధాన్ని పెంచుకుంది. అతనితోటి సంపర్కం వల్ల తనకు సంఘంలో గౌరవ మర్యాద లుండవని తెలిసీ అతని ప్రేమలో తానాహుతి అవటానికి సిద్ధపడింది. ఐతే యిదంతా ఎందుకు చేసింది? రవీంద్ర - కోసం—కేవలం అతని ప్రేమకోసం.

అతనివంటి పురుషుడంటే తనకి చాలా యిష్టం. అలాంటి పురుషుడు ఎక్కడున్నా ఎలాటి స్థితిలో ఉన్నా అతని ప్రేమను పొందటమే ముఖ్యమనుకుని పండంటి తన జీవితాన్ని నాశనం చేసుకుంది కాని దేనికోసం తా వింతటి త్యాగాన్ని చేసిందో అదే తనకి దక్కకుండా పోతుందేమోనన్న సందేహం తన నావరించుకుంది. ఇప్పుడేది దారి? ఏది దారి?

ఇంటి దగ్గర టాక్సీ ఆగింది.

మెహర్ సరాసరి తన గదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకుని మంచం మీద పడి కరువుదీరా ఏడ్చింది. అలా అరగంట సేపు ఏడ్చేసరికి ఆమెకి నీరసం వచ్చేసింది. ఇంక ఏడ్చేశక్తి కూడా లేక నిస్సత్తువగా పడుకున్న సమయంలో గది తలుపును ఎవరో మెల్లగా తట్టిన శబ్దం వినపడింది. మొదట ఆమెకు లేవబుద్ధికాలేదు. కాని అదే పనిగా కొట్టటంతో యిక తప్పని సరిగా లేచివెళ్ళి తలుపు తీసింది మెహర్.

ఎదురుగా రవీంద్ర!

"మీరా!" అంది ఆశ్చర్యంగా.

"ఔను. నేనే!" అన్నాడు చిరునవ్వుతో రవీంద్ర.

ఆ చిరునవ్వును చూస్తూనే ఆమె మనసులోని విషాద ఛాయలన్నీ చెల్లాచెదరైపోయినయ్.

ఆమె రెండడుగులు వెనక్కి వేసింది. రవీంద్ర వెంటనే తలుపు గడియపెట్టి ఆమెనమాంతం ఎత్తుకుని మంచం మీద పడేసేడు.

"అబ్బ! ఏమిటది? మావాళ్ళు—ఎవరైనా చూస్తే....?" అన్నది కంగారుగా మెహర్ ..అతని నుండి విడిపించుకోవటానికి ప్రయత్నిస్తూ.

"చూడనీ! నాకేం భయం? ఈ మెహర్ నాది. నా యిష్టం వచ్చినట్లు చేసుకుంటాను. ఎవరికున్నది నన్నడిగే హక్కు?" అంటూ ఆమెకు మళ్ళీ మాట్లాడే అవకాశం యివ్వ లేదు రవీంద్ర.

ఊపిరిసలపని క్షణాలు గడచిపోయిన తరువాత అతని ఒడిలో నిస్సత్తువగా. తృప్తిగా పడుకుంది మెహర్.

విడిపోయిన ఆమె వెంట్రుకలతో ఆడుకుంటున్నయ్ అతని చేతి వ్రేళ్ళు.

"మెహర్!" అని పిల్చేడు రవీంద్ర.

"ఊఁ!" మత్తుగా సమాధానమిచ్చింది మెహర్.

"ఇందాక నామీద కోపం యెందుకు వచ్చిందో యిప్పుడు చెప్పు"

"నువ్వు ఎంత గడుసువాడివి రవీంద్రా! ఈ సమయంలో నీమీద కోపం తెచ్చుకోలేనని తెలిసే నన్నీ ప్రశ్న అడుగుతున్నావు కదూ?" అంది నవ్వుతూ మెహర్.

"ఉహూఁ! నిజంగానే నీకు నామీద కోపం వచ్చిందన్న ఆలోచనను నేను భరించలేకపోయేను. ఇంటికి వెళ్ళినాక నాతో చెప్పకుండా నువ్వు వెళ్ళిపోయేవని

వేనెంతో బాధపడ్డాను. అక్కడ హోటలు దగ్గర అందరిముందూ నిన్ను అడగటం యిష్టంలేక అడగలేదు. కాని యింట్లో అరగంటసేపు పిచ్చిపట్టినట్లు తిరిగి చివరకు నీ దగ్గరకు వచ్చేను. నీతో గడపని దినం నాకు నిజంగా దుర్దినం'' అన్నాడు రవీంద్ర.

మెహర్ అతని మాటలకు చలించి పోయింది. ''నీ గురించి ఎన్ని అపోహలు పెంచుకుని బాధపడ్డానో తెలుసా?'' అంది మెహర్.

''అపోహా? ఎందుకు?''

''హోటల్లో ఆమె చేతిని ముద్దు పెట్టుకున్నపుడు నాకెంత బాధ కలిగిందో నీకెలా చెప్పను?''

''అందుకా నీకంత కోపం వచ్చింది? అబ్బ! నీలో యింత అసూయ ఉన్నదని నేనెప్పుడూ అనుకోలేదు.''

''ఎక్కడ ప్రేమ ఉంటుందో అక్కడ అసూయకూడా ఉంటుంది. నేను నిన్ను సంపూర్తిగా ప్రేమిస్తున్నాను కనుక నువ్వుకూడా నన్ను అంత గొప్పగానూ ప్రేమించాలని కోరుకుంటాను. నువ్వలా ప్రేమించలేవని కాని, ప్రేమించటం లేదని కాని తెలిస్తే నా మనసు ముక్కలై పోతుంది రవీంద్రా! నా స్వభావాన్ని నీకెలా తెలియజేయాలో నాకర్థం కావటం లేదు రవీంద్రా! అధికప్రేమతో నిండిన హృదయం గాలితో నిండిన బెలూన్ లాంటిది. ఏమాత్రం చిన్నతాకిడి తగిలినా అది పగిలిపోవచ్చు. నా ప్రేమను అర్థం చేసుకోవాలంటే నువ్వు కూడా నేను ప్రేమించినంత గొప్పగా ప్రేమించాలి. ప్రేమించగల హృదయమే మరొకరి హృదయంలోని ప్రేమను అర్థం చేసుకో గలదు. ఏ కారణంచేతనైనా నా ప్రేమ వ్యర్థమైపోయిందనీ నా ప్రేమకు తగ్గ ప్రతిఫలం లభించలేదనీ గ్రహిస్తే అప్పుడు నే నేమైపోతానో నేనే ఊహించ లేకపోతున్నాను'' అంటూ కన్నీరు కార్చింది మెహర్.

''పిచ్చి మెహర్! ఎందుకా కన్నీరు! నీవంటి ప్రేయసి లభించటం నిజంగా నా అదృష్టం. నీ ప్రేమకు అన్నివిధాలా అర్హుడి నవటానికే ప్రయత్నిస్తాను. ఇక నుండి ఎప్పుడూ నీ మనసును నొప్పించే లా ప్రవర్తించను. సరేనా?'' అంటూ ఆమె బుగ్గలమీద కారుతున్న కన్నీటిని తుడిచి అక్కడ తన పెదవులతో సున్నితంగా తాకేడు రవీంద్ర.

''ఇంక తలుపులు తీద్దాం. ఎవరైనా రావచ్చు' అంటూ చటుక్కున మంచం మీదనుండి లేచి తలుపు తెరచింది మెహర్.

రవీంద్రకూడా ఆమెతో కలసి బయటకు వచ్చేడు. బయట యేదో సందడిగా ఉంటే యిద్దరూ అటు చూసేరు.

నౌకరు ఒక ఖరీదైన సూటుకేసును పట్టుకువస్తుంటే వెనక పాషా నడుస్తూ వస్తున్నాడు.

హఠాత్తుగా ఉత్తరమైనా వ్రాయకుండా ఊడిపడ్డ పాషాని చూస్తూనే గతుక్కుమన్నది మెహర్.

తల్లి, వదిన అంతా పాషాని కుశల ప్రశ్నలు వేస్తున్నారు. అందరికీ వినయంగా సమాధానాలిచ్చి పాషా యిటు చూస్తూనే ఎదురుగా నిలబడ్డ రవీంద్రను, అతనిపక్కనే నిల్చున్న మెహర్‌ని చూసి ముఖం చిట్లించేడు.

"హల్లో! డాక్టర్ సాబ్! హౌ ఆర్ యూ?" అంటూ కృత్రిమహాసం చేస్తూ డాక్టర్‌తో కరచాలనం చేసేడు పాషా.

"నైస్! ఐయామ్ వెరీ గ్లాడ్ టు సీ యు ఎగైన్...." అన్నాడు రవీంద్ర

"ఏం మెహర్? అలా ఉన్నావేం? డాక్టర్‌గారెందుకు వచ్చేరు? నీ ఆరోగ్యం బాగాలేదా?" అనడిగేడు.

అతని ప్రశ్నలన్నిటికీ సమాధానంగా ఒక చిరునవ్వు నవ్వింది మెహర్.

కాని మనసులో మాత్రం "నా ఆరోగ్యానికేం? లక్షణంగా ఉంటేరా చంటూ! డాక్టర్ వచ్చింది నా శరీరారోగ్యాన్ని చక్కబెట్టటానికి కాదు. నా మనసులో మల్లెలు కురిపించటానికి. ఐనా ఆ వివరాలన్నీ నీకెందుకు పో!" అనుకుంది

పాషా డాక్టర్‌నీ, మెహర్‌నీ మార్చి మార్చి చూసేడు. చెదిరిఉన్న ఆమె జుట్టు ఆమెదుస్తులతీరు అన్నీ అతనిలో అనుమానాన్ని కలిగించినయ్. అంతేకాదు. క్రితం సారి తాను చూసినప్పటికన్న యిప్పుడు మెహర్‌లో ఎంతో మార్పువచ్చినట్లు అతనికి స్పష్టంగానే తెలిసిపోయింది. పాషా మోటుకు బ్రహ్మచారికాదు. స్త్రీ యొక్క శరీరంలోని సూక్ష్మతి సూక్ష్మమైన రేఖలన్నిటికీ వ్యాఖ్యానం చెప్పగల అనుభవం తగినంత ఉన్నవాడే! అందుకే ఆమె యిప్పుడు కన్యకాదు అని యిట్టే గ్రహించగలిగేడు. దాంతో అతని హృదయం దహించుకు పోయింది.

డాక్టర్‌ని అక్కడే అమాంతం మెడకాయ పిసికి చంపేయాలనుకున్నాడు. ఎలాగో బలవంతాన తన భావాలను మనసులోనే దాచుకుని డాక్టర్‌తో మాట్లాడేడు.

రవీంద్ర పది నిమిషాలుండి వెళ్ళిపోయేడు. అతను వెళ్ళగానే మెహర్ పాషా వంక చూడనైనా చూడకుండా నిర్లక్ష్యంగా తనగదిలోకి వెళ్ళిపోయింది.

ఆ మర్నాటినుండీ పాషా ఆమెమీద నిఘావేసి ఉంచేడు. ప్రతి రోజూ సాయంత్రం అందంగా అలంకరించుకుని బయటకు ఒంటరిగా వెళ్ళటం, తిరిగి రాత్రి పొద్దు పోయేక యింటికి వస్తే ఉన్నంతసేపూ మెహర్‌నే చూస్తూ కళ్ళతోనే ఆమె సౌందర్యాన్ని త్రాగివేస్తూ గడపటం, అతను వెళ్ళేక చాలాసేపటి వరకు మెహర్ ఉగుబుగా ఉండటం అన్నీ గమనించిన పాషాకి సమస్తమూ అర్థమైపోయింది.

ఓ రోజు సాయంత్రం ఒంటరిగా తోటలో వున్నపుడు ఆమెదగ్గరకు వెళ్ళి ఆమెను మందలించేడు కూడా.

"చూడు మెహర్. నువ్విలా ఆ డాక్టర్‌తో చనువుగా తిరగడం నాకేమాత్రం నచ్చలేదు." అని ముఖం మీదనే అన్నాడు. కుండ బద్దలు కొట్టినట్లు.

"నీకు నచ్చకపోతే దానికి నేనేం చెయ్యను?" అంటూ మెహర్ కూడా నిర్లక్ష్యంగానే సమాధాన మిచ్చింది.

"చెయ్యవలసింది నువ్వు కాదు. నేను." అన్నాడు పళ్ళునూరుతూ.

"ఏం చేస్తావో చేసుకో" అంది తలెగరేస్తూ.

"ఏం చేస్తానా? నువ్వు కనుక నేను చెప్పినట్లు వినకపోయేవంటే చంపేస్తా" అంటూ జేవురించిన ముఖంతో ఆమె వంక క్రూరంగా చూస్తూ రెండు చేతులతో, ఆమె భుజాలను గట్టిగా నొక్కిపట్టేడు పాషా.

అతని కుడి చేతిని తన రెండు చేతులతోనూ తీసి గట్టిగా కొరికింది మెహర్.

"అబ్బా!" అంటూ రెండడుగులు వెనక్కివేసి బాధగా చేతిని నోట్లో పెట్టుకున్నాడు పాషా.

బుసలుకొడ్తూ లేచి నిల్చుంది మెహర్. "అర్థమయిందా యిప్పుడు నే నెవర్నో? త్రాచుపాముని. ముట్టుకుంటే కాటేస్తాను. జాగ్రత్త!" అంది నిలువెల్లా ఉద్రేకంతో వణికిపోతూ మెహర్.

"ఔను. నిజంగా నువ్వు త్రాచుపామువే! ఆడదానివి కానేకావు. చూస్తాను. ఆ ముగ్గురపిల్లల తండ్రితో— ఆ ఐచ్ఛాగాడితో యెన్నాళ్ళు కలుసుతావో నేనూ చూస్తాను. చివరికి వాడి చేతిలో నీ బ్రతుకు కుక్కలు చించిన విస్తరిలా మారి, నువ్వు సర్వనాశనం అయ్యేరోజు ఎంతో దూరంలోలేదు. అప్పుడైనా నువ్వు నా కాళ్ళమీద పడకపోతావా?" అన్నాడు దెబ్బతిన్న అహంభావంతో. అవమానంతో పాషా.

"రవీంద్ర చేతిలో నిజంగా నేను సర్వనాశనమైపోతే దానికి నేనేం బాధపడను. అతనిని నేను ప్రేమించేను. అతనికోసం నేనేమైపోయినా నాకు పరవాలేదు. కాని ఒక్క విషయంమాత్రం గుర్తుంచుకో. ఎలాటి పరిస్థితులలోనైనా సరే నా కంఠంలో ఊపిరి ఉన్నంతవరకు నేను నీ పాదాలమీద పడను. నీలాటి అల్పుడు, అల్పుడు అయిన పురుషుడి ముందు ప్రేమభిక్షను కోరను. సరేనా?" అంది మెహర్.

ఆమె అంటున్న వాక్యాలన్నీ ఒక్కొక్కటిగా అతని గుండెలో బాకుల్లా గుచ్చుకుంటుంటే తన బాధని, అవమానాన్ని మాటలలో వెల్లడిచేసే శక్తిలేక "థూ" అని ఉమ్మేసి అక్కడనుంచి వెళ్ళిపోయేడు పాషా.

ఆ రాత్రే అతను లక్నో ప్రయాణమై వెళ్ళిపోయేడన్న వార్త విని తేలికగా ఊపిరి పీల్చుకుంది మెహర్.



టానిక్ ఏదైనా ఆకలిని మాత్రమే పెంచగలిగితే
అది సగం పనిని మాత్రమే చేసినట్లు అవుతుంది

ఇన్‌క్రీమిన్* ఇవ్వండి...
అది అధిక ఆహారమును అధిక పెరుగుదలగా
మారుస్తుంది.




*
ఇన్‌క్రీమిన్ దళంలో చేరండి...
పెరుగుదల నిచ్చు ఆకలి పొందండి!

పెద్ద పిల్లలకు (ఐరన్‌తో కూడిన)
ఇన్‌క్రిమిన్ సిరప్— 175 మి.లి 57 మి. లి.
ఇన్‌క్రిమిన్ డ్రాప్స్ పసి బిడ్డలకు 10 మి. లి.

# *ఇన్‌క్రీమిన్

టానిక్

అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్
ట్రేడ్ మార్కు

లింటాస్-INC. 21-300 TE




Lederle

అన్ని మందుల షాపుల్లో
లభిస్తున్నది

## 12

ఒకరోజు సాయంత్రం వగర్చుకుంటూ వచ్చేడు రవీంద్ర.

"ఏమిటలా ఉన్నావ్? ఏమయింది?" అంటూ ఆత్రంగా అడిగింది మెహర్.

"నేను... నేను . వెళ్ళిపోతున్నాను" ఆయాసంగా అన్నాడు రవీంద్ర.

"ఎక్కడికి?"

"వరంగల్ ట్రాన్స్‌ఫరయింది నాకు— ప్రొమోషన్‌మీద."

"నిజంగానా? కాదు. అబద్ధం! అబద్ధం!" అంటూ అరచింది మెహర్.

"నిజం మెహర్! అందుకే నాకింత బాధగా ఉంది"

"ఐతే వెళ్ళిపోక తప్పదా?" అంటూ అతని భుజంమీద వాలి వెక్కి-వెక్కి ఏడ్చింది మెహర్.

"నేనంటే నీకెందు కింత ప్రేమ చెప్పు మెహర్?"

"ప్రేమకు కారణాలు లేవు రవీంద్రా! ఆ సంగతి నీకూ తెలుసు ఎలాగైనా యీ ట్రాన్స్‌ఫర్ కాన్సెల్ అయేటట్లు చూడు. నువ్వు లేనిదే ఒక్క రోజుకూడా జీవించ లేను నేను." (ఇంకా వుంది)

---


**FORM IV**

**(See Rule 8)**

1. Place of Publication ... 1, Arcot Road, Madras-26.
2. Periodicity of its publication ... MONTHLY
3. Printer's Name .. Sri G. VEERA BRAHMAM for Anuradha Acchagam

Nationality INDIAN

బట్టలను
అతి తెల్లగా
ఉతుకుతుంది

రంగు బట్టలను
అత్యంత
ప్రకాశవంతముగా
ఉతుకుతుంది

బట్టలకు
చేతులకు
ఎంతో
నిరపాయమైనది




## క్రొత్త త్రివిధ ఉపయుక్తమైన డెట్

* క్రొత్త డెట్ హెచ్చు తెల్లని కాంతిగ—ఇస్తూ బట్టలను అతి తెల్లగా ఉతుకును మేలు రకపు పదార్థము.
* క్రొత్త డెట్ బట్టలను అదనముగా శుభ్రపరచే శక్తిగలది అంటుకొన్న మురికిని కూడ వదలించి, రంగు బట్టలను ప్రకాశవంతముగా చేస్తుంది.
* క్రొత్త డెట్ యిచ్చే సమృద్ధియైన నురుగులో ఒక ప్రత్యేకమైన మృదువుగా చేయు పదార్థముంది అది బట్టలకు ఎంతో నిరపాయమైనది మరియు చేతులకు ఎంతో మృదువుగా ఉంటుంది!

5 క్రొత్త సైజులు:
డెట్ 200, 400, 600, 800, 1000

Shilpi-HPMA 61F/71 Tel



ఉన్నీబలాదూర్ —

One Rupee
& Fifty Paise

Regd. No. M 8647
H 980